# తెలుగు వాచకం

## అయిదో తరగతి



రచయితలు :
శ్రీ ఎస్. నారాయణరావు
డా. కుంటముక్కల లక్ష్మీనారాయణ శర్మ
సంపాదకుడు :
ఆచార్య కేతు విశ్వనాథ రెడ్డి



సుభాషితరత్నావళి సంపాదకుడు :
డా. వి. వి. యల్. నరసింహారావు
ప్రధాన సంపాదక మండలి :
ఆచార్య కె. కె. రంగనాథాచార్యులు – అధ్యక్షులు
డా. వి. వి. ఎల్. నరసింహారావు – సభ్యులు
డా. అంతటి నరసింహం – సభ్యులు
చిత్రకారుడు :
శ్రీ టి. వీరస్వామి
ముఖపత్రాలంకరణ
శ్రీ వినోద్‌కుమార్



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ
హైదరాబాదు

అంటరానితనం నేరం
అంటరానితనం పాపం

అంటరానితనం అమానుషం
అంటరానితనం రాజ్యాంగానికే విరుద్ధం

# పరిచయం

ఈనాడు భాషావసరాలు విస్తృతంగా పెరిగాయి. సాహిత్యావసరాల కోసమే కాకుండా విషయ ప్రధానమైన వివిధ శాస్త్ర, శాస్త్రేతర అంశాలను గ్రహించడానికీ, వ్యక్తీకరించడానికీ భాషను వినియోగించుకొంటున్నాం. ఈనాటి పాఠకుల్లో కొందరు సాహిత్యంలో కృషి చెయ్యడం కోసం భాషను అభ్యసించవచ్చు. మరికొందరు ఇతర ప్రయోజనాల కోసం అభ్యసించవచ్చు. ఇతర ప్రయోజనాలంటే సామాజిక శాస్త్రవిషయాలనో, శాస్త్రవిజ్ఞాన విషయాలనో భాషద్వారా అభ్యసించడం అన్నమాట. భాషావసరాలు పెరిగేకొద్దీ భాషా బోధనా వ్యూహం కూడా మారుతుంది. ఈ మౌలిక లక్ష్యంతో విద్య నేర్చుకొనే ఈనాటి బాలబాలికల సామాజికావసరాలను, భాషావసరాలను దృష్టిలో ఉంచుకొని ఈ పాఠాలను రూపొందించడం జరిగింది.

ఈ మౌలిక లక్ష్యాలకు స్ఫూర్తి 1986 నాటి మన జాతీయ విద్యావిధానం. దీనిలో పొందుపరిచిన లక్ష్యాల ఆధారంగా ఆచార్య కె.కె.రంగనాథాచార్యుల అధ్యక్షతన ఒక ప్రత్యేక సంఘం ఒకటో తరగతినుండి పదో తరగతి వరకు పాఠ్యప్రణాళికను రూపొందించింది. ఈ పాఠ్యప్రణాళికను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జి. ఓ. ఎం. ఎస్. నెం. 353 (Edn.) dated 9-10-1992 ద్వారా ఆమోదించింది.

అయిదో తరగతి విద్యార్థుల మానసిక స్థాయిని, జిజ్ఞాసను దృష్టిలో ఉంచుకొని పాఠ్యాంశాల ఎంపికలో కథలను, వ్యాసాలను, సంభాషణాత్మక రచనను, లేఖలను, లేఖాసమాధానాలను పరిచయం చేయడం జరిగింది. జానపదకథ, జంతుప్రధాన కథ, సామాజిక కథ – వీటిలో రచనాశైలీ భేదాలను గుర్తించగలిగేట్లు ఒక [illegible] పాటించడం జరిగింది. అట్లాగే వివిధాంశాలకు సంబంధించిన వ్యాసాలను, జీవిత చరిత్ర రచనలను పరిచయం చేయడం జరిగింది. సృజనాత్మక వచనరచనల్లో ఉపయోగించే భాషకు ఇతర వచనరచనల్లో ఉపయోగించే భాషకు మధ్య ఉండే భేద సాదృశ్యాలను ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులు బాలబాలికల అవగాహనకు తేగలరనే విశ్వాసంతో వచన రచనల్లో ఒక శ్రేణిని ఏర్పరచడం జరిగింది.

వచనరచనలతోపాటు, వాటి మధ్య మధ్య పాడుకోవడానికీ, వర్ణించడానికీ, మననం చేసుకోవడానికీ వీలుగా ఉండే ఒక గేయాన్నీ, కొన్ని సుభాషితాలనూ, శతకపద్యాలనూ పొందుపరచడం జరిగింది. పొడుపు కథలను కూడా చేర్చడంలో ఉద్దేశం బాలబాలికల జిజ్ఞాసను, కల్పనాశక్తిని, తక్షణ ప్రతిస్పందనను ప్రోత్సహించడమే.

పాఠ్యాంశాలలోని భాషా స్థాయి అధికమనిపించవచ్చు. కానీ ప్రసార సాధనాల ద్వారా పరిసరాల ద్వారా తగినంత మౌళిక భాషను గ్రహించిన బాలబాలికలకు, ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులు సులభంగా అందుబాటులోకి తేగలరని నమ్మకం.

అభ్యాసవేదికలో భాషా నైపుణ్యాల అభివృద్ధికి అవసరమైన అంశాలను రూపొందించడం జరిగింది. బాలబాలికలకు తమంతట తామే గ్రహించగలిగిన సూచనలు పొందుపరచడం జరిగింది. అభ్యాసాలు చేయడంలోను, సూచనలు పాటించడంలోను మార్గదర్శకత్వం వహించవలసినవారు ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులే.

ప్రాథమిక విద్యలో అనుసరిస్తున్న కృత్యాధార బోధనా విధానాన్ని (Activity based technique of teaching) ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులు వాస్తవం చేయగలరనే నమ్మకంతో వారి అనుభవ సామర్థ్యాల మీద విశ్వాసంతో వారికి కొన్ని సూచనలు పొందుపరచడం జరిగింది. అన్ని తరగతులకు మాదిరిగానే అకారాది క్రమంలో పద పట్టికను ఇక్కడ కూడా ఇవ్వడం జరిగింది. నిఘంటువులను చూసే అలవాటు దీనిద్వారా బాలబాలికలకు ఏర్పడవచ్చు.

మన రాష్ట్రంలో అనేక మాండలిక రూపాలు వ్యాప్తిలో ఉన్నాయి. అయితే తెలుగు వాచకాల్లో ఒకే రూపమైన ఆధునిక ప్రమాణ భాషను ఉపయోగించడం జరిగింది. ఇందుకు కారణం ఈ భాష ఉపన్యాసాల్లో, సినిమాల్లో, రేడియోలో, పత్రికల్లో వాడటమే. ఆయా ప్రాంతాల్లోని ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులు బోధించే సమయంలో ఈ అంశాన్ని గమనించగలరు.

ఈ వాచకంలో ' సుభాషితరత్నావళి ' ని చేర్చడం జరిగింది. వీటిని నేరుగా విద్యార్థులే చదువుకోవాలనే ఉద్దేశంతో మాత్రం చేర్చలేదు. భారత రాజ్యాంగంలోని లౌకిక సూత్రాలకు అనుగుణంగా విలువలతో కూడిన విద్యా విధానాన్ని ప్రవేశపెడుతున్నాం. వ్యక్తిగతమైన విలువలు, సామాజికమైన విలువలు, జాతీయమైన విలువ విద్యార్థి తరానికి అందించాల్సిన బాధ్యతను గుర్తించి ప్రభుత్వం ఈ ప్రయత్నం చే _ ంది. పాఠశాలల్లో ఉపాధ్యాయులు, ఉపాధ్యాయినులు ఇంటివద్ద పెద్దలు తాము సా నంగా చదివి అవగాహన చేసికొని బాలబాలికలకు ఇందులోని విషయాలు బోధపరిచి వాటిని ఆచరణ సాధ్యం చెయ్యాలని సంకల్పం. సాధారణ పాఠాలతోబాటు ఉన్నత మానవత్వపు విలువల్ని వివరించే ఈ అంశాలు బాలబాలికలకు తెలిస్తే వారు ఉత్తమ మానవులుగా, ప్రేమమూర్తులుగా రూపొందే అవకాశం కలుగుతుంది. అందుకు విద్యావ్యవస్థతో సంబంధమున్న ప్రతిఒక్కరూ సహకరిస్తారనే మా నమ్మకం.

ఈ పాఠ్యాంశాలను రూపొందించటంలో కింది గ్రంథాలను సంప్రదించటం జరిగింది. ఈ గ్రంథాల సంపాదకులకు, రచయితలకు కృతజ్ఞతలు. జానపదకథలు (డా. జి. ఎస్. మోహన్), మిఠాయి పొట్లం (తురగా జానకీరాణి), త్రివేణి (సంపాదకవర్గం), గేయకథలు (డా. మహీధర నళినీమోహన్), ఆంధ్రప్రభ (ఎస్. రామన్), ఆంధ్రప్రదేశ్ పర్యావర్ణ స్థితి, ప్రజావేదిక (గా విజ్ఞాన పరిషత్), లోకాలోక్యం (ఉదయవర్లు), వెలుగుబాటలు (కవిరావు), పసిడి ర (న్యాయపతి రాఘవరావు).

ఈ పాఠ్యాంశాలకు సంబం ంచిన సలహాలను ఇవ్వదలచినవారు వాటిని నేరుగా పాఠశాల విద్యాశాఖ సంచాలకులవారి కార్యాలయానికి పంపవచ్చు.

—ం—

# విషయసూచిక



—o—

# వందేమాతరం

— బంకించంద్ర ఛటర్జీ

వందేమాతరం

సుజలాం సుఫలాం మలయజ శీతలాం

సస్యశ్యామలాం మాతరం; వందేమాతరం

శుభ్రజ్యోత్స్న పులకిత యామినీం

పుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం

సుహాసినీం సుమధుర భాషిణీం

సుఖదాం వరదాం మాతరం వందేమాతరం.

**భావం :** భారతమాతకు వందనం. తియ్యని నీటితో, కమ్మని పండ్లతో, చల్లని గాలులతో, పచ్చని పైర్లతో విలసిల్లే భారతమాతకు వందనం. రాత్రులు తెల్లని వెన్నెలలతో పులకిస్తూ విరబూసిన చెట్లతో శోభిస్తూ స్వచ్ఛమైన నవ్వులతో, మధురమైన మాటలతో మాకు సుఖాలు కలిగిస్తూ వరాలనిచ్చే భారతమాతకు వందనం.

**ఉపాధ్యాయులకు సూచన :**

స్వాతంత్ర్యసమరంలో వందేమాతరం గీతం యావద్భారతదేశాన్ని ఉత్తేజితులను చేసింది. దీన్ని స్వాతంత్ర్య విప్లవగీతంగా భారతీయులందరూ గానం చేశారు. ఇది బ్రిటిష్ సామ్రాజ్యానికి వ్యతిరేక సింహగర్జనలా మారుమ్రోగింది. దేశభక్తికీ, స్వాతంత్ర్య పిపాసకూ ఈ గీతం ప్రతీకగా నిలిచింది. ఈ గీతం బంకించంద్ర ఛటర్జీ వ్రాసిన 'ఆనంద్ మఠ్' నవలలోనిది.

ఈ గీతాన్ని రోజూ ప్రార్థనా సమయంలో లయబద్ధంగా పాడించాలి. భావం చెప్పించాలి.

— o —

# ఝండా ఊంఛా రహే హమారా

— శ్యాంలాల్ గుప్త పార్షద్

విజయీ విశ్వ తిరంగా ప్యారా
ఝండా ఊంఛా రహే హమారా ॥ ॥ ఝండా ॥

సదా శక్తి బర్సానే వాలా
ప్రేమ సుధా సర్సానే వాలా
వీరోంకో హర్షానే వాలా
మాతృ భూమికా తన్ మన్ సారా ॥ ఝండా ॥

స్వతంత్రతాకీ భీషణ రణ్‌మే
లఖకర్ బఢే జోష్ క్షణ్ క్షణ్‌మే
కాంపే శత్రు దేఖ్ కర్ మన్‌మే
మిట్ జాయే భయ సంకట్ సారా ॥ ఝండా ॥

ఇస్ ఝండేకే నీచే నిర్భయ
లే స్వరాజ్య యహ అవిచల నిశ్చయ్
బోలో, భారత్ మాతాకీ జయ్
స్వతంత్రతా హి ధ్యేయ హమారా ॥ ॥ ఝండా ॥

ఇస్‌కీ షాన్ న జానేపాయే
చాహే జాన్ భలేహి జాయె
విశ్వ విజయ కర్ కే దిఖ్ లాయే
తబ్ హెూవే ప్రణ పూర్ణ హమారా ॥ ఝండా ॥

**భావం :** ప్రియమైన మా త్రివర్ణ పతాకం విజయంతో విశ్వంలో ఎత్తున రెపరెపలాడుతుండుగాక ! ॥ ప్రియమైన ॥

ఎల్లప్పుడూ శక్తిని కురిపించేది, ప్రేమామృతం చిలికేది, వీరులకు హర్షదాయకమైంది. మాతృభూమి తనువుకూ, మనస్సుకు ప్రతీకగా ఉండే విధంగా ॥ ప్రియమైన ॥

భీకర స్వాతంత్ర్య సమరంలో క్షణక్షణం శత్రువుల నెదిరించే ఉత్సాహం కలిగిస్తూ చూచినంతనే మనసుల్లో భయసంకటాలు నశించేటట్లు ॥ ప్రియమైన ॥

ఈ జెండా నీడలో నిర్భయులమై నిశ్చలులమై స్వరాజ్యం సాధించేందుకు నిశ్చయించుకొని, స్వాతంత్ర్యమే మా ధ్యేయమని భారతమాతకు జయమని నినదిస్తూ ॥ ప్రియమైన ॥

ప్రాణాలు పోయినప్పటికీ ఈ జెండా గౌరవం కాపాడుకోవాలి. విశ్వవిజయం సాధించి చూపిస్తాం. అప్పుడే మన ప్రతిజ్ఞ పూర్తిగా నెరవేరుతుంది. ॥ ప్రియమైన ॥

**ఉపాధ్యాయులకు సూచన :**

ఈ గేయాన్ని ప్రార్థనా సమయంలో ప్రతి రోజూ విద్యార్థులచేత లయబద్ధంగా పాడించాలి. భావం వివరించాలి.

—o—

# భరతమాత

జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ దివ్యధాత్రి !
జయ జయ జయ శత సహస్ర
నరనారీ హృదయనేత్రి !

జయ జయ సస్యామల సు
శ్యామ చల చ్చేలాంచల !
జయ వసంత కుసుమ లతా
చలిత లలిత చూర్ణకుంతల !
జయ మదీయ హృదయాశయ
లాక్షారుణ పదయుగళా !

జయ జయ జయ ..

జయ దిశాంత గత శకుంత
దివ్యగాన పరితోషణ !
జయ గాయక వైతాళిక
గళ విశాల పథ విహరణ !
జయ మదీయ మధుర గేయ
చుంబిత సుందర చరణా !

జయ జయ జయ ...

శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి

భరతమాతను స్తుతించే ఈ గేయం విద్యార్థులు కంఠస్థంచేసి పాడుకోవడానికి మాత్రమే ఉద్దేశించబడింది.

# భరతమాత

జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ దివ్యధాత్రి !
జయ జయ జయ శత సహస్ర
నరనారీ హృదయనేత్రి !

జయ జయ సస్యామల సు
శ్యామ చల చ్చేలాంచల !
జయ వసంత కుసుమ లతా
చరిత లలిత చూర్ణకుంతల !
జయ మదీయ హృదయాశయ
లాక్షారుణ పదయుగళా !

జయ జయ జయ ....

జయ దిశాంత గత శకుంత
దివ్యగాన పరితోషణ !
జయ గాయక వైతాళిక
గళ విశాల పథ విహరణ !
జయ మదీయ మధుర గేయ
చుంబిత సుందర చరణా !

జయ జయ జయ ....

శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి

---

భరతమాతను స్తుతించే ఈ గేయం విద్యార్థులు కంఠస్థంచేసి పాడుకోవడానికి మాత్రమే ఉద్దేశించబడింది.

సొంతలాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్,
దేశమంటే మట్టి కాదోయ్,
దేశమంటే మనుషులోయ్.

దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్,
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్.

ఆకులందున అణగి మణగీ
కవితకోయిల పలుకవలెనోయ్,
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయ్.

ఉపాధ్యాయులకు సూచనలు :

1. ఈ గేయాన్ని విద్యార్థులచేత పాడించాలి.
2. ఈ గేయంలోని భావాలను వివరించాలి.
3. 'దేశసేవ – మానవ సేవ' అనే భావాలను విద్యార్థులకు విశదంగా చెప్పి, వారు ఇతరులకు సాయపడేట్లు ప్రేరేపించాలి.
4. కొందరు దేశభక్తులను గురించి చెప్పి, వారిని గురించి విద్యార్థులచేత చెప్పించాలి.

—o—

# సమైక్యతాగీతం

- డాక్టర్ దాశరథి కృష్ణమాచార్య

భారతీయ వీరులం,
భరతమాత బిడ్డలం,
భారతీయ వీరులం,
భరతమాత బిడ్డలం.

మాతృదేశ గౌరవం
కాపాడే ధీరులం,
మాతృదేశ గౌరవం
కాపాడే ధీరులం,

శాంతి కోరు పాపలం,
సమత పెంచు బాలలం, ॥ శాంతి ॥

మేము భావి పౌరులం,
త్యాగధనుల వారసులం, ॥ మేము ॥

వేష భాష లేవైనా
మతాచార మేదైనా ॥ వేష భాష ॥

మనం భారతీయులం,
ఒకే తల్లి పిల్లలం ,
ప్రపంచాన మనదేశం
ప్రతిభను నిలబెట్టుదాం,
ప్రతిభను నిలబెట్టుదాం.

మనమంతా సైనికులం
మనం ప్రజా సేవకులం

హిమశైల కిరీటమై
సముద్ర పాద పీఠమై
గంగ, యమున, గోదావరి
కృష్ణవేణి సహితయై
విలసిల్లే భరతమాత
మన తల్లికి జోహార్,
మన తల్లికి జోహార్.
భారతీయ వీరులం,
భరతమాత బిడ్డలం.

॥ భారతీయ ॥

**ఉపాధ్యాయులకు సూచన :**

పై గేయాన్ని విద్యార్థులచేత రాగయుక్తంగా పాడించాలి.

—— o ——

# అంతా ఒక్కటే

– న్యాయపతి రాఘవరావు

అంతా ఒక్కటే, మనమంతా ఒక్కటే,
ఆంధ్రులమైనా తమిళులమైనా
ఉత్కళులైనా కన్నడులైనా
మరాఠీ అయినా గుజరాత్ అయినా
పంజాబ్ అయినా బంగ్లా అయినా – ॥ అంతా ఒక్కటే ॥

వందనమండీ వందనం (తెలుగు)
వణక్కమమ్మా వణక్కం (తమిళం)
నమస్కార్ నమస్కార్ (హిందీ)
ఇస్సలాం ఇస్సలాం (అస్సామీ)
భాషలు వేర్వేరయినాగానీ
భావాలన్నీ ఒకటేనోయ్ – ॥ అంతా ఒక్కటే ॥

జాతులు, మతములు వేర్వేరయినాగానీ
నీతులు అన్నీ ఒకటేనోయ్,
దేశాలన్నీ ఒకటే అయితే ద్వేషాలేమీ ఉండవుగా,
బాలప్రపంచం, భావిప్రపంచం
భావిభారత వారసులం – ॥ అంతా ఒక్కటే ॥

ఉపాధ్యాయులకు సూచనలు :

1. ఈ పాటను అందరిచేతా పాడించాలి, రాయడానికి ప్రోత్సహించాలి.
2. ఈ పాట భావాన్ని వివరించాలి.
3. ఇట్లాంటి పాటలను ఇంకా కొన్నింటిని సేకరించాలి.
4. విద్యార్థులందరూ కలిసి మెలిసి ఉండేట్లు చూడాలి.

—o—

# మా తెలుగుతల్లి

మా తెలుగుతల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి
గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగు లిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరులుతాయి
అమరావతీ నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచి ఉండేదాక
రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయని కీర్తి
మా చెవుల రింగుమని మారు మ్రోగేదాక
నీ ఆటలే ఆడుతాం – నీ పాటలే పాడుతాం
జై తెలుగుతల్లీ ! జై తెలుగుతల్లీ !

– శంకరంబాడి సుందరాచారి

—o—

# సత్యవాక్కు

'సత్యమే జయిస్తుంది', 'అబద్ధాలాడరాదు'
అంటూ చదువుతున్నాడు రవి.

"ఏరా, రవీ ! ఆ వాక్యాలను వల్లెవేస్తున్నావు సరే ! వాటి అర్థమేమిటో తెలుసా ?" అన్నాడు నారాయణ.

" తెలియదు నాన్నా!" అన్నాడు రవి.

"అయితే నేనొక కథ చెబుతాను విను" అన్నాడు నారాయణ.

హరిశ్చంద్రుని కథ నీకు తెలుసుకదా ! సత్యంకోసం హరిశ్చంద్రుడు రాజ్యాన్ని విడిచాడు. భార్యాపుత్రులతో అడవులకు వెళ్ళాడు. విశ్వామిత్రుడికి ఇచ్చిన మాట నిలుపుకోడం కోసం ఎన్నో త్యాగాలు చేశాడు. ఎన్నో కష్టాలు పడ్డాడు. సత్యవ్రతుడైన హరిశ్చంద్రుడు దైవానుగ్రహం వల్ల జయం పొందాడు.

ఒకరోజు గాంధీగారు తమ ఊళ్ళో హరిశ్చంద్ర నాటకం చూశారు. ఆడినమాట నిలబెట్టుకొనేందుకు హరిశ్చంద్రుడు పడిన కష్టాలు చూసి గాంధీజీ ఎంతో దుఃఖించారు. ఎన్ని కష్టాలు ఎదురయినా సత్యవ్రతుడైన హరిశ్చంద్రుడు జయంపొందడం, మొండిపట్టుదలగల విశ్వామిత్రుడు ఓడిపోవడం చూసి గాంధీజీ ఎంతో ఆనందించారు.

అబద్ధమాడేవారిని ఎవరూ గౌరవించరనీ, నిజం చెప్పేవారిని అందరూ గౌరవిస్తారనీ గాంధీజీ గ్రహించారు.

"అందుకేనా ఆయనను మహాత్ముడన్నారు, నాన్నగారూ ?"

"అవును బాబూ, సత్యమహిమ తెలిపే మరొక కథ చెపుతా విను" అంటూ మొదలుపెట్టాడు నారాయణ.

"ఒక రోజు అడవిలో ఒక ఆవు గడ్డి మేస్తుండగా ఒక పులి అక్కడికి వచ్చింది. ఆవుపై బడి చంపబోయింది. ఇంతలో ఆవు ' ఓ పులిరాజా! నా కొక చిన్న లేగదూడ ఉంది. అది పాలకోసం అల్లాడిపోతుంది. నేనువెళి ఆ దూడకు పాలిచ్చి వెంటనే వస్తాను, తరవాత నన్ను చంపి తినవచ్చు' అ వేడుకొంది. దానికి పులి సంకోచిస్తూనే సమ్మతించింది. ఆవు, దూడక పాలిచ్చి మంచి బుద్ధులు చెప్పి తిరిగి వచ్చింది. ' ఓ పులిరాజా ! ఇప్పుడు

నన్ను నిస్సంశయంగా చంపి తినవచ్చు' అని పులిఎదుట నిలిచింది. క్రూరమృగమైన పులికి ఆశ్చర్యం కలిగింది. ఆవు నిజాయితీకి మెచ్చి, పులి 'వెళ్ళి నీ దూడతో హాయిగా ఉండు' అని ఆవును విడిచిపెట్టింది. సత్యంవల్ల ఇంత మేలు కలిగిందికదా, మరి తమాషాకైనా అబద్ధం ఆడితే ఎంత ప్రమాదం కలుగుతుందో చెప్పనా?"

"చెప్పండి, నాన్నా".

"అయితే విను ... ఒక గొర్రెల కాపరి న గొర్రెలమందను రోజూ అడవికి తీసుకవెళ్ళి మేపేవాడు. ఒకరోజు అతని కొడుకు కూడా అతనితో వస్తా నన్నాడు. తండ్రి 'సరే' అన్నాడు. ' నీవు గొర్రెల మందను చూస్తూ ఉండు. నేను కట్టెలు కొట్టుకువస్తాను' అన్నాడు తండ్రి.

'సరే' అన్నాడు కొడుకు.

'అప్పుడప్పుడూ ఇక్కడికి పులివస్తుంది, జాగ్రత్త సుమా ! పులివస్తే బిగ్గరగా కేకవేయి' అన్నాడు తండ్రి. త డ్రిని ఆట పట్టించాలి అనుకున్నాడు కొడుకు. కాసేపటికి ' నాన్నా ! పు !' అన్నాడు. తండ్రి పరుగెత్తుకు వచ్చాడు. ' ఊరికే పిలిచాను పులి , గిలిలేదు' అన్నాడు కొడుకు నవ్వుతూ. తండ్రి వెళ్ళిపోయాడు. మళ్ళీ కట్టెలు కొట్టటం మొదలుపెట్టాడు మరి కాసేపటికి 'నాన్నా ! పులి !' అన్నాడు కొడుకు. ఈసారి కూడా అలాగే జరిగింది. మూడోసారి 'నాన్నా ! పులి !' అన్నాడు. ఈసారి నిజంగానే పులి వచ్చింది. కాని కొడుకు ఎంత అరచినా తండ్రి వినిపించుకోలేదు. పులి మందమీదపడి ఒక గొర్రెను ఎత్తుకుపోయింది. అది చూసి కొడుకు భోరున ఏడ్చాడు.

చూశావా, నవ్వులాటకయినా అబద్ధాలాడితే ఏమవుతుందో! అందుకే ఎప్పుడూ నిజమే చెప్పాలి" అన్నాడు నారాయణ.

"అట్లాగా!" అంటూ ఆనందంతో చూశాడు కొడుకు.

ఉపాధ్యాయులకు సూచనలు :

1. పిల్లలచేత హరిశ్చంద్ర నాటకం ఆడించాలి.
2. ఆవు - పులి కథ సంభాషణ రూపంగా చెప్పించాలి.
3. గొర్రెల కాపరి కథను వివరించి, నీతిని గ్రహించేటట్లు చేయాలి.

—o—

# క్రమశిక్షణ

మీ కుటుంబంలో మీతోపాటు మీ తల్లిదండ్రులు, అక్కాచెల్లెళ్ళు, అన్నదమ్ములు ఇంకా ఇతరులు కూడా ఉంటారు. వాళ్ళంతా మిమ్మల్ని ఎంతో ప్రేమగా చూస్తారు.

మీరు వెళ్లే పాఠశాలకూడా ఒక కుటుంబం వంటిదే. ఉపాధ్యాయులు మీ తల్లిదండ్రుల వంటివారే. వారు మీకు విద్యాబుద్ధులు, మంచి అలవాట్లు నేర్పుతారు. ఆటపాటలలో మీకు తోడ్పడతారు. మీకు అవసరమయ్యే వస్తు సామాగ్రిని అందజేసి చక్కగా నేర్చుకోడానికి సహాయపడతారు. మీకు చదువు రావడానికి ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు ముఖ్య కారకులు. అందువల్ల వారిని గౌరవించడం మీ ధర్మం.

పాఠశాల్లో జాతీయ గీతాన్నీ, జాతీయ గేయాలను క్రమపద్ధతిలో ఆలపించాలి. తరగతిలో ఉపాధ్యాయులు లేనప్పుడు అల్లరి చేయకుండా ఉండాలి. తరగతి నాయకుడు చెప్పినట్లు వినాలి. మీ తోటి విద్యార్థులను మర్యాదతో చూడాలి. ప్రేమాభిమానాలు చూపించాలి. మనం చేసే పనులన్నిటిలో క్రమశిక్షణ పాటించాలి. అవసరమైన చోట 'క్యూ' పద్ధతి పాటించాలి.

అంగవికలుల పట్ల, రోగుల పట్ల, వృద్ధుల పట్ల జాలి, దయ చూపించి వారికి తోడ్పడాలి. ఇతరులు మీకు సహాయపడినప్పుడు "కృతజ్ఞత" చూపాలి.

శరీర బలానికి, మంచి ఆరోగ్యానికి ప్రతి సాయంకాలం ఆటలు ఆడాలి. రాత్రివేళ త్వరగా నిద్రించి, పెందలకడనే మేల్కొని, కాలకృత్యాలను

తీర్చుకొన్న తరవాత పాఠాలను చదవాలి. ఇంటిపనికోసం ఇచ్చిన పాఠ్యాంశాలను చురుకుగా ఏరోజువి ఆ రోజు పూర్తిచేయాలి. ఆహారం విషయంలో కూడా క్రమబద్ధమైన అలవాట్లు పాటించాలి.

జీవితమంతా క్రమశిక్షణ పాటించాలి. ఇటువంటి జీవన విధానమే మీ అభివృద్ధికి తోడ్పడుతుంది.

**ఉపాధ్యాయులకు సూచనలు :**

1. పైన సూచించిన అంశాలన్నింటినీ బాలలు తప్పకుండా ఆచరించేటట్లు తగు శ్రద్ధ వహించాలి.
2. పాఠశాల కార్యక్రమాలను విద్యార్థినీ విద్యార్థులు క్రమశిక్షణతో పాటించేటట్లు చూడాలి.
3. "క్రమశిక్షణ" అనే అంశంపై బాలలను జట్లుగా చేసి చిన్న "క్విజ్" కార్యక్రమాన్ని నిర్వహించాలి.
4. క్రమశిక్షణ వల్ల కలిగే ప్రయోజనాలను గురించి చెప్పాలి.
5. క్రమశిక్షణ పాటించిన గొప్పవారిని గురించి చెప్పి, విద్యార్థులచేత చెప్పించాలి.

—0—

# మానవతామూర్తులు

'మానవ సేవే మాధవ సేవ' అనే సూక్తి మనందరికీ తెలిసిందే! బాధలలోనూ కష్టాలలోనూ ఉన్న మానవులకు సేవ చేయడమే మాధవసేవ. అలాంటి మానవ సేవ చేసిన కొందరు విశిష్టవ్యక్తుల గురించి తెలుసుకొందాం.

**1. మదర్ థెరిసా :**

'పూవు పుట్టగానే పరిమళిస్తుంది'. ఈ సూక్తి మదర్ థెరిసా పట్ల నిజమైంది. చిన్నప్పటినుంచే సమాజసేవపట్ల ఆమె ఆసక్తి చూపేది. పన్నెండేళ్ళ వయస్సులో ఆమె పాఠశాలకు వెళుతుండగా ఒక ముసలివాడు సొమ్మసిల్లి పడిపోయి ఉండటం చూసింది. వెంటనే అతణ్ణి సేదతీర్చి ఆస్పత్రికి చేర్చింది.

మదర్ థెరిసా కలకత్తాలోని 'మోతీజీల్' అనే మురికి పేటలో తన మహోద్యమానికి శ్రీకారం చుట్టింది. అక్కడి పేద ప్రజల పిల్లలకోసం ఒక పాఠశాల తెరిచింది. పిల్లలకు కావలసిన ఆహారం సమకూర్చింది. వారికి ఆరోగ్య నియమాలు నేర్పింది. జబ్బుపడినవారికి మందులిచ్చింది. త్వరలోనే ఆమె మానవతా వాదానికి ఎందరో చేయూత నిచ్చారు. మదర్ సారథ్యంలో 'వెనిజులా'లో, 'శ్రీలంక'లో, 'ఆస్ట్రేలియా'లో, 'జోర్డాన్'లో సేవాసదనాలు వెలిశాయి . కార్యక్రమాలను సమన్వయించడానికి ఒక అంతర్జాతీయ సంస్థ ఏర్పడింది. ఒక్క భారతదేశంలోనే ఇలాంటివి అరవైకి పైగా కేంద్రాలున్నాయి. ఈ కేంద్రాలన్నిటికీ ప్రేమ, సేవ అనేవి మూల సిద్ధాంతాలు.

# సారే జహా( సె అచ్ఛా

— మహ్మద్ ఇక్బాల్

సారే జహా( సె అచ్ఛా హిందూస్తా( హమారా
హమ్ బుల్ బులే( హై ఇస్‌కే, యే గుల్ సితా( హమారా ॥
పరబత్ వో సబ్ సే ఊంచా హమ్‌సాయా ఆస్మా( కా
వో సంతరీ హమారా ! వో పాస్‌బా( హమారా ॥
గోదీమె ఖేల్ తీహై( ఇస్‌కీ హజారో( నదియా(
గుల్‌షన్ హై జిన్ కే దమ్ సే రష్ కె జినా( హమారా ॥
మజ్‌హబ్ నహీ( సిఖాతా ఆపస్‌మె బైర్ రఖ్‌నా
హిందీ హై( హమ్, వతన్ హై( హిందూస్తా( హమారా ॥



**భావం :** ప్రపంచంలోకెల్లా మన భారతదేశం ఉత్తమమైంది. ఇది మనకో ఉద్యానవనం. మన మిక్కడ బుల్బుల్ పిట్టలం. ఆకాశాన్నంటే ఆ మహోన్నత పర్వతం ఆ పక్కన మనకు కాపలాగా రక్షణగా నిలిచివుంది. ఈ దేశమాత ఒడిలో వేలాది నదులు ఆడుకుంటున్నాయి. ఈ నదీజలాలతో వికసించిన పూదోటను చూసి స్వర్గమే అసూయపడుతున్నది. మతం పరస్పర వైరాన్ని బోధించదు. మనమంతా భారతీయులం. మనదేశం భారతదేశం.

**ఉపాధ్యాయులకు సూచన :**

ఈ గీతాన్ని రోజూ ప్రార్థనా సమయంలో లయబద్ధంగా పాడించాలి. భావం వివరించాలి. మీవద్ద దృశ్య శ్రవణ సాధనాలు ఉన్నట్లయితే, వాటిద్వారా వినిపించవచ్చు.

—0—

1952 లో అనాథ రోగుల కోసం 'నిర్మల్ హృదయ్' అనే సంస్థను స్థాపించింది. తరవాత కుష్ఠరోగులకు 'శాంతినివాస్' ను స్థాపించింది. అందుకే ఆమెను నోబెల్ బహుమానం వరించింది. మన ప్రభుత్వం కూడా పద్మశ్రీ, నెహ్రూ అవార్డు, భారతరత్న వంటి పురస్కారాలతో ఆమెను గౌరవించింది.

## 2. శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ :

దుర్గాబాయి తన జీవితంలోని ప్రతిదశలోను పరులకు సేవచేయడమే పరమలక్ష్యంగా భావించింది. స్త్రీల స్థితిని అనాథల పరిస్థితిని పరికించి మానవ కల్యాణానికి తోడ్పడింది.

ఆంధ్ర మహిళాసభను ఢిల్లీలోను, మద్రాసులోను, హైదరాబాదులోను స్థాపించి స్త్రీ విద్యావ్యాప్తికి, స్త్రీ ప్రగతికి అనన్య సామాన్యమైన సేవచేసిన గొప్ప తెలుగుబిడ్డ దుర్గాబాయి దేశ్ ముఖ్. సేవాతత్పరత, దేశభక్తి కలిగిన మహిళామూర్తి ఆమె.

విద్యా సదుపాయాలు లేనివారికి విద్యా సౌకర్యాలు, ఆరోగ్యం లేనివారికి వైద్య సదుపాయాలు ఎన్నో కల్పించారు. ఆంధ్రప్రదేశ్ లో ప్రతి సంవత్సరం వంద కేంద్రాల వరకు వయోజన విద్యా వ్యాప్తికి తోడ్పడిన ఘనత వీరిది. హైదరాబాదులోని వయోజన విద్యా కేంద్రం చేస్తున్న గొప్ప కృషి కెనడా ప్రభుత్వపు మెప్పుకూడా పొందగలిగింది. శాస్త్రవేత్తలుగా క్యూరి దంపతులు సంఘానికి ఎంత సేవ చేశారో సంఘసేవకులుగా దేశ్ ముఖ్ దంపతులు కూడా అంతటి సేవ చేశారని చెప్పవచ్చు. ఇటువంటి సంఘసేవకులు మానవతా మూర్తులుగా మనకు కనిపిస్తారు.

ఉపాధ్యాయులకు సూచనలు :

1. 'మానవ సేవే, మాధవ సేవ'; 'పూవు పుట్టగానే పరిమళిస్తుంది' అనే సూక్తులను విశదీకరించాలి.
2. నోబెల్ బహుమతి, భారతరత్న, పద్మశ్రీ, నెహ్రూ అవార్డులను వివరించాలి.
3. మదర్ థెరిసా, శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ చిత్రపటాలను, ఇంకా ఇలువంటివారి చిత్రాలను కూడా సేకరించి విద్యార్థులకు చూపాలి.
4. విద్యార్థులు సామాజిక సేవా కార్యక్రమాలలో పాల్గొనేటట్లు చేయాలి.

—o—

అక్షరంబు వలయు కుక్షి జీవనులకు
నక్షరంబు జిహ్వకిక్షురసము
అక్షరంబు తన్నురక్షించుగావున
నక్షరంబు లోకరక్షితంబు.

చాటుపద్యం

# సహకారం

రామాపురం అనే ఊళ్ళో ఒక బడి ఉంది. అందులో రాము, కరీం, మేరీ, లక్ష్మి అనే విద్యార్థు లున్నారు. ఆ నలుగురూ కలిసిమెలిసి ఉండేవారు. ఎవరికి ఏ అవసరం వచ్చినా పరస్పరం సహకరించుకొనేవారు.

ఒకరోజు ఏమయిందంటే-కరీం బడికి వచ్చేటపుడు దారిలో ఒక బిక్షగాడు ఎదురయ్యాడు. అతన్ని చూసి కరీం జాలిపడ్డాడు. దగ్గరగా వెళ్ళి తన దగ్గర ఉన్న అన్నం అంతా అతనికి పెట్టాడు. ఆ బిక్షగాడు ఆకలి తీరి సంతోషంతో కరీంను దీవిస్తూ వెళ్ళిపోయాడు.

ఆ రోజు మధ్యాహ్నం బడిలో భోజనానికి గంటకొట్టగానే రాము, కరీం, మేరీ, లక్ష్మి ఒక్కచోట చేరారు. రాము, మేరీ, లక్ష్మి తాము తెచ్చిన కేరియర్లను విప్పారు. కరీం ఎక్కడా కనిపించలేదు. కరీంకోసం రాము, మేరీ, లక్ష్మి వెతికారు. దూరంగాఎక్కడో మైదానంలో చెట్టునీడలో కరీం కనిపించాడు. అతన్ని కలుసుకొని విషయం తెలుసుకొన్న మిగిలిన మిత్రులు తమ ఆహారంలో కొంత భాగం అతనికి ఇచ్చారు. తెచ్చుకొన్న ఆహారాన్ని నలుగురూ పంచుకొని తిన్నారు.

ఇది గమనించిన మిగిలిన విద్యార్థులు పరస్పరం సహకరించుకోడం నేర్చుకొన్నారు.

మీరు ఎప్పుడయినా ఎవరికయినా అవసరం ఏర్పడితే గమనించి సహకరించండి. ఏ విధంగా పరస్పర సహకారం పెంపొందించుకోవచ్చో మీ ఉపాధ్యాయుడిని అడిగి తెలుసుకోండి.

**ఉపాధ్యాయులకు సూచనలు :**

1. ఇటువంటి సంఘటనలు మరికొన్నింటిని పిల్లలచేత చెప్పించి రాయించాలి.
2. ఇటువంటి కథలను సేకరించి పిల్లలచేత చదివించాలి.

—o—

# జాతీయ గీతం

జనగణమన అధినాయక జయహే
భారత భాగ్య విధాతా !
పంజాబ, సింధు, గుజరాత, మరాఠా,
ద్రావిడ, ఉత్కళ, వంగ !
వింధ్య, హిమాచల, యమునా, గంగ,
ఉచ్ఛలజలధితరంగ !
తవ శుభనామే జాగే !
తవ శుభ ఆశిష మాగే !
గాహే తవ జయగాథా !
జన గణ మంగళ దాయక జయహే
భారత భాగ్య విధాతా !
జయహే ! జయహే ! జయహే !
జయ జయ జయ జయహే !

**భావం :**

జనులందరి మనస్సులకు అధినేతవూ భారతభాగ్య విధాతవూ అయిన నీకు జయమగుగాక ! పంజాబు, సింధు, గుజరాతు, మహారాష్ట్ర, ద్రావిడం, ఉత్కళ, వంగ దేశాలతోను, వింధ్య హిమాలయ పర్వతాలతోను, యమునా, గంగా ప్రవాహాలతో ఉవ్వెత్తుగా లేచే సముద్ర తరంగాలతోను శోభించే ఓ భారత భాగ్యవిధాతా! వాటికి నీ శుభనామం ఉద్బోధ కలిగిస్తుంది. అవి నీ ఆశీస్సులు అర్థిస్తాయి. నీ జయగాథల్ని గానం చేస్తాయి. సమస్త జనులకు మంగళప్రదాతవూ, భారతభాగ్య విధాతవూ అయిన నీకు జయమగుగాక ! జయమగుగాక ! జయమగుగాక!

**ఒక వివరణ :**

ఈ గీతం అవిభక్త భారతదేశంలోని రాష్ట్రాలను సూచిస్తుంది. సింధుప్రాంతం ఇప్పుడు పాకిస్థాన్‌లో ఉంది. 'మరాఠా' అంటే మహారాష్ట్రం. 'ద్రావిడ' అంటే తమిళ, ఆంధ్ర, కర్ణాట, కేరళ ప్రాంతాలు. 'ఉత్కళ' అంటే ఒరిస్సా. 'వంగ' అంటే ఇప్పటి పశ్చిమబెంగాలు.

ఉపాధ్యాయులు పిల్లలందరిచేత ఈ గీతాన్ని సుస్వరంతో పాడించాలి.

—0—

# ప్రతిజ్ఞ

భారతదేశం నా మాతృభూమి. భారతీయులందరు నా సహోదరులు.

నేను నా దేశాన్ని ప్రేమిస్తున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారణం. దీనికి అర్హత పొందడానికి సర్వదా నేను కృషిచేస్తాను.

నా తల్లిదండ్రుల్ని, ఉపాధ్యాయుల్ని, పెద్దలందర్ని గౌరవిస్తాను. ప్రతివారితోను మర్యాదగా నడచుకొంటాను.

నా దేశంపట్ల, నా ప్రజలపట్ల సేవానిరతితో ఉంటానని ప్రతిజ్ఞ చేస్తున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందానికి మూలం.

—o—

# 1. పేదరాసి పెద్దమ్మ

[ కథలంటే పిల్లలు మొదలుకొని పెద్దలవరకు చెవికోసుకుంటారు. తీరికవేళల్లో మనగ్రామాల్లో పెద్దలు చెప్పే కథలు ఎన్నెన్నో ఉంటాయి. కథ చెప్పేవారు చెప్తూ ఉంటే ' ఊ ' కొట్టేవాళ్లు ' ఊ ' కొడతారు. అందువల్లనే వీటిని ' ఊకుడు కథలు ' అంటారు. ఈ ఊకుడు కథలనే ' జానపద కథలు ' అనికూడా అంటారు.

వీటిలో పెద్దల అనుభవం, పిల్లలు నేర్చుకొనే నీతి, ధైర్యసాహసాలు, ఉపాయాలు ఉంటాయి. ఈ కథలో పేదరాసి పెద్దమ్మ తన ఉపాయంతో పెద్దపులి బారినుండి తప్పించుకోవడం చూస్తాము. అపాయం వచ్చినపుడు ఉపాయం అవసరం అని ఈ కథ చెపుతుంది.]

**పాఠంలో ముఖ్యమైన పదాలు :**

| | | | |
|---|---|---|---|
| బాన | వంతు | లావు | ఒళ్లు |
| గొడవ | అరిసె | పంజా | ఉషారు |
| చిక్కిపోవడం | గారెలు | నరవాసన | |

* * *

అనగా అనగా ఒక ఊళ్లో పేదరాసి పెద్దమ్మ ఉందంట. ఆ పెద్దమ్మకు నలుగురు కూతుళ్లున్నారంట. పెద్దమ్మ నలుగురి దగ్గర తలొక మూడునెలలు ఉంటూ కాలం గడుపుతా ఉండేదంట. ఒకసారి మొదటి కూతురింటి నుండి రెండో కూతురు ఇంటికి పోతావుందంట.

దారిలో పెద్ద అడవి. అడవిలో పోతావుంటే ఒక పులి నరవాసన కనిపెట్టి వచ్చి పేదరాసి పెద్దమ్మను తినేస్తానందంట. పెద్దమ్మకు భయం వేసింది. బాగా ఆలోచించి పెద్దపులితో అన్నదంట.

" పెద్దపులీ ! పెద్దపులీ ! నేను ముసలిదాన్ని. ఒళ్లు అంతా చిక్కిపోయి ఉన్నాను. నే నిప్పుడు రెండో కూతురింటికి పోతున్నాను. వాళ్లు బాగా ఉన్నోళ్లు. అక్కడ పది రోజులుండి గారెలు, మినపసున్ని ఉండలు, అరిసెలు తిని లావుగా బలసి వస్తాను. అప్పుడు తిందువుగాని. కమ్మగా ఉంటుంది నా నెత్తురు " అని చెప్పిందంట.

పెద్దమ్మ మాటలు పులి నమ్మి వదిలిపెట్టిందట. పదిరోజులయినా పెద్దమ్మ తిరిగి రాలేదు. పులికి చాలా కోపం వచ్చింది. 'ఈ దారి తప్పితే మరొక దారిలేదు గదా, రాకపోతుందా, చూద్దాం ' అనుకుందట.

పెద్దమ్మ తన కూతురికి పులితో జరిగిన గొడవ చెప్పిందంట. మూడు నెలల వంతు అయిపోయింది. పెద్దమ్మ బయలుదేరవలసి వచ్చింది. కూతురు బాగా ఆలోచించి, ఒక పెద్ద బాన తెచ్చి, అందులో పెద్దమ్మను కూర్చోపెట్టి, మూతపెట్టి, ఒక గుడ్డ గట్టిగా కట్టి, దొర్లించి వదిలిపెట్టిందట.

బాన దొర్లుకుంటూ అడవిలో పోతావుంది. బాన లోపల ఉన్న ముసలమ్మకు ఉషారు వచ్చింది. ఇంక పులి తనను ఏమీ చెయ్యలేదు. అనుకుందట. సంతోషంతో " బానా బానా బాగా దొర్లు టమకు టమకు దొర్లు " అంటూ పాడుకుంటూ పోతావుంది. పెద్దపులి దగ్గరకు వచ్చేటప్పటికి కూడా పాడతానే వుంది.



పులి బానను ఆపి పంజాతో ఒక దెబ్బ కొట్టింది. బాన పుటుక్కుమని పగిలిపోయింది. ఇంక పేదరాసి పెద్దమ్మకు భయం వేసింది. మళ్లీ బాగా ఆలోచించి " పెద్దపులీ ! పెద్దపులీ ! ప్రయాణంలో నా ఒళ్లు అంతా చెమట పట్టింది గదా ! ఆ చెరువులోకి వెళ్ళి స్నానంచేసి వస్తాను. హాయిగ తిందువుగాని " అంది.

అప్పుడు పెద్దపులి " సరే " అని ఒప్పుకుంది. పెద్దమ్మ ఎన్ని గంటలయినా చెరువులోంచి బయటకు రాలేదు. పెద్దపులికి కోపం వచ్చి ఎన్నోసార్లు పిలిచింది. " వస్తున్నా, వస్తున్నా " అంటుందిగాని ముసలమ్మ రాలేదు.

పులికి కోపం వచ్చి చెరువులో దిగి పెద్దమ్మ మీదికి దూకబోయింది. ముసలమ్మ నోట్లో ఇసుక పెట్టుకొని ఉంది. ఒక్కసారి పులి కళ్లల్లోకి ఊసింది. పులికళ్లలో ఇసుకపడి మంటెక్కి బాధపడుతూ ఉంటే పెద్దమ్మ సంతోషంతో పారిపోయింది.

3. దారిలో తనను తినేస్తానన్న పులితో పెద్దమ్మ ఏమి చెప్పింది ?
4. పెద్దమ్మ కూతురు ఏమి చేసింది ?
5. పెద్దమ్మ పులి బాధ నుండి ఎలా తప్పించుకుంది ?
6. ఈ కథవల్ల మనం తెలుసుకొనే నీతి ఏమిటి ?

*6. కింది వాక్యాలలోని ఖాళీలను బ్రాకెట్లలోని పదాల నుండి సరియైనదానితో పూరించండి :*

1. పేదరాసి పెద్దమ్మ తన కూతుళ్ల ఒక్కొక్కరి దగ్గర ఉంటూ కాలం గడిపేది.
   (మూడునెలలు, మూడు సంవత్సరాలు, మూడు దినాలు)
2. దారిలో పెద్దమ్మ పోతావుంటే ఒక అడ్డగించి తినేస్తానంది.
   (నక్క, పులి, సింహము)
3. పెద్దమ్మను తన కూతురు లో కూర్చోబెట్టి దొర్లించింది.
   (డబ్బా, కూజా, బాన)
4. పులి బానను ఆపి తో ఒక దెబ్బకొట్టింది.
   (కాలి, పంజా, ముఖం)
5. పెద్దమ్మ చెరువులోకి వెళ్లి చేసి వస్తాను అంది.
   (స్నానం, మునిగి, నీళ్లుతాగి)
6. ముసలమ్మ నోటో పెట్టుకొని, పులి కళ్లలోకి ఊసింది.
   (నీళ్లు, ఇసుక, రాళ్లు)
7. ప్రమాద సమయాల్లో తో తప్పించుకోవాలి.
   (అపాయం, బుద్ధి, ఉపాయం)

*7. కింద పదచక్రంలో ఉండే అక్షరాలతో ఏర్పడే మూడక్షరాల పదాలను రాయండి :*



8. విద్యార్థులకు సూచనలు :

1. మీ అమ్మా నాన్నల దగ్గరనైనా, చుట్టు పక్కవాళ్ల దగ్గరైనా నీతికథలు వినండి.
2. తరగతిలో చెప్పడానికి ప్రయత్నం చేయండి.
3. తెలిసిన కథలను రాసి మీ ఉపాధ్యాయులకు చూపండి.

9. ఉపాధ్యాయులకు సూచనలు :

1. ఈ కథలో వచ్చిన ప్రాంతీయమైన పదాలు, మీ ప్రాంతంలో ఏ రూపంలో ఉన్నాయో పిల్లలకు చెప్పండి. తర్వాత చదువుకున్నవాళ్లు ఈ పదాలను ఉచ్చరించే తీరును పరిచయం చేయండి.

   ఉదా :- ఉందంట - ఉందట

   గారెలు - వడలు
2. జానపద కథల ప్రాశస్త్యాన్ని వివరించండి.
3. విద్యార్థులచే కథలు చెప్పించండి. కథలు చెప్పేటప్పుడు పాత్రోచితంగా అభినయింపచేయండి.
4. కాగితంతోగాని, మరి ఇతర వస్తువులతోగాని తొడుగులు (Masks) తయారు చేయించి కథను నాటకీకరించి, ప్రదర్శింపజేయండి.
5. విద్యార్థులు మాట్లాడేటప్పుడు వారి ఉచ్చారణను గమనించి, సరియైన పదస్వరూపాన్ని పరిచయం చేయండి.

—0—

**ప్రతిరోజూ ఉదయం 5 గం॥కు నిద్ర లేవాలి. వెంటనే కాలకృత్యాలు తీర్చుకోవాలి**

# 2. చిక్కులో పడిన నక్క

[ ఒక కాపు పన్నిన ఉచ్చు గమనించక, కుందేలు దాంట్లో చిక్కుకుంటుంది. ఉపాయంతో ఏరకంగా బయటపడిందో ఈ కథ చదివి ఆలోచించండి.]

పాఠంలో ముఖ్యమైన పదాలు :

| | | | |
|---|---|---|---|
| సమీపం | ఉచ్చు | అభినయించు | తాత్సారం |
| సంగతి | సుస్తీ | పన్ను | మేర |
| గమ్మత్తు | మరగటం | మొహం | నిర్బంధం |
| చింత బరికెలు | | | |

* * *

అడవి సమీపంలో ఒక కాపు నివసిస్తూండేవాడు. అతడు కొంత మేర దున్ని ఆకుకూర మడులు నాటాడు. కుందేలు వాటిని తినమరిగింది. ప్రతి రాత్రి ఎవరో వచ్చి తన ఆకుకూరలు తినిపోతూండటం గమనించి కాపు ఒకనాడు ఉచ్చుపన్నాడు.

ఆ ఉచ్చు గమనించక కుందేలు రాత్రి అందులో చిక్కుకున్నది. దాన్నుంచి తప్పించుకునే ఉపాయం కనిపించలేదు కుందేలుకు.

తెల్లవారు జామున కాపు వచ్చాడు. కుందేలును చూసి, " ఓహో ! దొరికావా ? రోజూ నా కూరలు తినిపోదామనుకున్నావా ? నీ సంగతి చెబుతా ఉండు !" అని కుందేలుకు బుద్ధి చెప్పటానికిగాను చింతబరికెలు తీసుకు రావటానికి వెళ్ళాడు.

"తప్పించుకునే ఉపాయం లేదు. ఇవాళ నాకు మూడింది! పొద్దున లేచి ఎవరి మొహం చూశానో !" అనుకుని కుందేలు కదలక మెదలక కూచున్నది.

సరిగా ఆ సమయానికే ఒక నక్క అటుగావచ్చి, కుందేలును చూసి, "ఓహో కుందేలా ? ఇక్కడ కూచున్నావేం ? నీ మెడకు ఆ ఉచ్చు ఏమిటి ?" అని అడిగింది ఆశ్చర్యంగా.

కుందేలు పొట్ట చేతబట్టుకొని నవ్వుతున్నట్లు అభినయిస్తూ, "భలే గమ్మత్తు ! పిల్లలకు సుస్తీగా ఉండటం వల్ల, వైద్యుణ్ణి అడిగి నాలుగు కస్తూరి మాత్రలు తీసుకొద్దామని వెళుతుంటే ఆవు అత్త ఎదురై "మా అమ్మాయి పెళ్ళి చేస్తున్నాం. నువ్వు రాక తప్పదు," అన్నది. నేను తొందర పనిమీద వెళుతున్నానుగాని, ఈసారికి నన్ను వదిలెయ్యమన్నా, కాదు కూడదు పెళ్ళికి వస్తే తప్ప ఊరుకొనేది లేదని నన్ను ఆవు అత్త నిర్బంధం పెట్టింది. సరే నా పని పూర్తి చేసుకొని వస్తానని చెప్పాను. కాని ఆవు అత్త నన్ను నమ్మక, ఇక్కడ కట్టేసిపెట్టి, నన్ను తీసుకురావడానికి ఎవరినన్నా పంపిస్తానని వెళ్ళిపోయింది. అదీ సంగతి. నన్ను విడిచిపెట్టేద్దూ. నీకు పుణ్యం ఉంటుంది. పిల్లలకు మాత్రలు పడితేగాని నేనింకోపని చూసుకోవటానికి లేదు. అంతగా పెళ్ళికి వెళ్ళాలనుకొంటే నిన్ను కట్టిపెడతాను. వాళ్ళు వచ్చి నిన్నే తీసుకుపోతారు " అన్నది కుందేలు.

నక్క ఈ మాటలు నమ్మి, "అవును, నేను నిన్ను విప్పుతాను, నువ్వు నన్ను కట్టెయ్యి. నన్ను ఒక్కరూ ఏ పెళ్ళికీ పిలవరు !" అన్నది.

కుందేలు, నక్కను తన స్థానంలో కట్టేసి, "నేను వైద్యుడి దగ్గరికి పోయి ఇప్పుడే వస్తాను. ఈ లోపల పెళ్ళివారు రానే వస్తారులే !" అంటూ కొంచెం దూరంవెళ్ళి ఒక పొదలో దాగింది.

## అభ్యాసవేదిక

*1.* ఆర్థాలు :

బాన = మట్టితో చేసిన పెద్దకుండ; అరిసె = నిప్పట్లు, అప్పచ్చి, బియ్యం పిండితో బెల్లంకానీ చక్కెరకానీ కలిపి చేసే తినుబండారం; వంతు = భాగం; పంజా = పులి ముందుకాలు పాదం; లావు = బలం; ఉషారు = ఉత్సాహం; ఒళ్లు = శరీరం.

*2.* కింది వాక్యాలు చదివి, గీత గీసిన పదాలకు అదే అర్థం ఇచ్చే వేరే పదాలను వాడి వాక్యాల్ని తిరిగి రాయండి :

1. పేదరాసి పెద్దమ్మకు నలుగురు కూతుళ్లు.
2. దారిలో పెద్ద అడవి ఉంది.
3. అడవిలో పోతా ఉంటే ఒక పులి పెద్దమ్మను తినేస్తానంది.
4. ప్రయాణంలో పెద్దమ్మకు ఒళ్లంతా చెమట పట్టింది.
5. పెద్దమ్మ స్నానం చేయడానికి చెరువులోకి పోయింది.

*3.* పాఠాన్ని చదివి కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :

1. బలంగా ఉండటం ×
2. చేదు ×
3. దుఃఖం ×
4. లోపల ×
5. పోవటం ×
6. సంతోషించటం ×
7. ఆహాయం ×

*4.* కింది మాటలను సొంతవాక్యాలలో ఉపయోగించి రాయండి :

1. చిక్కిపోవడం 2. మంటెక్కు
3. కాలంగడపడం 4. కనిపెట్టు

*5.* కింది ప్రశ్నలకు జవాబులు రాయండి :

1. పేదరాసి పెద్దమ్మకు ఎందరు కూతుళ్లు ?
2. ఆమె ఎలా కాలం గడుపుతూ ఉండేది ?



ఇంతలో కాపు చింతబరికెలు తీసుకొని వచ్చాడు. నక్కను చూసి, "ఇదేమిటి ? నా ఆకు మళ్ళు పాడుచేసేది పోయి కోళ్ళు కాజేసేది వచ్చిందా ? దేహశుద్ధి చేస్తానుండు ! " అని చింత బరికెలు చెత్త అయ్యేదాకా నక్కను ఎడాపెడా ఏకి వదిలాడు.

తరువాత వాడు తన వేటకుక్కలను తీసుకురావడానికి బయలుదేరాడు. అప్పుడు కుందేలు తిరిగి వచ్చి నక్కను చూసి, " ఇంకా ఇక్కడే ఉన్నావా ? పెళ్ళివారు రాలేదా ?" అన్నది.

"నాకు పెళ్ళీ వద్దు, పెడాకులూ వద్దు ! ఈ ఉచ్చు త్వరగా విప్పు !" అన్నది నక్క. కాని కుందేలు తాత్సారంచేసి ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పసాగింది. వెంటనే ఉచ్చు విప్పితే నక్క తనను బతకనివ్వదు.

కొంతసేపటికి దూరాన కాపూ, కుక్క కనబడటం చూసి కుందేలు నక్కను విడిపించడానికి ఉచ్చు విప్పింది. కుక్కలు ఆచోటికి సమీపిస్తున్నాయి. నక్క ఆ క్షణమే బలంకొద్దీ పరుగెత్తి పారిపోయింది. కుందేలు కూడా మరోదిక్కుగా పరుగెత్తిపోయింది.

## అభ్యాసవేదిక

*1.* **అర్థాలు :**

సమీపం = దగ్గర; మేర = స్థలం; ఉచ్చు = జంతువులను, పక్షులను పట్టుకోటానికి వేసే ఉరి; గమ్మత్తు = వింత, విచిత్రం; తాత్సారం = ఆలస్యం; మరగటం = అలవాటు పడటం; సంగతి = విషయం; సుస్తీ = జబ్బు; పన్నటం = చేయటం; మొహం = ముఖం.

*2.* ***కింది పదాలకు అదే అర్థం వచ్చే మరి రెండు పదాలు రాయండి :***

1. మేర = (1) __________ (2) __________
2. గమ్మత్తు = (1) __________ (2) __________
3. సంగతి = (1) __________ (2) __________
4. మొహం = (1) __________ (2) __________
5. కుందేలు = (1) (2) __________
6. నక్క = (1) __________ (2) __________
7. చోటు = (1) __________ (2) __________

3. కింది పదాలకుగల వేర్వేరు అర్థాలు గమనించండి. నేర్చుకోండి.

1. సంగతి = విషయం, స్నేహం
2. మరగటం = అలవాటుపడటం, సలసల కాగడం
3. మడి = పొలం, మడివస్త్రం
4. సమయం = కాలం, సంకేతం, ప్రతిజ్ఞ
5. పన్ను = చేయు, శిస్తు, దంతం

4. కింది మాటలను సొంతవాక్యాలలో ఉపయోగించి రాయండి :-

1. ఉప్పుపన్ను
2. బుద్ధిచెప్పటం
3. నిర్బంధంపెట్టు
4. దేహశుద్ధిచేయు

5. కింది పదాలలో ఉన్న అక్షరాలు తారుమారుగా ఉన్నాయి. వాటిని క్రమంగా ఉంచి, అర్థవంతమైన పదాలుగా రాయండి.

ఉదా : విఅడ–అడవి

1. పంసమీ
2. లుదేకుం
3. యంఉపా
4. యిమ్మాఅ
5. ధంర్బంని
6. తిగసం
7. ద్ధిహదేశు
8. లుయబ
9. రదతొం
10. యంమస

6. కింద యివ్వబడిన పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :

1. సమీపం ×
2. ఉపాయం ×
3. నమ్మకం ×
4. పుణ్యం ×
5. విప్పటం ×

7. కింది ప్రశ్నలకు జవాబులు రాయండి :

1. కాపు ఎందుకు ఉచ్చు పన్నాడు ?
2. ఉచ్చులో చిక్కుకొన్నదెవరు ?
3. దానినిచూచి కాపు ఏమి చేశాడు ?
4. అప్పుడు కుందేలు పన్నిన ఉపాయమేమి ?
5. చిక్కులోపడిన నక్కను కాపు ఏమి చేశాడు ?
6. కుందేలు నక్కను ఎట్లా విడిపించింది ?

8. కింది వాక్యాలలోని ఖాళీలను బ్రాకెట్లలో ఇవ్వబడిన పదాలలో సరియైన పదంతో పూరించండి : 1

1. అడవి ______ లో ఒక కాపు నివసిస్తూ వుండేవాడు.
(దగ్గర, సమీపం, దూరం)
2. కాపు నాటిన ఆకుమడులను ______ తినమరిగింది.
(కుందేలు, నక్క, జింక)
3. కుందేలు కాపు పన్నిన ______ లో చిక్కుకొన్నది.
(వల, బోను, ఉచ్చు)
4. కుందేలు తెలివిగా నక్కను తన ______ లో కట్టేసింది.
(స్థలం, స్థానం, ప్రదేశం)
5. కాపు నక్కను ______ తో ఎడాపెడా ఏకి వదిలాడు.
(కర్ర, తాటి, చింతబరికెలు)
6. కాపు రాకను గమనించి కుందేలు నక్కను ______ ఉచ్చు విప్పింది.
(పంపివేయడానికి, విడిపించడానికి, కొట్టడానికి)

9. కింద కథకు సంబంధించిన కొన్ని వాక్యాలు ఉన్నాయి. అవి వరుసక్రమంలో లేవు. కథను చదివి కథానుక్రమంగా అమర్చి రాయండి :

1. ఉచ్చులో ఉన్న నక్కను కాపు చింతబరికెలతో బాదాడు.
2. కుందేలు ఆకుకూరలు తినమరిగింది.

3. అడవి సమీపంలో ఒక కాపు నివసిస్తూండేవాడు.
4. నక్క బలంకొద్దీ పరుగెత్తి పారిపోయింది.
5. కాపు కొంతమేర దున్ని ఆకుకూర మడులు నాటాడు.
6. కుందేలు తెలివిగా తన స్థానంలో నక్కను కట్టేసింది.
7. కాపు పన్నిన ఉచ్చును గమనించక కుందేలు అందులో చిక్కుకున్నది.
8. వైద్యుని దగ్గరకు వెళ్ళివస్తానని చెప్పి కుందేలు కొంతదూరం వెళ్ళి పొదలో దాగింది.
9. కాపు కుక్కలను తీసుకురావడాన్ని చూచి కుందేలు నక్కను విడిపించింది

***10.*** **విద్యార్థులకు సూచనలు :**

1. ఈ కథను చదివారు గదా ! ఇందులో నక్క తనను బ్రతకనివ్వదని తెలిసికూడ కుందేలు ఎందుకు దానిని ఉచ్చునుండి విడిపించిందో ఆలోచించండి.
2. ఇలాంటి జంతువుల, పక్షుల కథలను చదవండి. నీతిని గ్రహించండి.
3. సొంతంగా కథలు చెప్పడానికి లేదా రాయడానికి ప్రయత్నించండి.

***11.*** **ఉపాధ్యాయులకు సూచనలు :**

1. కథలోని పాత్రల కనుగుణంగా కాగితపు తొడుగులు (Paper Masks) గాని, తోలు బొమ్మలనుగాని, తయారుచేసి, కథను నాటకీకరించి ప్రదర్శింపచేయండి.
2. కథననుసరించి కథాపుస్తకం లేదా జిగ్ జాగ్ పుస్తకం తయారుచేసి, దానిని విద్యార్థులు చదివేట్లు అలవాటు చేయండి.
3. కథావాక్యాలు రాసిన కార్డుముక్కలను విద్యార్థులు కథానుక్రమంగా అమర్చి పఠించేట్లు చూడండి. దీనికి ఫ్లానెలు బోర్డును గూడ వినియోగించవచ్చు.

—— 0 ——

# 3. తరగని చెట్టు

[పొదుపుగా ఖర్చుపెడుతూ కష్టపడి సంపాదించే డబ్బు దానికదే రెట్టింపు అవుతుంది. విలాసాలకు పోయి ధనం ఖర్చుచేస్తే బికారులు కావడం తథ్యం. ఈ కథలో ' హోయాంగ్ ' పొదుపు పాటించక ఖర్చుచేసి బీద వాడవుతాడు. అతని మిత్రుడు 'గ్యాన్ హాంగ్' గుణపాఠం నేర్పుతాడు. హోయాంగ్ సిగ్గుపడి తన ప్రవర్తన మార్చుకుంటాడు. కష్టపడి పనిచేసి, డబ్బు సంపాదించాలని నిర్ణయం తీసుకుంటాడు.]

***పాఠంలో ముఖ్యమైన పదాలు :***

| | | | |
|---|---|---|---|
| తీరం | జీవనం | ధ్వంసం | నిరాశ |
| కూలిపోవు | దిశ | వాగ్దానం | సమర్థించుకొను |
| వర్తకులు | అఖాతం | మెళకువ | నిమిత్తం |
| చాంగ్‌లు | జబ్బు | ధ్వంసం | రాజధాని |
| ఒప్పందం | ఆహారం | ఆకర్షితులు | ఖరీదు |
| ప్రారంభించు | మోడు | రీతి | తరగడం |
| అంతమగు | మోతాదు | ఇరుగుపొరుగు | తుఫాను |
| వృద్ధి | | | |

* * *

పూర్వం చైనా దక్షిణ సముద్రతీరాన ' స్వతేవు ' ఓడరేవు దగ్గర ' గ్యాన్ హాంగ్ ' 'హోయాంగ్ ' అనే ఇద్దరు చైనా వర్తకులు ఇరుగుపొరుగు ఉండేవారు. ఇద్దరూ చిన్ననాటినుంచి ప్రాణస్నేహితులు. వారు ' స్వతేవు ఓడరేవు దగ్గర చిన్న చిన్న వస్తువులను అమ్మి జీవనం గడుపుకొనేవారు.

ఒకరోజు భయంకరమైన పెనుగాలి, తుఫాను వచ్చి ఆ ఓడరేవున పూర్తిగా ధ్వంసం చేసింది. ఆ తుఫానువల్ల ఓడరేవు చుట్టుపక్కల ఉన్న ఇళ్ళు

కూలిపోయాయి. గ్యాన్ హాంగ్, హోయాంగ్ లు కూడ చాలా నష్టపడ్డారు. వాళ్ళ వ్యాపారం కూడ దెబ్బతింది. అయినా వాళ్లు నిరాశపడలేదు. థాయిలాండ్ వెళ్ళి వ్యాపారం చేయాలని వారం రోజులు చాలా కష్టపడి దారి ఖర్చులకు సరిపడే కొంత డబ్బు సంపాదించారు.

ఒకరోజు వాళ్ళు థాయిలాండ్ కు ప్రయాణమయ్యారు. వాళ్ళదగ్గర కొంచెం డబ్బు, వేసుకొన్న దుస్తులు తప్ప ఇంకేమీ లేవు. కొద్దిరోజులు ఓడలో ప్రయాణించి థాయ్ లాండ్ అఖాతం చేరుకున్నారు. అక్కడనుండి 'మేనమ్' నదిద్వారా థాయ్ లాండ్ రాజధాని బాంకాక్ నగరాన్ని చేరుకున్నారు. వాళ్ళిద్దరూ అక్కడే వ్యాపారం ప్రారంభించాలని నిర్ణయించుకున్నారు.

వాళ్ళిద్దరూ కలసి ఒకచోట వ్యాపారం చేయకూడదనీ, ఒకరు బాంకాక్ ఉత్తర దిశకూ, మరొకరు దక్షిణదిశకూ వెళ్ళాలని అనుకున్నారు. తమ వీలునుబట్టి వివిధ వస్తువులతో వ్యాపారం చేయాలనీ, తక్కువ డబ్బు ఖర్చుపెట్టాలనీ, వ్యాపారంలో అన్ని మెళకువలూ ప్రదర్శించి యాభై చాంగ్ లు సంపాదించిన తరువాతనే తిరిగి వారు ఒకరినొకరు కలుసుకోవాలని ఒప్పందం చేసుకొన్నారు.

" తాము యాభై చాంగ్ లు సంపాదించేవరకూ సాదా జీవితం గడపాలనీ, కష్టపడి పనిచేయాలని, బియ్యం, ఊరగాయ, ఉప్పు, సముద్రపు చేపలు తినాలనీ, పంది, బాతు, కోడిమాంసం వంటి ఖరీదైన వస్తువులు తినకూడదనీ " వాళ్ళిద్దరూ వాగ్దానాలు చేసుకొని తమ తమ దిశలకు వ్యాపారం నిమిత్తం వెళ్ళిపోయారు.

గ్యాన్ హాంగ్ తమ ఒప్పందాన్ని అక్షరాలా పాటిస్తూ పనిచేయసాగాడు. మామూలు ఆహారం తిని జీవించసాగాడు. ఎప్పుడూ రుచికరమైన వస్తువులను

కన్నెత్తికూడా చూడలేదు. తన వ్యాపార విషయంలో నమ్మకంగా, కలుపుగోలుగ ఉండేవాడు. అతని సాధారణ జీవితాన్ని, సుగుణాలను చూసి అక్కడి ప్రజలు చాలా ఆకర్షితులయ్యారు.

వ్యాపారం బాగా జరుగసాగింది. ఆ ప్రాంతంలో అతను మంచిపేరూ, పేరుతో బాటు డబ్బుకూడా బాగా సంపాదించాడు. ప్రణాళిక ప్రకారం త్వరలోనే యాభై చాంగ్‌లు సంపాదించాడు. అయినప్పటికీ అతను సాధారణ జీవితమే గడిపేవాడు. అతను నూరుచాంగ్‌లు సంపాదించిన తర్వాత, తన వ్యాపారానికి ఇంకేమి ఆటంకం లేదని తన సంపాదనతో తృప్తిపడి, మంచి ఇల్లు కట్టించాడు. పెళ్ళికూడా చేసికొన్నాడు. తర్వాత మంచి ఖరీదైన ఆహారం తింటూ సంతోషంగా జీవించసాగాడు.

బాంకాక్ రెండవ వైపుగా బయలుదేరిన హోయాంగ్ కూడా ఏదో వ్యాపారం ప్రారంభించాడు. తన కష్టానికి తగ్గట్టు అతనికి డబ్బు వచ్చేది. తన మిత్రునికి ఇచ్చిన మాట ప్రకారం అతను కూడ మొదట మామూలు ఆహారమే తింటూ ఉండేవాడు. కాని ఒకే రకపు ఆహారం తిని తిని అతనికి విసుగనిపించింది. దీంట్లో రుచిగాని, శక్తిగాని లేదని అనుకున్నాడు. "నేను రోజు రోజుకి బలహీనమైపోతున్నాను. అక్కడ నా స్నేహితుడు గ్యాన్‌హాంగ్ మంచి భోజనం తింటున్నాడేమో, అతను నాకోసమే ఈ విధమైన నియమాన్ని పెట్టాడేమో " అని అనుకున్నాడు.

" డబ్బు కూడబెట్టవలసిందే కాని, రోజూ నేను సాధారణమైన తిండికోసం ఎంత డబ్బు ఖర్చుపెడుతున్నానో అంతే డబ్బుకు ఏదైనా బాతు దొరికితే దాన్ని తినడంలో తప్పేముంది ?" అని సమర్థించుకున్నాడు హోయాంగ్.

ఒకరోజు అతనికి తక్కువ ధరలో ఒక బాతు దొరికింది. ఆ బాతు ఏదోజబ్బుతో చనిపోయింది. అందుచేత తక్కువ ధరకే దొరికింది. హోయాంగ్ దాన్ని కొని తిన్నాడు. చాలా రోజుల తర్వాత బాతు మాంసం తిన్నందువల్ల అతనికి కుళ్ళిన బాతు మాంసం కూడ రుచిగానే అనిపించింది.

మరునాడు అక్కడే ఇంకొక చనిపోయిన బాతును కొన్నాడు. కాని ఆ రోజు అతనికి ఆ మాంసం రుచించలేదు. మూడవ రోజు అతను బతికివున్న మంచి బాతును కొని తిన్నాడు. దాని మాంసం అతనికి చాలా రుచిగా వుంది. రోజూ బాతు, కోడి, పంది రకరకాల జంతువుల మాంసం తినేవాడు.

కడుపునిండా మంచి ఆహారం పడితే నిద్రకూడా ఎక్కువగా వస్తుంది. మరి సోమరి కూడా అవుతాడు. హోయాంగ్ రోజూ కడుపునిండా తిని హాయిగా కాలం గడిపేవాడు. రోజూ సంపాదించినదంతా ఖర్చుచేసేవాడు. అందువల్ల అతను యాభై చాంగ్‌లు కూడబెట్టలేకపోయాడు.

ఒకరోజు హోయాంగ్‌కు తన స్నేహితుని చూడాలనిపించింది. అతను అక్కడ నుంచి బాంకాక్‌కు ప్రయాణమయ్యాడు. అక్కడికి వెళ్ళిన తర్వాత తన స్నేహితుడు పెద్ద భవనంలో ఉంటున్నాడని తెలిసి చాలా ఆశ్చర్యపడ్డాడు. అతని దగ్గరకు వెళ్ళి తన స్థితిని గురించి తెలిపాడు.

స్నేహితుడు అతనిని ఏమీ అనలేదు. హోయాంగ్ ఇష్టం ప్రకారం అతన్ని గ్యాన్‌హాంగ్ తన దగ్గరే ఉంచుకున్నాడు. అతనికి రోజూ అన్నం, ఊరగాయ, ఉప్పు, సముద్రపుచేపలు పెట్టేవాడు.

కొద్దిరోజుల తర్వాత అతనికి విసుగు అనిపించింది. ఆ ఆహారంతో పాటు చింతాకులు కూడా ఉడికించి తింటానని తన మిత్రుడిని అడిగాడు. తన

మిత్రుని ఇష్టప్రకారమే తన తోటలోని ఒక చిన్న చింతమొక్కను చూపించి " దీని ఆకులు నీవు బియ్యంతో ఉడికించి తింటూండు " అని అన్నాడు.

మరునాటినుండి హాయాంగ్ ఆ మొక్క ఆకులు తుంచి బియ్యంతోపాటు ఉడికించి తినసాగాడు. కొన్ని రోజుల తర్వాత ఆ మొక్క ఆకులన్నీ అయిపోయాయి. మోడు మాత్రం మిగిలింది. తర్వాత అదికూడా ఎండిపోయింది.

హాయాంగ్ స్నేహితుని దగ్గరికి వెళ్ళి " ఆ మొక్క ఆకులన్నీ అయిపోయాయి. మొక్కకూడా ఎండిపోయింద " ని చెప్పాడు. అప్పుడు అతని స్నేహితుడు ఏమీ అనలేదు. " మరేం ఫర్వాలేదు నేను నీకోసం వేరే ఏర్పాటు చూపెడతాను. నీవు రేపు నాకు గుర్తుచెయ్యి. " అన్నాడు.



మరునాడు హోయాంగ్‌కు మిత్రుడు తన తోటలోని ఒక పెద్ద చింతచెట్టు చూపించి " ఈ చెట్టు ఆకులు తినమన్నాడు. ఈ చెట్టు ఆకులు కూడ అయిపోయినప్పుడు నాతో చెప్పు. నేను నీకు మాంసం, చేపలున్న మంచి భోజనం ఏర్పాటు చేస్తా" అన్నాడు. హోయాంగ్ చాలా సంతోషించాడు. త్వరగా ఆ చెట్టు ఆకులన్నీ తింటాను. నాకు మంచి భోజనం లభిస్తుంద'ని హోయాంగ్ అనుకున్నాడు.

హోయాంగ్ బియ్యంలో ఎక్కువ మోతాదు చింతాకులు వేసి ఉడికించి తినసాగాడు. కాని నెలలు తర్వాతకూడా ఆ చెట్టు ఆకులు అయిపోలేదు. అతనికి చాలా నిరాశ కలిగింది.

చివరికి ఒకనాడు హోయాంగ్ మిత్రుని దగ్గరికి వెళ్ళి " నేను రోజూ ఎక్కువ ఆకులు తింటున్నాను. అయినా ఆ చెట్టు ఆకులు తరగలేదు. ఈ రోజు నేనెన్ని ఆకులు తుంచుతానో, అన్ని మరుసటిరోజు చిగురిస్తున్నాయి. నాకు చాలా విసుగ్గా ఉంది. ఏదైనా దారిచూపు " అన్నాడు.

తన మిత్రుని మాటలు విని గ్యాన్ నవ్వి భుజం మీద చెయ్యివేసి ఇలా అన్నాడు. " ఇది అలానే జరుగుతుంది. ప్రపంచ రీతే అంత. నీ సంపాదన చిన్న చింతమొక్కంత ఉన్నపుడు నీవు దాన్ని వెంటనే ఖర్చు పెట్టేశావు. అందువల్ల అది వృద్ధి కాలేదు. ఆఖరికి అంతా అయిపోయింది.

కాని నేను నా శ్రమ, శ్రద్ధవల్ల మొదట చిన్న చింతమొక్కలా సమానంగా ఉన్న నా సంపాదనను పెంచుకున్నాను. దానిలో మిగిలించి ఆ మొక్కను పెద్ద చింతచెట్టులా చేశాను. అందువల్ల దానినుండి ఎంత ఖర్చుచేసినా పెరుగుతుందే కాని తరగదు. ఎప్పటికీ అంతమవదు కూడా ".

మిత్రుని మాటలకు హోయాంగ్ చాలా సిగ్గుపడ్డాడు. " నాకు మం గుణపాఠం నేర్పావు. నేను ఈ పాఠాన్ని జీవితాంతం గుర్తుంచుకొంటాను. నేను కూడా నీలాగే పనిచేస్తాను. నా సంపాదన పెద్ద చింతచెట్టు మాదిరిగ అయ్యేటంతవరకూ ఖర్చు తగ్గించుకుంటాను. అది వృద్ధి అయిన తర్వాత నేను మళ్ళీ నీకు నా ముఖం చూపిస్తాను. " అని వెళ్ళిపోయాడు.

### అభ్యాసవేదిక

*1.* **అర్థాలు :**

తీరం = ఒడ్డు; వర్తకులు = వ్యాపారం చేసేవారు; రాజధాని = ముఖ్యపట్టణ ధ్వంసం = నాశనం; దుస్తులు = బట్టలు; దిశ = దిక్కు; మెళకువ = నైపుణ్య ఒప్పందం = అంగీకారం; నిమిత్తం = కొరకు, కోసం; ఖరీదు + ఐన = వెలగలిగిన; నియమం = కట్టడి; మోడు = ఆకులులేని చెట్టు; చాంగ్ లు = చైనాదే ద్రవ్యమానం (మన రూపాయిల్లాంటివి); మోతాదు = ఒకసారికి కావలసినంత.

***2.* కింది పదాలకు అదే అర్థం వచ్చే మరి రెండు పదాలు రాయండి :**

1. వ్యాపారి = (1) ________ (2)
2. తీరం = (1) ________ (2)
3. ఒప్పందం = (1) ________ (2)
4. ప్రాంతం = (1) ________ (2)
5. ఆహారం = (1) ________ (2)
6. మిత్రుడు = (1) ________ (2)
7. ధర = (1) ________ (2)
8. ఇష్టం = (1) ________ (2)
9. రీతి = (1) ________ (2)
10. వృద్ధి = (1) ________ (2)

. పాఠాన్ని చదివి కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :

1. శత్రువు ×  2. వృద్ధిచేయు ×
3. తక్కువ ×  4. సోమరి ×
5. దుర్గుణం ×  6. బ్రతికిన ×
7. అయిష్టం ×  8. దుఃఖించు ×
9. సంపాదించు ×  10. తరగడం ×
11. నిరాశ ×

4. కింది పదానికి ముందు సరియైన అక్షరాలు చేర్చి, అర్థవంతమైన కొన్ని పదాలు రాయండి. వాటి అర్థం కూడా రాయండి :

హారం. ఉదా :– ఆహారం = తిండి.

5. కింది మాటలను సొంత వాక్యాలలో ఉపయోగించి రాయండి :

1. జీవనం గడుపు  2. కన్నెత్తి చూచు
3. ఏర్పాటుచేయు  4. ఖర్చుపెట్టు

6. కింది పదాలను, వాటికి సంబంధించిన పదాలతో జతపరచండి :

| | అ | | ఆ | |
|---|---|---|---|---|
| 1. | బాంకాక్ | – | శ్రమజీవి | ( ) |
| 2. | గ్యాన్‌హాంగ్, హాయాంగ్ | – | సోమరి | ( ) |
| 3. | చాంగ్‌లు | – | థాయ్‌లాండ్ రాజధాని | ( ) |
| 4. | హాయాంగ్ | – | ప్రాణస్నేహితులు | ( |
| 5. | గ్యాన్‌హాంగ్ | – | చైనా ద్రవ్యమానము | ( |
| 6. | స్వతేవు | | | |

7. కింది ప్రశ్నలకు సమాధానాలు రాయండి :

1. చైనా వర్తకుల పేర్లేమి ?
2. వారు ఎట్లా జీవనం గడుపుకొనేవారు ?
3. ఒకరోజు తుఫాను వలన ఏమి జరిగింది ?
4. వారు ఏమని నిర్ణయించుకున్నారు ?
5. మిత్రులిద్దరు ఏమి ఒప్పందం చేసుకొన్నారు ?
6. గ్యాన్‌హాంగ్ ఎందుకు సంతోషంగా జీవించసాగాడు ?
7. హోయాంగ్ ఎందుకు కష్టపడ్డాడు ?
8. హోయాంగ్ ఎట్లు గుణపాఠం నేర్చుకున్నాడు ?

8. కింది వాక్యాలలోని ఖాళీలను పూరించండి :

1. చైనా దక్షిణ సముద్రతీరంలో __________ ఓడరేవు ఉంది.
2. చైనా వర్తకులు __________ ఉండేవారు.
3. ఒకరోజు భయంకరమైన __________ __________ వచ్చి ఓడరేవును ధ్వంసం చేసింది.
4. వాళ్ళు __________ నదిద్వారా బాంకాక్ చేరుకున్నారు.
5. వారు ఒకచోట __________ చేయకూడదని, __________ __________ సంపాదించిన తర్వాతనే కలుసుకోవాలని __________ చేసుకున్నారు.
6. గ్యాన్‌హాంగ్ వ్యాపారం బాగా జరిగి __________ __________ కూడ సంపాదించారు.
7. హోయాంగ్ ఆహారంతోపాటు __________ కూడా ఉడికించి తిన్నాడు.

**9.** విద్యార్థులకు సూచనలు :

1. ఈ కథలో కన్పించే మనుషుల పేర్లు, పట్టణాల పేర్లు, డబ్బును సూచించే పేర్లు కొత్తగా అనిపిస్తున్నాయి కదూ. అలవాటు చేసుకోండి. ఒకటి, రెండుసార్లు కాగితం మీద రాసి గుర్తుపెట్టుకోండి.
2. మీకు తెలిసిన ఇటువంటి కథను ఒకటి రాసి చూపండి.

**10.** ఉపాధ్యాయులకు సూచనలు :

1. విద్యార్థులను జట్లుగా విభజించి వారిచే పదనిర్మాణపుఆట, వాక్య నిర్మాణపు ఆటలు ఆడించండి. పదాలకు అర్థాలను డామినో ఆటద్వారా తెలపండి.
2. ప్రపంచ పటంలో చైనా, థాయ్‌లాండ్, బాంకాక్ పట్టణాలను పిల్లలచే గుర్తింపజేయండి.
3. ' చాంగ్ ' (చైనా ద్రవ్యమానం) ను గూర్చి తెలియజేయండి.
4. కథను ఒ[illegible] సంభాషణలు రాసి, పిల్లలచే నాటకీకరింపజేయండి. పొదుపును అలవాటు చేయించండి.

—o—

# 4. పూలమాల

[ఎర్రని మందారాలు, తెల్లని నందివర్ధనాలు, చామంతిపూలు, గన్నేరుపూలు, గులాబీలు, కనకాంబరాలు — ఇవి రకరకాల పూలు. అన్ని రకాలనూ కలిపి పూలమాల కట్టవచ్చు. అది అందంగా ఉంటుంది. అట్లాగే మనదేశంలోని ప్రజలు ఏ మతానికి చెందినా, ఏ భాషకు చెందినా, అందరూ కలసి ఉంటేనే అందం. బడిలోని పిల్లల మనస్సులో కలిగిన మంచి మార్పును ఈ కథ తెలుపుతుంది.]

**పాఠంలో ముఖ్యమైన పదాలు :**

| | | | |
|---|---|---|---|
| సందడి | మాల | ఆరాటం | అతిథి |
| ముఖ్య అతిథి | రుమాలు | గుంజుకుంటూ | శోభ |
| పెరడు | గంతులేయు | కొల్లలు | వాదన |
| ఆవరణ | ఉత్సవం | ఆలపించు | కలవరపడు |
| తగవులాడు | మాత | ఆశీర్వాదం | |
| ప్రధానోపాధ్యాయులు | | చిత్రపటం | ఫోటో |
| ఆఫీసరు | ఆఫీసరమ్మ | స్వాతంత్ర్య దినోత్సవం | |

* * *

ఆ రోజు స్వాతంత్ర్య దినోత్సవం. సిరిపురం అనే చిన్న వూరిలో కూడా వేడుకగా జెండా పండుగని జరుపుతారు. ఊరిమధ్యన వున్న బళ్లో ఆవరణంతా శుభ్రంచేసి రంగు రంగుల కాగితాల తోరణాలు కట్టారు. పట్నంనుంచి తెప్పించిన మైకులవారు మంచి పాటలు వేస్తున్నారు. పిల్లలు ఎంతో సందడిగా పరుగులు పెడుతున్నారు.

బడి ప్రధానోపాధ్యాయులు ఈశ్వరరావుగారు ముందురోజే పిల్లలకు చెప్పారు, పట్నంనుంచి పెద్ద ఆఫీసరుగారు ఒకరు వచ్చి జెండా ఎగరవేస్తారని. బడిలో ప్రవేశించగానే వుండే పెద్ద హాలుని తుడిచి అందమైన ముగ్గులు పెట్టారు. ఒక బల్లమీద మహాత్మాగాంధీగారి ఫోటో పెట్టారు. ఇంకొంచెం పైగా భారతమాత చిత్రపటం వుంచారు. ఎంతో కళగా ఆ రంగుల బొమ్మలు మెరసిపోతూ అందరినీ ఆశీర్వదిస్తున్నట్లుగా వున్నాయి.

ఈశ్వరరావుగారు పిల్లలందరికీ ముందు రోజే చెప్పారు, ఎవరి తోటలో, పెరటిలో ఉండే పువ్వులు వారు తీసుకొనిరావాలని — అవి మాలలుగా కట్టి భారతమాతకు ఒక మాల, గాంధీ తాతకు ఒక మాల వెయ్యాలని, కొన్ని పూలు జెండాలో కట్టి ఉంచితే ఎగరవేసినప్పుడు గాలిలో తేలుతూ కిందకు వస్తాయని.

బడిపిల్లల్లో వనజ, సరోజ, లిల్లీ, ఫాతిమా యింకా రవి, రాబర్టు, సుమన్ . . . . . వీరందరూ గంతులేస్తూ వెళ్ళారు యింటికి. కారణం ఏమిటంటే వారి ఇళ్ళల్లో ఎన్నో పూల మొక్కలున్నాయి. అందరికంటే ఎక్కువ పూలు తెచ్చి ప్రధానోపాధ్యాయుల దగ్గర మంచిపేరు తెచ్చుకోవాలని వాళ్ళకి ఆరాటం.

వనజ ఆ రోజు చిన్న బుట్టనిండా ఎర్రని మందారాలు తీసికొని వచ్చింది. సరోజ తెల్లని నందివర్ధనాలు తెచ్చింది. ఫాతిమా చామంతిపూలు ఒక కవరులో పోసుకొని వచ్చింది. రవి యింట్లో గన్నేరు పువ్వులు కొల్లలుగా పూస్తాయి. అందుకని అవి ఒక రుమాలులో మూటగా కట్టుకొని వచ్చాడు. కనకాంబరాలు కోసుకొని వచ్చింది లిల్లీ. ఇంక సుమన్ తెచ్చిన ఎరుపు, తెలుపు గులాబీ రంగుల గులాబీపువ్వులు అందరినీ ఆకర్షిస్తున్నాయి. ఎవరు తెచ్చిన పూలు వారు చేతుల్లో పట్టుకొని ముందుహాల్లో నిలబడ్డారు.

ప్రధానోపాధ్యాయులు పట్నంనుంచి వచ్చే అతిథులకోసం ఏవో ఏర్పాట్లు చేస్తున్నారు. పిల్లల చేతుల్లో వున్న పువ్వులు చూసి విద్యార్థుల లీడరు వనజను దగ్గరగా పిలిచి " పూలు త్వరగా మాలలు కట్టించి పటాలకు వేయండి " అని చెప్పారు పంతులుగారు.

వనజ ఎంతో సంతోషంగా తన ఎర్ర మందారాలు దారంతో కట్టడం ఆరంభించింది.

సరోజకు కొంచెం కష్టం కలిగింది. తనపువ్వులు తీసుకోవడం లేదని "యివిగో ఈ నందివర్ధనాలు ఒక మాల కట్టిస్తాను. కొంచెం దారం ఇవ్వు అన్నది. ఫాతిమా కూడా తొందరపడింది.

" నేను ఈ చామంతులు దారంతో గుచ్చుతాను " అంది ఫాతిమా.

" నాకూ కూడా మాలకట్టడం వచ్చు. గన్నేరు పూలు కట్టేస్తాను అన్నాడు రవి.

" నా గులాబీలు కూడా చక్కగా కట్టవా ?" అన్నాడు సుమన్ రవితో.

" నేనేం కట్టను. ఆ గులాబీలు కడితే నా గన్నేరుపూలు ఎవరు చూస్తారు ?" అన్నాడు రవి.

" అసలు గన్నేరుపూలు ఏం బాగుంటాయి ? చేదు వాసన. చామంతులే అందం " గట్టిగా అంది ఫాతిమా.

" చామంతులు చిన్న చిన్నవి. మందారపువ్వులు నాలుగైతే చాలు. ఎర్రని రంగుతో ఎంత దూరమైనా కనిపిస్తాయి " అన్నది వనజ. దీనితో పిల్లలందరి మధ్య వాదన చెలరేగింది. ఎవ్వరూ ఎవ్వరి మాట వినకుండా

పూలబుట్టలు గుంజాకుంటూ అసలు దండలు కట్టడమే మానేశారు. పంతులుగారు వచ్చి చూసి సర్దుబాటు చేయడం ఆరంభించారు.

ఈలోగా పట్నంనుంచి ఆఫీసరుగారు రానే వచ్చారు. ఆమెగారు ఎంతో చదువుకొన్నారట. తమచేతుల్లోని పూలు అలాగే చాపమీద పోసేసి పిల్లలు ముందు ఆవరణలోకి పరుగెత్తారు. జెండా ఎగురవేయడం పూర్తయింది. వందేమాతరం, జనగణమన గీతాలను పిల్లలు చక్కగా ఆలాపించారు. ఆ తర్వాత సభ జరుగుతుంది హాలులో. పిల్లలను క్రమశిక్షణతో హాలులోకి వెళ్ళి కూర్చోమన్నారు ఈశ్వరరావుగారు.

ఆమెతో కలిసి హాలులోనికి వచ్చిన ఈశ్వరరావుగారు పుష్పమాలలు లేని పటాలను చూశారు. కింద చాపమీద పూలు పడివుండటం గమనించారు. ఆయనకి కోపంతో ముఖం ఎర్రబడింది. పంతులుగారి వేపు కనుసైగ చేశారు. పూలమాలలను కట్టించాలని; ముఖ్య అతిథి ఆఫీసరమ్మగారు వీరంతా ఏదో కలవరపడుతున్నారని గ్రహించారు. " ఏమిటి సంగతి " అని అడిగారు. పంతులుగారు ఉన్నదున్నట్లుగా చెప్పారు.

పిల్లలంతా హాలులో కూర్చున్నారు. ఆఫీసరమ్మగారు ఉపన్యాసమిస్తూ యిలా అన్నారు. " భరతమాత మన తల్లి, మహాత్మాగాంధీగారు బాలలకు తాత. వారికి ఏ పువ్వుల మాలలువేసినా ఇష్టమే ! అందుకే ఎవరు తెచ్చిన పువ్వులు వారు మాల కట్టాలని మీరంతా తగువులాడుకున్నారని నాకు తెలిసింది. ఫలితంగా పటాలకు పుష్పమాలలు లేవు. మీ లీడరు వనజని యిక్కడకు రమ్మని కోరుతున్నాను " అన్నారు. వనజ రాగానే కొన్ని పువ్వులు ఇచ్చి అన్నిరకాలు కలిపి మాల కట్టమన్నారు. చామంతి,

నందివర్ధనం, ఎర్రమందారం, గన్నేరు, గులాబులు, అన్నీ కలిపి చక్కని మాలలు ఐదునిముషాల్లో టీచర్ల సాయంతో తయారైనాయి. మధ్యన గులాబీలు గుచ్చారు. ఈశ్వరరావుగారు ముఖ్య అతిథి కలిసి ఆ మాలలు పటాలకు వేశారు.



" ఇప్పుడు చెప్పండి ఏ పువ్వు అందంగా ఉంది ?" అన్నారు ఆఫీసరుగారు.

" అన్నీ అందంగానే ఉన్నాయి " అని అరిచారు పిల్లలు.

" అన్నీ కలిస్తేనే అందం. భారతమాతకు కూడా అదే ఇష్టం. అన్ని పువ్వులూ కలిసిన ఈ చిత్రవర్ణమాల, పుష్పకదంబమాల ఆ తల్లికి ఎంతో

శోభనిస్తున్నది. అలాగే మనం ప్రజలం. ఏ మతమైనా ఏ భాష అయినా అందరం కలసి ఉంటేనే అందం. అదే జాతికి బలం" అన్నారు ముఖ్యఅతిథి. ఎల్లలందరూ చప్పట్లు కొట్టారు.

## అభ్యాసవేదిక

1. **అర్థాలు :**

పెరడు = ఇంటికి వెనుకభాగం; మాల = దండ; గంతులు + ఏయు = ఎగురు; ఆరాటం = బాధ, కోరిక; సందడి = హడావిడి; ఆశీర్వదించు = దీవించు; రుమాలు = చేతిగుడ్డ; అతిథి = ఆహ్వానించబడినవాడు; గుంజాకుంటూ = లాక్కొంటూ; ఆలాపించు = పాడు; తగువులు + ఆడు = జగడమాడు; శోభ = అందం; మాత = తల్లి; ఉత్సవం = వేడుక.

2. **కింది వాక్యాలలో గీతగీచిన పదాలకు బదులు అదే అర్థాన్నిచ్చే వేరొక పదాన్ని ఉపయోగించి రాయండి :**

ఉదా :- స్వాతంత్ర్యదినోత్సవంనాడు ప్రధానోపాధ్యాయులు <u>పతాకం</u> ఎగరవేశారు.

స్వాతంత్ర్యదినోత్సవంనాడు ప్రధానోపాధ్యాయులు <u>జెండా</u> ఎగరవేశారు.

1. బడిలో రంగురంగుల కాగితాల <u>తోరణాలు</u> కట్టారు.
2. రకరకాల పూలతో కట్టిన మాల <u>శోభ</u>నిస్తుంది.
3. బడిలో పిల్లలు అప్పుడప్పుడూ <u>తగవులాడు</u>కొంటారు.
4. బడిలో స్వాతంత్ర్యదినోత్సవంనాడు జాతీయగీతాలు <u>ఆలాపిస్తారు.</u>

3. **పాఠాన్ని చదివారుకదా. ఈ కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :**

1. అభ్యాగతి ×
2. అపరిశుభ్రం ×
3. దూరంగా ×
4. ఆలస్యంగా ×
5. వెనుక ×

4. కింది మాటలను సొంతవాక్యాలలో ఉపయోగించి రాయండి :

1. ఎగరవేయు 2. గుంజుకొను
3. కనుసైగచేయు 4. తగవులాడు
5. ముఖం ఎర్రబడు 6. గంతులేయు

5. కింద ఇవ్వబడిన పదాలలో ఒక్కొక్క వరుసలో ఒక పదంలో ఉండవలసిన అక్షరం కాక వేరేది ఉంది. పాఠం చదివి దాన్ని సరిచేసి రాయండి :

ఉదా : తరణం, మరణం, కరణం తోరణం

1. పోరాటం, అరాటం, చెలగాటం
2. అంబరం, సంబరం, కనకంబరం
3. మాళ, కళ, తల
4. ఆట, తోఠ, మాట
5. శుభం, సుభ్రం, విభవం

6. కింది ప్రశ్నలకు సమాధానాలు రాయండి :

1. స్వాతంత్ర్యదినోత్సవంనాడు బడిలో ఏమిచేశారు ?
2. ప్రధానోపాధ్యాయులు పిల్లలకు ముందురోజే ఏమని చెప్పారు ?
3. బడిపిల్లల్లో ఎవరెవరు గంతులేస్తూ ఇంటికి వెళ్లారు ? ఎందుకు ?
4. వారిలో ఎవరెవరు ఏ యే పూలు తెచ్చారు ?
5. పిల్లల మధ్య వాదన ఎందుకు చెలరేగింది ?
6. ప్రధానోపాధ్యాయుని ముఖం ఎందుకు ఎర్రబడింది ?
7. ఆఫీసరమ్మ ఉపన్యాసమిస్తూ ఏమని అన్నారు ?
8. పూలమాలను పటాలకు వేసి ఆఫీసరుగారు ఏమని సందేశమిచ్చారు ?

7. కింది వాక్యాల్లోని ఖాళీలను పూరించండి :

1. స్వాతంత్ర్యదినోత్సవంనాడు బడిలో రంగురంగుల కాగితాల __________ కట్టారు.

2. పట్నం నుంచి గారు వచ్చి జెండా వేస్తారు.
3. బడిపిల్లలు వారి తోటల్లో నుండి తీసుకవచ్చారు.
4. వనజ సంతోషంగా తన దారంతో కట్టడం ఆరంభించింది.
5. పూలబుట్టలు అసలు దండలు కట్టడం మానేశారు.
6. ఆఫీసరుగారు భరతమాత గాంధీగారు బాలలకు అని చెప్పారు.
7. ఏ మతమైనా, ఏ భాష అయినా అందరు వుంటేనే అందం.

*8. కింది పదాలు వరుస క్రమంలో లేవు. వాటిని సరిగా కూర్చి వాక్యంగా రాయండి :*

ఉదా :– ఫోటో, బల్ల, ఒక, మహాత్మాగాంధీగారి, పెట్టారు, మీద.
ఒక బల్లమీద మహాత్మాగాంధీ గారి ఫోటో పెట్టారు.

1. ఆవరణంతా, బల్లో, కట్టారు, శుభ్రంచేసి, కాగితాల, రంగు రంగుల, తోరణాలు.
2. నుంచి, పెద్ద, ఎగురవేశారు, పట్నం, ఒకరు, ఆఫీసరుగారు, వచ్చి, జెండా.
3. నిండా, ఎర్రని, ఆ రోజు, తీసుకొని, వనజ, చిన్నబుట్ట, వచ్చింది, మందారాలు.
4. ఒకరిమాట, పిల్లలు, దండలు, ఒకరు, కట్టడం, వినకుండా, మానేశారు.
5. కలసి, ఏ మతమైనా, అందం, ఏ భాష , అయినా, ఉంటేనే, అందరం.

*9. విద్యార్థులకు సలహాలు :*

ఈ పాఠంలో కొన్ని ఇంగ్లీషు పదాలు ఉన్నాయి. వాటిని గుర్తించండి. మనం నిత్యజీవితంలో వాడే మరికొన్ని ఇంగ్లీషు పదాలను తెలుగు అక్షరాల్లో రాయండి.

స్వాతంత్ర్యదినోత్సవపు వేడుకల్లో పాల్గొనండి. జాతీయగీతాలు పాడండి. మనం ఎన్ని భాషలు మాట్లాడినా, ఏ మతానికి చెందినవారైనా, మనందరం ఒక్కటే ' మనం భారతీయులం ' అని గ్రహించండి.

10. ఉపాధ్యాయులకు సూచనలు :

ఈ పాఠంలో కొన్ని ఇంగ్లీషు పదాలు ఉన్నాయి. వాటి అర్థాలు చెప్పండి.

మైకు, ఆఫీసరు, హాలు, లీడరు, టీచర్లు, మొదలైనవి.

బడిలో జాతీయ పండుగలు జరిపి, అందులో పిల్లలు పాల్గొనేట్లు చూడండి జాతీయ గీతాలు నేర్పించి, పాడించండి. జాతీయ సమైక్యతాభావాన్ని పెంపొందించండి.

స్వాతంత్ర్యదినోత్సవం గూర్చి విద్యార్థులచేత సొంతంగా రాయించండి.

వాక్యనిర్మాణపు ఆటలు, పదనిర్మాణపు ఆటలు, డామినో ఆటలు, గళ నుడికట్టు మొదలైన భాషాక్రీడలను ప్రవేశపెట్టండి.

## వ్యాకరణం

మనం రాసే భాషలో మీరు అక్షరాలను, పదాలను, వాక్యాలను గుర్తించగలరు కదా ఇవన్నీ ఒక క్రమంలో ఉంటాయి. వీటి మధ్య ఒక సంబంధం ఉంటుంది. ముఖ్యం పదాల కలయికను వివరించేది వ్యాకరణం. ఇది సంస్కృతపదం.

క్రియలు :

క్రియ అంటే ఏమిటో మీరు నాలుగో తరగతిలో కొద్దిగా తెలుసుకున్నారు. మ॰ కొంత ఇప్పుడు తెలుసుకుంటారు. ఈ వాక్యాలను గమనించండి.

నాగన్న దుక్కి దున్నాడు.

రామయ్య కూలీపని చేస్తున్నాడు.

ఆ పొలం కోతకు వచ్చింది.

వర్షాలు కురిస్తే పంటలు పండుతాయి.

పై వాక్యాల్లో గీతగీసిన పదాలు– " దున్నాడు, చేస్తున్నాడు, వచ్చిం॰ పండుతాయి " అనేవి ఆ వాక్యంలో జరిగిన పనిని తెలుపుతున్నాయి. అంటే క్రియాపదాలు పనిని తెలిపేవి అన్నమాట. వాటినే క్రియలు అనికూడా అనవచ్చు. ఈ క్రియల మూలరూపాలను (దున్ను, చేయు, వచ్చు, పండు) అవసరాన్నిబట్టి కొన్ని మార్పులు చేస్తాం.

ఇప్పుడు ఈ వాక్యాలను గమనించండి.

కిష్టయ్య దుక్కిదున్నాడు.

కిష్టయ్య దుక్కి దున్ని . . . .

పై వాక్యాల్లో మొదటి వాక్యం క్రియా పదం ' దున్నాడు ' అనేదాని అర్థం గ్రహిస్తే, దానితో వాక్యం పూర్తయిందని గ్రహించవచ్చు. అట్లాగే రెండోవాక్యంలో ఉన్న క్రియాపదం ' దున్ని 'తో వాక్యం ముగియలేదు. దాని అర్థమూ పూర్తికాలేదు. తరువాత ఇంకా ఏదో చేయవలసిన పని ఉన్నట్లు తోస్తుంది. అంటే వాక్యం అసంపూర్ణం అన్నమాట.

వాక్యంలో క్రియాపదం పూర్తిగా ఉంటే ఆ క్రియలను 'సమాపక క్రియ'లంటారు. అట్లాగే క్రియాపదం అసంపూర్తిగా ఉంటే ఆ క్రియలను అసమాపక క్రియలంటారు. ఇప్పుడు ఈ నిర్వచనాలు గమనించండి.

చేసిన పనిని తెలిపే పదం పేరు క్రియ.

సంపూర్ణంగా చేసిన పనిని తెలిపే పదం పేరు సమాపక క్రియ.

అసంపూర్ణంగా చేసిన పనిని తెలిపే పదం పేరు అసమాపక క్రియ.

## అభ్యాసం

*1. కిందివాటిలో క్రియలేవో గుర్తించండి :*

| | | |
|---|---|---|
| అడవులు | నదులు | ఉష్ణం |
| నరుకుతారు | ప్రవహిస్తాయి | చల్లబడుస్తుంది |
| చెరువులు | ఉష | వేసవి |
| మునుగుతాయి | పరుగెత్తుతుంది | ఎండిపోతాయి |

*2. కింది వాక్యాల్లో క్రియాపదాలు గుర్తించండి :*

1. సిరిపురంలో జెండా పండుగ జరిపారు.
2. మా పాఠశాలలో బాలసేవా సంఘం ఉంది.
3. పొలంలో పిట్టలు ఎగురుతున్నాయి.
4. వీథిని తోరణాలతో అలంకరించారు.
5. తరగతిలో విద్యార్థులు క్రమశిక్షణ నేర్చుకుంటారు.

3. కింది వాక్యాలలో ఏవి సమాపక క్రియలో, ఏవి అసమాపక క్రియ గుర్తించండి :

1. బడిలోని విద్యార్థులు రకరకాల పూలు తెచ్చి మాలలు కట్టారు.
2. బల్లమీద మహాత్మాగాంధీ ఫోటో పెట్టి, పూలమాల వేశారు.
3. ఉపాధ్యాయుడు పిల్లలను హాలులోకి వెళ్ళి కూర్చోమన్నారు.
4. పిల్లలు రాత్రి చదువుకొని నిద్రించారు.

4. కింది సమాపక క్రియలను, అసమాపక క్రియలుగా మార్చండి :

1. ఆలోచించాడు
2. పరుగెత్తాను
3. చదివింది
4. ఎగిరింది
5. ఆటలాడుకున్నాను
6. తాగారు
7. పాడారు
8. భోంచేశాను
9. మాట్లాడాను

5. కింది అసమాపక క్రియలను, సమాపక క్రియలుగా మార్చండి :

1. చెప్పి
2. దుమికి
3. చేసి
4. నిద్రించి
5. పోయి
6. దాచి
7. పెట్టి
8. రచించి
9. నమిలి

6. కిందనున్న సమాపక క్రియలను అసమాపక క్రియలుగాను అసమాపక క్రియలను సమాపక క్రియలుగా మార్చండి :

| | | | |
|---|---|---|---|
| అన్నాను | __________ | పిలిపించాను | __________ |
| పోట్లాడి | __________ | గెలిపించి | __________ |
| అప్పగించి | __________ | పొగిడాను | __________ |
| కోసి | __________ | ఎదురుపడి | __________ |
| నిలబెట్టాను | __________ | ఖండించి | __________ |

—0—

గడిచిన కాలం తిరిగిరాదు

# 5. అయినవారి మాట

[జానపదులు పాడుకొనే గేయాలే జానపద గేయాలు. జానపదులంటే జనపదంలో నివసించేవాళ్లు. జనపదం అంటే ఊరు. గేయం అంటే పాట. కొన్ని పాటలు పాడుకునేవి. కొన్ని ఆడుతూ పాడేవి. కొన్ని ప్రదర్శిస్తూ పాడేవి. పల్లెటూళ్లలో కష్టించి పనిచేసేటప్పుడు శ్రమను మరచిపోవడానికి, ఉల్లాసానికి, పాడుకునే పాటలే ఇవి, ఇట్లాంటివి. ఈ పాటల్లో వినోదం, విజ్ఞానం, ఉల్లాసం, ఉపదేశం, నీతి, హాస్యం, అనుభవాలు ఇమిడి ఉంటాయి. ఈ గేయం నీతిని తెలిపేది.]

*పాఠంలో ముఖ్యమైన పదాలు :*

| | | | |
|---|---|---|---|
| చెలిమి | నలుసు | అమృతం | కల్పవృక్షం |
| కంపు | గడి | కానివారు | పోటు |
| ఆయుస్సు | పుల్ల | అతుకు | చిముడు |
| కట్టెవిరిచి పొయిలో పెట్టినట్లు | | ప్రక్కలో పోటు | |

* * *

కాని వారి తోను కావించు చెలిమి
కట్టె విరిచీ పొయిని పెట్టి నట్లుండు
అయిన వారీతోను కావించు చెలిమి
ఆకు మడచీ మడత పెట్టినట్లుండు

. . . . . . . . . . . . . . .

కానివారీ మాట కంట్లోది నలుసు
ప్రాణం పోయిం దాక ప్రక్కలో పోటు
అయిన వారీమాట అమృతంపు తేట
బ్రతికి ఉన్నందాక భాగ్యంపు మూట

... ... ... ... ...

ఉన్న వూరు విడిచి ఉండనే లేము
కన్నతల్లిని విడిచి గడియుండలేము.

... ... ... ... ...

ఆయుస్సు మూడినను ఆకు చిరిగినను
బ్రతికించు వారెవరు ? అతుకు వారెవరు ?

... ... ... ... ...

ఉన్న వూరే నాకు చెన్నపట్నమ్ము
కన్న తల్లే నాకు కల్పవృక్షమ్ము

... ... ... ... ...

చిమడకే చిమడకే ఓ చింతకాయ
నువ్వెంత చిమిడినా నీపుల్ల పోదు
ఉడకకే ఉడకకే ఓ ఉల్లిపాయ
నువ్వెంత ఉడికినా నీ కంపు పోదు

## అభ్యాసవేదిక

*1.* **అర్థాలు :**

కానివారు = విరోధులు; చెలిమి = స్నేహం; అయినవారు = స్నేహితులు; నలుసు = దుమ్ముర వ్వ; పోటు = దెబ్బ, బాధ; ఆయుస్సు = ప్రాణం, మూడు = ముగియు, సమాప్తమవు; కల్పవృక్షం = కోరిన కోరికలు తీర్చే దేవతా వృక్షం; పుల్ల = పులుపుతనం; కంపు = వాసన.

*2. కింది పదాలకు అదే అర్థం ఇచ్చే రెండు పదాలను రాయండి :*

| | | | | |
|---|---|---|---|---|
| 1. చెలిమి | = | (1) | (2) | ________ |
| 2. పోటు | = | (1) ________ | (2) | ________ |
| 3. అమృతం | = | (1) ________ | (2) | ________ |
| 4. భాగ్యం | = | (1) ________ | (2) | ________ |
| 5. గడి | = | (1) ________ | (2) | ________ |

*3. భావం :*

కానివారితో స్నేహం చేస్తే కట్టెను విరచి పొయ్యిలో పెట్టినట్లు ఉంటుంది. అయినవారితో స్నేహం చేస్తే తాంబూలం తిన్నట్లు ఉంటుంది.

నచ్చనివారి మాటలు కంటిలోపడిన నలుసుమాదిరి, జీవితాంతం బాధను కల్గిస్తాయి. నచ్చినవారి మాటలు, అమృతం మాదిరి తియ్యగా ఉండి బతికి ఉన్నంత కాలం సంపదలాగ ఉంటుంది.

కన్నతల్లిని వదలి కొంతసేపైన ఉండలేనట్లే, తామున్న ఊరుని విడిచి ఉండలేము.

ఆకు చిరిగిపోతే అతికించలేనట్లే, చావువచ్చిందంటే ఎవ్వరూ బతికించలేరు.

ఉన్న ఊరే గొప్ప పట్టణం. తన కోర్కెలు తీర్చేది కన్నతల్లే.

చింతకాయ ఎంత ఉడికినా దాని పులుపుదనం పోదు. ఉల్లిగడ్డ కూడ ఎంత ఉడికినా దాని వాసన పోదు. వాటి సహజ గుణాన్ని పోగొట్టుకోలేవు.

*4. కింది మాటలను సొంత వాక్యాల్లో ఉపయోగించి రాయండి :*

1. ఆయుస్సు మూడు
2. ప్రక్కలో పోటు
3. అమృతంపు తేట
4. భాగ్యంపు మూట
5. కట్టెవిరిచి పొయిలో పెట్టినట్లు

*5. కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :*

1. కానివారు ×
2. చెలిమి ×

3. అమృతం ×

4. భాగ్యం ×

6. కింది పదాలకు గల వేర్వేరు అర్థాలను తెలుసుకోండి :

1. అమృతం = పాలు; నీరు; నేయి; చావులేనిది.

2. మూడు = ఒక అంకె, ఆపద కలుగు.

7. కింది పదాలను సంబంధమున్న పదాలతో జతపరచండి :

| | | | |
|---|---|---|---|
| 1. అయినవారి మాట | - | బతికించలేము | ( ) |
| 2. ఆయుస్సుమూడిన | - | కల్పవృక్షం | ( ) |
| 3. కన్నతల్లి | - | విడిచి ఉండలేము | ( ) |
| 4. ఉన్నఊరు | - | అమృతంపు తేట | ( ) |
| 5. కానివారి మాట | - | | |

8. కింది ప్రశ్నలకు జవాబులు రాయండి :

1. అయినవారితో స్నేహం ఎట్లా ఉంటుంది ?

2. కానివారి మాటలెలా ఉంటాయి ?

3. ఉన్న ఊరు ఎటువంటిది ?

4. ఈ గేయం ద్వారా మనం నేర్చుకొనే నీతి ఏమిటి ?

9. కింది ఖాళీలను పూరించండి :

1. కానివారితో స్నేహం __________ విరిచి __________ పెట్టినట్లుండు.

2. అయినవారి మాట __________ బ్రతికి ఉన్నందాక __________

3. ఉన్న ఊరుని __________ ఉండనే లేము.

4. కన్నతల్లిని విడిచి __________ లేము.

5. చింతకాయ ఎంత __________ నా దాని పోదు.

6. ఉల్లిపాయ ఎంత ఉడికిన __________ పోదు.

*10.* విద్యార్థులకు సూచన :

1. ఈ గేయాన్ని కంఠస్థం చేయండి. ఇలాంటి గేయాన్ని సేకరించండి.
2. రేడియోలో వచ్చే జానపద గేయాలు వినండి.

*11.* ఉపాధ్యాయులకు సలహాలు :

1. జానపద గేయాలను వినిపించండి.
2. గేయాలు పాడమని విద్యార్థులను ప్రోత్సహించండి.
3. టి.వి., రేడియోలలో వచ్చే జానపద గేయాలను వీలుంటే వినేట్లు విద్యార్థులను ప్రోత్సహించండి.

—o—

**తనకు మించిన ధర్మం తగదు**

హుమ్మని తోడేలు ఉడుత
నొడిసి పట్టి చంపబోవ
విడువుమంచు దీనంగా
ఉడుత వేడుకోసాగెను

తోడేలే కళనుందో
తొందరపడి చంపబోక
ఉడతమ్మను చూచి చూచి
పలికెనిట్లు శిరసునుంచి,

" విడిచి పెట్టమంటావా ?
ఉడతమ్మా ; సరేగాని
సందేహం నాకొక్కటి
ఉంది, నీవు తీర్చాలది.

ఏ వేళను నిను జూచిన
ఎంతో సంతోషంతో
అరుచుచుందు వెగురుచుందు
వది యెల్లా సాధ్యమయ్యె ?

ఎల్లప్పుడు నామనసున
ఏదో ఒక దిగులుండును
ఒళ్లు మరచి పోవునంత
ఉల్లాసం నాకు లేదు..

గుప్పెడైన లేని నీకు
కోకొల్లగ తృప్తియేమి ?
నేనింత వాణ్ణికదా
ఏల నాకు సుఖంలేదు ?

అప్పుడిట్లు పలికె నుడత
" అయ్యా తోడేలుగారు !
ఆ ప్రశ్నకు సమాధాన
మంతా తెలుసండి నాకు ;

ప్రభువువారి గోళ్లవల్ల
ప్రక్కసలుపు చున్నదండి
వదిలేస్తే కొమ్మ ఎక్కి
పదిలంగా పలుకగలను"

తోడేలుకు జాలిపుట్టె
ఉడతమ్మను విడిచిపెట్టె
మెరుపులాగ కొమ్మమీది
కురికి ఉడత చెప్పెనిట్లు



" నిరాయుధుల నమాయకుల
నెత్తి మొత్తి మొక్కుచుండు
తోడేలా ! నీ పాపం
నిన్ను కట్టి కుడుపుతోంది.

నీలోపలి క్రూరత్వం
నిప్పై నిను కాల్చుచుండ
సుఖమన్నది నీకు లేదు
దిగులు నిన్ను విడిచిపోదు.

పరులకెపుడు కీడుచేసి
యెరుగని మా ఉడతజాతి
కానందం కాకేమిటి ?
సంతృప్తికి లోటేమిటి.

**అభ్యాసవేదిక**

**అర్థాలు :**

**ఆకతాయి = తుంటరి; ఒడిసిపట్టు = కొంచెం పైకి ఎగిరి పట్టుకొను; తూలి = పక్కకు ఒరిగి; శిరసు = తల; సలుపు = బాధను కలిగించు; పదిలంగా = బాగుగా; జాలి = దయ; ఉరికి = దూకి; నిరాయుధులు = ఆయుధము లేనివారు; అమాయకుడు = ఏమియు తెలియనివాడు; పరులకు = ఇతరులకు; కీడు = చెడ్డ; ఎరుగని = తెలియని; లోటు = కొదువ.**

2. కింది పదాలకు అదే అర్థం ఇచ్చే రెండు పదాలు రాయండి :

1. అడవి = (1) ________ (2) ________
2. శిరసు = (1) ________ (2)
3. సంతోషం = (1) ________ (2) ________
4. మనసు = (1) ________ (2) ________
5. పదిలం = (1) ________ (2) ________
6. క్రూరత్వం = (1) ________ (2) ________
7. కీడు = (1) ________ (2)

3. కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :

1. సంతోషం ×
2. ప్రశ్న ×
3. క్రూరత్వం ×
4. అసంతృప్తి ×
5. పాపం ×

4. కింది మాటలను సొంతవాక్యాలలో రాయండి :

1. సాధ్యమగు
2. కుదుపు
3. కీడుచేయు
4. సంతృప్తి

5. కింది పదాలను వాటికి సంబంధించిన పదాలతో జతపరచండి :

| అ | | ఆ | |
|---|---|---|---|
| 1. ఉడుత | – | చెడు | ( |
| 2. తోడేలు | – | బాగుగా, భద్రంగా | ( |
| 3. పదిలంగా | – | క్రూరస్వభావం గలది | ( |
| 4. కీడు | – | సాధుస్వభావం | ( |
| 5. జాలి | | | |

6. కింది పదాలకు ముందు అక్షరం చేరిస్తే వేరే అర్థం ఇచ్చే పదం ఏర్పడుతుంది. ఆ పదాలు రాయండి :

ఉదా :- ' దేహం ' అనే పదానికి ' సం ' చేరిస్తే ' సందేహం ' అనే పదం ఏర్పడుతుంది. అలాగే కింది పదాలకు సరియైన అక్షరాలు చేర్చి రాయండి.

—— దేశం —— సారం
—— హారం —— పురం
—— కారం —— వాసం
—— రణం —— రంగం

7. కింది ప్రశ్నలకు సమాధానాలు రాయండి :

1. ఉడుత ఎట్లా తిరుగసాగింది ?
2. ఉడుత తోడేలుపై ఎందుకు జారిపడింది ?
3. తనపై బడిన ఉడుతను చూచి తోడేలు ఏమని పలికింది ?
4. అందుకు ఉడుత ఏమని కోరింది ?
5. తోడేలుకు ఎందుకు సుఖం లేదు ?
6. ఉడుత ఎందుకు సంతృప్తితో ఉంది ?
7. ఈ కథలోని నీతి ఏమిటి ?

8. కింది వాక్యాలలోని ఖాళీలను పూరించండి :

1. ఉడుత __________ ఎక్కి దూకేస్తూ, సరదాగా __________ లో తిరగసాగింది.
2. తనపై బడిన ఉడతను, తోడేలు హుమ్మని __________ పట్టి చంపబోయింది.
3. తోడేలుకు తన __________ కాల్చుచుండ, __________ దానికి లేదు.
4. ఇతరులకు __________ చేయని ఉడుతకు __________ [illegible]ఖులేదు.

*9.* విద్యార్థులకు సూచన :

1. మీ పరిసర ప్రాంతాల్లో తిరుగాడే జంతువులను గమనించండి. వాటి పేర్లను, స్వభావాలను తెలుసుకొని రాయండి.
2. జంతువుల, పక్షుల బొమ్మలు గీయండి. వాటి గూర్చి కొన్ని వాక్యాలు రాయండి.
3. బంకమట్టితో జంతువుల బొమ్మలు తయారుచేయండి.

*10.* ఉపాధ్యాయులకు సూచన :

1. పాఠశాల పరిసర ప్రాంతాల్ని విద్యార్థులచే గమనింపచేయండి. వారు చూచిన జంతువుల పేర్లు, పక్షులు, చెట్లు, వస్తువులు రాయమని ప్రోత్సహించండి.
2. సమీప ప్రదేశాలకు క్షేత్ర దర్శనం చేయించి, విద్యార్థులు ప్రకృతి పరిశీలనం చేసేటట్లు సహకరించండి.
3. మీ సహకారంతో జంతువుల బొమ్మలు, పక్షుల బొమ్మలు చేయించి వాటిని గూర్చి రాయించి చిన్న ప్రదర్శన ఏర్పాటు చేయండి.
4. ఉపసర్గతోనున్న పదాల పట్టిక తయారుచేసి, వాటితో భాషాక్రీడలు రూపొందించండి.

## వ్యాకరణం

క్రియలు :

క్రియాపదాల్లో అసమాపక, సమాపక క్రియలున్నాయని గ్రహించారు కదా ఈ ఉదాహరణ వాక్యాలు గమనించండి.

రంగడు పశువులకు మేత వేశాడు.
సీత ఇంటిపనులు చేస్తోంది.
నేను పరీక్షలు రాస్తాను.

పై వాక్యాలలో గీతగీసిన క్రియాపదాల అర్థాలను గమనిస్తే తేడా ఉన్నట్లు స్పష్టమవుతుంది. '<u>వేశాడు</u>' అన్న క్రియాపదం ఉన్న వాక్యంలో పని ఎప్పుడో జరిగింది. ఈ జరిగిన కాలాన్ని భూతకాలం అంటారు. ఈ పదంలో రెండు మాటలున్నాయి. భూత-కాలం అని. భూత అనేమాటకు జరిగిపోయినది అని అర్థం. కాలం అనే మాటకు అర్థం తెలుసుకదా. జరిగిపోయిన కాలంలోని ఒక పనిని భూతకాల క్రియగా పిలుస్తారు. రెండో వాక్యంలో ఉన్న క్రియాపదం ' చేస్తోంది ' అన్నది పనిని జరుగుతున్నట్లుగా వివరిస్తుంది. ఈ జరుగుతున్న కాలాన్ని వర్తమానకాలం అంటారు. ఆ క్రియను వర్తమాన కాలక్రియగా పిలుస్తారు. మూడో వాక్యంలో ఉన్న క్రియాపదం ' రాస్తాను ' అన్నది పనిని జరగబోయేదిగా వివరిస్తుంది. ఈ జరగబోయే కాలాన్ని భవిష్యత్ కాలం అంటారు. ఆ క్రియను భవిష్యత్ కాలక్రియగా పిలుస్తారు.

వివిధ కాలాల్లో క్రియాపదాల్లో - సమాపక, అసమాపక క్రియల్లో వచ్చే మార్పులను గమనించడానికి ఒక ఉదాహరణ గమనించండి.

| | భూతకాలం | వర్తమానకాలం | భవిష్యత్ కాలం | వ్యతిరేకం |
|---|---|---|---|---|
| సమాపక క్రియ | చదివాడు | చదువుతున్నాడు | చదువుతాడు | చదవడు |
| అసమాపక క్రియ | చదివి | చదువుతూ | | చదవక |

వ్యతిరేకం అంటే కాదు, లేదు అని అర్థం ఇచ్చే పదాలు. క్రియల వ్యతిరేక రూపం అన్నికాలాల్లో ఒకే విధంగా ఉంటుంది.

## అభ్యాసం

1. *కింది వాక్యాల్లోని క్రియాపదాలు ఏ కాలాన్ని సూచిస్తున్నాయో గుర్తించండి :*
   1. చిన్నప్పుడు ఉష రెండు పతకాలు సాధించింది.
   2. పూలచెట్ల చుట్టూ సీతాకోక చిలుకలు తిరుగుతున్నాయి.
   3. వసంతకాలం వచ్చింది.
   4. నేను వేగంగా రాస్తాను.
   5. సమీర కవిత్వం చెప్పదు.

2. కింది క్రియాపదాలను బ్రాకెట్లలో సూచించిన కాలంలోకి మార్చండి.

1. చదివాడు (భవిష్యత్తు)
2. నములుతాడు (వర్తమానం)
3. నెమరువేసింది (వర్తమానం)
4. పెరుగుతుంది (భూతం)
5. విరిగింది (భవిష్యత్తు)
6. తరుగుతుంది (భూతం)
7. పాడుతోంది (వ్యతిరేకం)
8. వింటుంది (వ్యతిరేకం)

3. కింది వాక్యాల్లోని క్రియాపదాలను భూతకాలంలోకి మార్చండి :

1. శారద పాట పాడుతోంది.
2. మా ఊళ్ళో సంత జరుగుతుంది.
3. రైతు పొలంలో కష్టపడుతున్నాడు.
4. పిల్లలు మైదానంలో వ్యాయామం చేస్తారు.
5. అందరూ కలిసి ఆడుకోరు.

4. కింది వాక్యాల్లోని క్రియాపదాలను వర్తమానంలోకి మార్చండి :

1. ఆవు పెయ్యను ఈనింది.
2. వర్షంలో తడిస్తే జలుబు చేస్తుంది.
3. వాడి నడుం విరిగింది.
4. రవికి గొంతు పెగలదు.
5. తరగతిలో విద్యార్థులు నవ్వరు.

5. కింది వాక్యాల్లోని క్రియాపదాలను భవిష్యత్తులోకి మార్చండి :

1. ఇవాళ మద్రాసు వెళ్తున్నాను.
2. రేడియోలో పాటలు వస్తున్నాయి.
3. వాడు పకోడీలు నములుతున్నాడు.

4. సీత జడ వేసుకుంటోంది.
5. అతనికి పాఠాలు నచ్చవు.

కింది వాక్యాల్లోని క్రియాపదాలను గుర్తించి వాటిని ఇతర కాలాల్లోకి మార్చి రాయండి :

1. మా ఊరికి బస్సు వస్తుంది.
2. పంచాయితీ బళ్ళో పంతులుగారు పాఠాలు చెబుతున్నారు.
3. రచ్చబండ మీద పోట్లాట పూర్తయింది.
4. ఎడ్లబండి నెమ్మదిగా పోతోంది.
5. గజ్జెలు ఘల్లుమంటాయి.
6. పండగకి చెప్పులు కొనుక్కొన్నారు.

—0—

కాళ్ళగోళ్ళను, చేతులగోళ్ళను తరచుగా కత్తిరించుకోవాలి

# 7. లేపాక్షి

[ మనదేశంలో ఎన్నెన్నో చరిత్ర ప్రసిద్ధమయిన ప్రదేశాలున్నాయి. అటువంట వాటిలో లేపాక్షి ఒకటి. అనంతపురం జిల్లాలోని లేపాక్షి నంది చాలా పెద్దది, ప్రసిద్ధి చెందింది.]

**పాఠంలో ముఖ్యమైన పదాలు :**

సంప్రదాయం
అభిరుచి
సంబోధించు
ఆకర్షణీయం
నేలకూలు
చిత్రీకరించు
నిర్మాణం
కొనసాగించు
ఆగ్రహం
మహోన్నతం
అధ్యాత్మిక
స్వప్నం
వైచిత్రం
అగ్నిపరీక్ష

స్థానికులు
కుంటువడు
మార్దవం
ఏకశిల
సృజనాత్మకం
రూపకల్పన
ప్రశాంతత
గాంభీర్యత
సాక్షాత్కరించు
భీకరప్రమాణం
మరుగుపరచు
చిహ్నం
కళాఖండం
విధ్వంసం

కుతూహలం
ప్రావీణ్యం
మచ్చుతునక
ఉద్యుక్తుడు
లాలిత్యం
వృషభం
మానవాతీతశక్తి
ప్రాతినిధ్యం
ఉల్లాసం
క్రుద్ధుడు
అంతరిక్షం
ఉద్యుక్తుడు
వ్యక్తిత్వం
విశ్వమానవత

* * *

భారత చిత్రకళా సంప్రదాయాల పట్ల అభిరుచి ఉన్నవారికి లేపాక్షి అనగానే చిన్నసైజు అజంతా శిల్పాలనే భావన స్ఫురిస్తుంది.

శ్రీ రామచంద్రుడు తనకు ఆప్తమిత్రుడైన జటాయువు రావణునితో పోరి నేలకూలినప్పుడు ' లే ! పక్షీ ! ' అని సంబోధించిన ప్రాంతం కనుక దీనికి ఆవిధంగా లేపాక్షి అనే పేరు వచ్చిందంటారు కొందరు. ఈ గోడల స్తంభాలమీద మండపాల మీద సుందరాతి సుందరంగా లేడి కన్నులు శిల్పాలుగా, చిత్రాలుగా చిత్రీకరించిన కారణంగా ఆ పేరు వచ్చిందని మరికొందరంటారు.

ఇక్కడ వీరభద్ర దేవాలయం నిర్మించిన వీరణ్ణ, విరూపణ్ణలు తమ నేత్రాలను పీకివేసుకున్నారన్న సంఘటన ఆధారంగా లేపాక్షి అనే పేరు వచ్చిందని మరొక ఆధారం కనిపిస్తుంది. వారు ప్రజల సొమ్ముతో ఈ దేవాలయ నిర్మాణం కొనసాగించిన కారణంగా తాము విజయనగర రాయలవారి ఆగ్రహానికి గురికావలసి వస్తుందనీ తాము నిర్మించిన ఈ మహోన్నత దేవాలయాన్ని రాయలవారు ధ్వంసం చేస్తారనీ భయపడ్డారు. తమ అధ్యాత్మిక స్వప్నాలకు ప్రతిబింబాలుగా నిర్మించిన కళాఖండాల విధ్వంసనాన్ని కనులారా చూడలేక వీరణ్ణ విరూపణ్ణలు తమ నేత్రాలను తామే పీకివేసుకున్నారని అంటారు.

మైసూరు – ఆంధ్రప్రదేశ్ సరిహద్దులో అనంతపురం నుంచి బెంగళూరు వెళ్ళేదారిలో రాయలసీమలో ఉంది లేపాక్షి. హిందూపురానికి సుమారు 9 మైళ్ళ దూరం. ఆకాశంమీద మచ్చుకైనా మబ్బులు, పచ్చని చెట్లు చేమలు లేపాక్షి సమీపంలో కనిపించవు. నిప్పులు చెరిగే భూమాత మీద కణకణలాడే రాళ్ళదిబ్బలు కనిపిస్తాయి. గుంతకల్లునుంచి రైలుమీద లేపాక్షికి వెళ్ళడం సులభం.

లేపాక్షిలో ఆకర్షణీయమైనది నంది. దీన్ని స్థానికులు బసవయ్యా అని పిలుస్తారు. 15 అడుగుల ఎత్తు 22 అడుగుల పొడవులో ఏకశిలతో



తయారయిన ఈ బసవయ్య మన దేశంలోని నంది విగ్రహాల్లో పెద్దది. చాముండి కొండలమీద, తంజావూరు, రామేశ్వరం, శుచీంద్రం దేవాలయాల్లోని నంది విగ్రహాల కంటె ఈ బసవయ్య విగ్రహం పెద్దది. అయితే అంత పెద్ద విగ్రహంగా మలచిన కారణంగా ఈ బొమ్మ కళాత్మక రూపం కుంటువడలేదు. ఆ విగ్రహంమీద మలచబడిన ప్రతి స్వల్ప చిత్రకళలోను మార్దవం, మాధుర్యం జంటగా తాండవిస్తున్నాయి.

సృజనాత్మకంగా బసవయ్య రూపకల్పనే అసాధారణమైనదని చెప్పక తప్పదు. ఈ పెద్ద ఆకారంలోని బసవయ్యలో గాంభీర్యంతోపాటు ప్రశాంతత స్ఫురిస్తూంటుంది. ఆ ఆకారంమీద చెక్కబడిన శిల్పాంశాలు వివరంగా కోకొల్లలుగా సాక్షాత్కరిస్తాయి. ఈ భీకర ప్రమాణం శిల్ప నైపుణ్యాన్ని మరుగుపరచడంలేదు. పరమేశ్వరుని వాహనంగా, దాని శరీరంమీద చెక్కబడిన చిరుగంటలు, పూసలు, పువ్వులు, ఆభరణాలు, అలంకారాలు, నేత్రానందకరంగా గోచరిస్తున్నాయి. దానిమీద మైసూరును పాలించిన రాజుల డేగ-ఏనుగు చిహ్నం కనిపిస్తుంది. బసవయ్య విగ్రహం అసమానమైన ప్రమాణంలో నిలిచి ఉండటమే వ్యక్తిత్వానికి, విశ్వమానవతకు సాక్ష్యంగా సాక్షాత్కరిస్తుంది.

శైవమత చిహ్నమైన లింగానికి గొడుగులాగా ఏడుతలల నాగరాజు సృష్టి లేపాక్షి శిల్పకళా ప్రావీణ్యానికి మచ్చుతునక. సప్తఫణి నాగేంద్రునితో నాగలింగంగా పేరొందిన ఈ రాతిశిల్పం స్వచ్ఛమైన శిల్పకళకు ప్రతీక. ఇది

15 అడుగుల ఎత్తుగల శిల్పం. నంది విగ్రహంకంటె ఈ సప్తఫణి నాగేంద్రుని విగ్రహం ఎంతో లాలిత్యంతో హుందాగా ఉంది. అయితే వృషభం త్రాచుపాములు తమ ప్రత్యేక, ప్రధాన ఆకారాలను నిలుపుకున్నాయి. నాగుపాము చుట్టలు, ఎంతో మృదువుగా సహజంగా కనిపించినప్పటికీ భీకరంగా కనిపించే నాగుపాము, సాధువుగా కనిపించే నంది మానవాతీత శక్తులకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి.

ప్రజ్ఞావంతమైన మరొక శిల్పకళాసృష్టి విఘ్నేశ్వర విగ్రహం. ఆయన వాహనం మూషికం సైతం ఎంతో అందంగా భీకరంగా మలచబడింది. సాధారణంగా ఉల్లాసంగా కనిపించే ఈ ఏనుగుతల వినాయకుడు ఈ విగ్రహంలో కుద్ధుడై ఉన్నట్లు కనిపిస్తాడు. ఆయన ఆగ్రహానికి కారకుడు చంద్రుడు. తన కార రూపాన్ని వెక్కిరించిన చంద్రుణ్ణి ఈ శివకుమారుడు తన దంతంతో మాదడానికి ఉద్యుక్తుడైనట్లు ఈ శిల్పం చెక్కారు.

లేపాక్షిలో మరొక అపురూపమూ, నమ్మలేనటువంటి గొప్ప శిల్ప వైచిత్రి ఒకటి ఉంది. అది చాలాకాలంగా పండిత పామరుల జ్ఞానశక్తికి అగ్నిపరీక్షగా నిలబడింది. అదే ' అంతరిక్ష స్తంభం ' కొద్దిగా వంగి నిలబడిన ' పీసా ' స్తంభం వంటిదే అది. రంగమండపం కప్పునుంచి వేలాడుతున్న ఏక శిలాస్తంభం. కొన్ని శతాబ్దాలుగా అది అదేవిధంగా వేలాడుతోంది. ఒక బ్రిటిష్ ఇంజనీరు తన కుతూహలాన్ని చంపుకోలేకనో లేక దుర్బుద్ధితోనో దానిని తీవ్రంగా సుత్తితో బాదారు. అందువల్ల అది కొంచెం వంగినట్లు కనిపిస్తున్నప్పటికీ ఇప్పటికీ నేలను తాకకుండానే వేలాడుతోంది.

మూడు దేవాలయాలు ఒకే గుడిలో ఉండడం లేపాక్షి విశిష్టత. ప్రధాన దేవాలయం వీరభద్రస్వామికి చెందింది. దక్షప్రజాపతి విధ్వంసానికి పరమశివుడు తన జటాజూటం నుంచి సృష్టించిన శక్తివీరుడే వీరభద్రుడు. ఇతర

దేవాలయాలలో ప్రతిష్టించబడినవారు శివాంశగల పాపనాశేశ్వరుడు, మ:
అంశగల రంగనాథుడు. అంతేకాకుండా అపురూపంగా మలచబడిన
పెద్దదిగా ఉండే దుర్గా విగ్రహం ఉంది. చిన్నపిల్లలు ఈ విగ్రహం
భయపడతారు. ఈ దేవి విశ్వరూపాన్ని మరెక్కడా ఇక్కడ మలి:
ఎవరూ రూపొందించలేదనే చెప్పవచ్చు.

లేపాక్షి దేవాలయంలో ఒక్క అంగుళం నేలకూడా వెలితిగా కనిపిం
సర్వత్రా శిల్పాలు, చిత్రాలు సృష్టించబడ్డాయి.

### అభ్యాసవేదిక

*1.* **అర్థాలు :**

ఆప్తమిత్రుడు = దగ్గరిస్నేహితుడు; సర్వత్రా = అన్నిచోట్లా; ధ్వం:
నాశనం; మలచు = చెక్కు; ప్రధానం = ముఖ్యం; ప్రతీక = గుర్తు.

*2.* **కింది పదాలకు అదే అర్థం ఇచ్చే మరో రెండు పదాలు రాయండి :**

నమూనా : – ధ్వంసం – విధ్వంసం, నాశనం

1. విగ్రహం = (1) (2)
2. బొమ్మ = (1) (2)
3. తాకు = (1) (2)
4. ప్రతిష్టించు = (1) (2)
5. ప్రజాపతి = (1) (2)

. పాఠాన్ని చదివి కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :

1. ధైర్యం ×
2. కష్టం ×
3. వికర్షణ ×
4. సమానం ×
5. సాధారణం ×
6. అప్రధానం ×

4. కింది పదానికి ముందు అక్షరాలు చేర్చి అర్థవంతమైన కొన్ని పదాలు రాసి వాటి అర్థాలు రాయండి :

గ్రహం నమూనా :- అనుగ్రహం (= దయ)

5. కింద ఇచ్చిన పదాలను స్వంత వాక్యాలలో ప్రయోగించండి :

1. నిప్పులు చెరుగు
2. కనులారా చూచు
3. సాక్షాత్కరించు
4. ప్రాతినిధ్యం వహించు
5. మచ్చుతునక

6. కింది ప్రశ్నలకు జవాబు రాయండి :

1. వీరభద్ర దేవాలయం నిర్మించిందెవరు ? వారు ఎందుకు భయపడ్డారు ?
2. లేపాక్షి ఎక్కడ ఉంది ? అక్కడికి ఎట్లా చేరుకోవచ్చు ?
3. బసవయ్య విగ్రహం ఎట్లా ఉంటుందో వివరించండి ?
4. లేపాక్షిలో ఉన్న వినాయకుడెలా కనిపిస్తాడు ?
5. అంతరిక్ష స్తంభం అంటే ఏమిటి ? దాని ప్రత్యేకత తెలపండి.

7. కింది వాక్యాలలోని ఖాళీలను సరయిన పదాలతో పూరించండి :

1. రాయలవారు __________ వేస్తారనీ భయపడ్డారు.
2. హిందూపురానికి సుమారు __________ దూరం.
3. దీనినే __________ అని పిలుస్తారు.
4. __________ __________ __________ దేవాలయాలలో నంది విగ్రహాలకంటె ఈ బసవయ్య విగ్రహం పెద్దది.
5. ఇది __________ ఎత్తుగల శిల్పం.
6. ఆయన __________ కారకుడు చంద్రుడు.
7. __________ కప్పునుంచి వేలాడుతున్న ఏకశిలా స్తంభం.
8. ఇప్పటికీ __________ తాకకుండానే వేలాడుతోంది.
9. చిన్నపిల్లలు ఈ విగ్రహం చూస్తే __________
10. ఒక్క అంగుళంలో నేల కూడా __________ కనిపించదు.

8. కింది చట్రం ఆధారంగా వీలయినన్ని సరయిన వాక్యాలను రాయండి :

| | | |
|---|---|---|
| నువ్వు ఎక్కడికి వెళ్తున్నావు ?<br>వాడు ఎక్కడికి వెళ్తున్నాడు ?<br>సీత రేపు వెళ్తుందా ?<br>ప్రసాద్ రేపు వెళ్తాడా ?<br>సమీర నిన్న వెళ్ళిందా ?<br>వాచస్పతి మొన్న వెళ్లాడా ? | రాజు | అడుగుతున్నాడు<br>అడిగాడు<br>అడుగుతాడు |

నమూనా :- సీత రేపు వెళ్తుందా ? అని రాజు అడిగాడు.

9. *(a)* విద్యార్థులకు సూచనలు :

స్థానికంగా ఉండే దేవాలయాల గురించి, చారిత్రక కట్టడాల గురించి తెలుసుకున్నవి వివరించాలి. విహారయాత్రగా ఆ ప్రదేశానికి తీసుకుపొమ్మని ఉపాధ్యాయులను కోరండి.

*(b)* ఉపాధ్యాయులకు సూచనలు :

ఆంధ్రప్రదేశ్ పటం చూపుతూ, ప్రసిద్ధిపొందిన చారిత్రక స్థలాలను, దేవాలయాలను వివరించాలి. ఆ ప్రదేశాలను విద్యార్థులచేత మ్యాప్‌మీద చూపించే అభ్యాసం చేయించాలి.

—o—

వినేదానికన్నా చూసేదే మిన్న

# 8. పల్లెలో మార్పు

[ మన పల్లెలలో ఇటీవలి కాలంలో ఎన్నెన్నో మార్పులు వచ్చాయి, వస్తున్నాయి. వృత్తులు నశించిపోయాయి. పట్టణాలకు వలసలు పెరిగాయి. పల్లెలలో అభివృద్ధి జరిగింది. ఈ మార్పులను గురించి ఈ వ్యాసం వివరిస్తుంది.]

**పాఠంలో ముఖ్యమైన పదాలు :**

| | | |
|---|---|---|
| పరుగులుతీయు | కేరింతలుకొట్టు | రద్దీ |
| నీటిపారుదల | పరివర్తన | కుదించుకుపోవు |
| దెబ్బతిను | జప్తు | రొద |
| పరిశ్రమ | బందెల దొడ్డి | అడపాదడపా |
| కుదిరిపోవు | వివాదం | మొదలుపెట్టు |
| సామాన్లు | మంత్రాంగం | |

* * *

నగరంలో ఉన్నప్పుడు నాకు పల్లెటూరు పోయి ఉండాలి అని అనిపిస్తుంది. కాని ఊరి పరిస్థితులు మారిపోయాయిప్పుడు. అక్కడా వెళ్ళి పట్టుమని పదిరోజులుండలేను.

ఎందుకంటే పల్లె పట్టణంవైపు పరుగుతీస్తున్నట్లనిపిస్తుంది. ఇదివరకే వెలిసిన కాఫీ హోటళ్ళున్నా వాటిలో ఇదివరకు గ్రామఫోన్ రికార్డులు వినిపించేవి. తరువాత వాటిస్థానే రేడియోలు వచ్చాయి. ఇప్పుడయితే టేప్‌రికార్డరు పాటలు వినిపిస్తున్నాయి. కిళ్ళీకొట్లు, సోడాదుకాణాలు, బస్సులసందడీ, వీడియో సినిమాలు వీటన్నింటితో కొత్తసందడి సంతరించుకొంది.

వర్షాలు సరిగ్గా కురవక, నీటిపారుదల సౌకర్యంలేక వ్యవసాయం దెబ్బతినడంవల్ల చిన్న రైతులూ, కూలీలు పట్టణాలకూ, నగరాలకీ బయలుదేరారు. ఎక్కువమంది పరిశ్రమల్లో ఇంకా ఇతరచోట్ల చిన్న ఉద్యోగాలకు కుదిరిపోయారు. అట్లాగే కమ్మరీ, కుమ్మరీ, కంచరీ, వడ్రంగంవారు పల్లె వదిలి ఎక్కువ సంపాదించుకొనే ఆశతో నగరం చేరారు. వారూ వీరూ ఒకరేమిటి ఇప్పుడందరి దృష్టి నగరం మీదే ఉంది. 'నీకేం కావాలి' అని అడిగి సేవచేసే పల్లెధోరణి కూడా 'నాకేమిస్తావు ?' అనే తీరుకు మారింది. కుటుంబంలాగా సాగే పల్లె సంతయింది. సంత అంటే గుర్తొచ్చింది. సంతకు మా ఊరే చెప్పుకోవాలి. వారం వారం జరిగే సంత పెద్ద తిరునాళ్ళలా ఉండేది. దూరగ్రామాలనుంచి ఎందరో వ్యాపారులు సామాన్లతో వచ్చి సంతమైదానంలో దుకాణాలు పెట్టేవారు. చుట్టుపక్కల రైతులు గంపలతో కూరగాయలు తెచ్చేవారు. తినుబండారాలు, ఆటబొమ్మలు, రబ్బరుబుడగలు అమ్మేకొట్లు ఎక్కువగా ఉండేవి. పిల్లలు అక్కడచేరి ఉత్సాహంతో కేరింతలు కొట్టేవాళ్ళు. వారానికి సరిపడా కూరలు అక్కడే కొనేవారు. పశువులనూ అక్కడే అమ్మకం చేసేవారు. అక్కడక్కడా కనిపించే రక్షకభటులు శాంతిభద్రతలు కాపాడేవారు.



అప్పటికీ ఇప్పటికీ మారనిది బడిస్థలం. అయితే ఆ బడి ఇదివరకు పాకలో ఉండేది. ఇప్పుడు దానిస్థానంలో కొత్తభవనం వెలిసింది. ఏకోపాధ్యాయ పాఠశాలకు బదులుగా ముగ్గురు ఉపాధ్యాయులూ, ఒక ప్రధానోపాధ్యాయుడూ వచ్చి చేరారు. ఇప్పుడు చదివే పిల్లల సంఖ్యా పెరిగింది.

పల్లె ప్రకృతిలో కాలం ఇట్టే తెలిసిపోతుంది. ఎండా, వెన్నెల, వానా, ఋతువులూ-వీటి పరివర్తన స్పష్టంగా తెలుస్తుంది.

ఇప్పుడు పల్లెకట్టడాల్లో మార్పు వచ్చింది. ఎన్ని ఇళ్ళకో అరుగులు మాయమయ్యాయి. చుట్టుగోడలు వెలిశాయి. ఇదివరకయితే ఇళ్ళకు వీథి అరుగులుండేవి. పెద్దవాళ్ళ ఇళ్ళకు మరీ పెద్ద అరుగులుండేవి. ఈ వీథి అరుగు పలికే స్వాగతానికి కొందరు సేద తీరేవారు. మరి కొందరు ఆశ్రయం పొందేవారు. ఇంకా కొందరు వచ్చినప్పుడు కచేరీలు జరిగేవి — ముఖ్యంగా కరణంగారి అరుగుమీద అన్నిరకాల సమస్యలు పరిష్కారం అయ్యేవి. కిస్తీ చెల్లింపులు, జప్తులు, బందెలదొడ్లూ, చేలగట్ల వివాదాలు, తాసిల్దార అన్యాయాలూ, ఎన్నికలూ ఇలా ఎన్నెన్నో చర్చలకు వచ్చేవి. నిర్ణయాలూ తీర్పులూ, మంత్రాంగం అన్నీ అక్కడే జరిగేవి. ఇప్పుడా అరుగులకు అంత సందడి లేదు. బోసిపోతున్నాయి.

పల్లెకు సందెవేళ వెలుగురావడంతో, మొదట్లో రేడియోలు, ఆ తరువాత అక్కడక్కడా వెలిసిన టీ.వీ.ల ముందు ఎక్కువయి పంతులుగారి అరుగుమీద రద్దీ తక్కువయిపోయింది.

ఈ మధ్య వీథులను వెడల్పు చెయ్యడంలో అరుగులు కొన్ని కుదించుకుపోయాయి. ఆ వెనువెంటనే పట్టణం రొదను గుర్తుచేస్తూ బస్సులు అడపాదడపా తిరగడం మొదలుపెట్టాయి.

**అభ్యాసవేదిక**

*1.* **అర్థాలు :**

సందడి = చప్పుడు; తిరునాళ్ళు = జాతర; బుడగ = బూర; సేదతీరు = అలసట తీరు; కొట్లు = దుకాణాలు, అంగళ్లు; దురంతాలు = ఆగడాలు.

*2. కింద ఇచ్చిన పర్యాయపదాలను చదివి పాఠంలో వచ్చిన పదాన్ని గీతగీసి గుర్తించండి :*

విధం, విధానం, తీరు, పద్ధతి, రకం.
ఆసక్తి, ఉత్సాహం, సంతోషం, ఆనందం.
కమతగాడు, సేద్యగాడు, కర్షకుడు, రైతు, కృషీవలుడు.
ఉత్సవం, తీర్థం, తిరునాళ్ళు, పండగ, కొలువు, జాతర.

*3. పాఠాన్ని చదివి కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :*

1. పాత ×
2. నిరాశ్రయం ×
3. పెద్ద ×
4. దగ్గర ×

*4. కింద ఇచ్చినవాటిని స్వంత వాక్యాలలో ఉపయోగించి రాయండి :*

1. దెబ్బతిను
2. కేరింతలు కొట్టు
3. అమ్మకంచేయు
4. కుదించుకుపోవు

*5. కింది ప్రశ్నలకు జవాబు రాయండి :*

1. పల్లెలో కనిపించే కొత్తపోకడలేమిటి ?
2. పల్లెనుంచి నగరానికి అందరూ ఎందుకు తరలిపోతున్నారు ?
3. సంతలో ఏం జరుగుతుంది ?
4. కరణంగారి అరుగుమీద ఏం జరుగుతుంటాయి ?
5. పంతులుగారి అరుగుమీద రద్దీ ఎందుకు తక్కువయింది ?

*6. కింది వాక్యాలలోని ఖాళీలను సరయిన పదాలతో పూరించండి :*

1. ఎక్కువమంది __________ ఇంకా ఇతరచోట్ల చిన్న ఉద్యోగాలకు కుదిరిపోయారు.

2. రక్షకభటులు __________ కాపాడేవారు.
3. ఇప్పుడా అరుగులకు అంత __________ లేదు.
4. కరణంగారి అరుగుమీద __________ పరిష్కారం అయ్యేవి.
5. __________ అడపాదడపా తిరగడం మొదలుపెట్టాయి.

*7.* **ఎటునుంచి చదివినా ఒకే అర్థం వచ్చే మూడక్షరాల పదాలను వీలయినన్ని రాయండి :**

నమూనా :- కలక

*8.* **కింది చిత్రం ఆధారంగా వీలయినన్ని సరయిన వాక్యాలు రాయండి :**

| | | |
|---|---|---|
| ఉష ఉత్తరం రాయాలనుకుంటున్నది. | | కలం లేదు. |
| శ్రీధర్ చేపలు పట్టాలనుకుంటున్నాడు. | కానీ | వలలేదు. |
| అర్మిలి బొమ్మలు గీయాలనుకుంటున్నది. | | పెన్సిలు లేదు. |
| శ్రావణ్ చొక్కా కుట్టాలనుకుంటాడు. | | సూదిలేదు. |

నమూనా :- ఉష ఉత్తరం రాయాలనుకుంటున్నది కానీ కలం లేదు.

*9.* **ఉపాధ్యాయులకు సూచనలు :**

స్థానికంగా జరిగే సంతలు వివరించాలి. ఇటీవలి కాలంలో వారి పల్లెల్లో, నగరాల్లో వచ్చిన మార్పును వివరించాలి. వృత్తులెలా అంతరించిపోతున్నాయో తెలపాలి.

—o—

**వేళ్ళనుగానీ ఏవైనా వస్తువులనుగానీ ముక్కులోను, చెవులలోను పెట్టుకోకూడదు**

# 9. ప్రాథమిక ఆరోగ్య కేంద్రం

[గ్రామప్రాంతాల్లో వైద్యసేవలు అందించడానికి ప్రభుత్వం ఏర్పాటుచేసిన వైద్యకేంద్రం ప్రాథమిక ఆరోగ్యకేంద్రం. ఇక్కడ లభించే సదుపాయాలను ఈ వ్యాసంలో వివరించాం.]

**పాఠంలో ముఖ్యమైన పదాలు :**

మౌలిక
వ్యవస్థ
ఉపరి సౌకర్యం
ప్రణాళిక
కనీస విభాగం
పరిధి
గణాంకాలు
ఆరోగ్యసేవలు
సాముదాయిక అభివృద్ధి
కార్యక్రమం
ఆరోగ్య భద్రతా వ్యవస్థ
నివారణోపాయాలు

గిరిజనులు
పర్యవేక్షణ
ఉపకేంద్రం
సాముదాయిక
అంత్యస్థానం
సంప్రదింపు
ఆరోగ్యసేవిక
వ్యాధి నిరోధక సేవ
ప్రజాసంక్షేమం
కుటుంబ నియంత్రణ
జాతీయ కార్యక్రమాలు

శస్త్రచికిత్స
ప్రయోగశాల
ప్రసూతి
గడ్డుసమస్య
క్లిష్టం
సదుపాయం
కల్పవృక్షం
ప్రాథమిక
ఆరోగ్యకేంద్రాలు
సామూహిక
ప్రయోజనం
వైద్యసంప్రదింపులు
ప్రపంచ ఆరోగ్యసంస్థ

* * *

గ్రామప్రాంతాల్లో మౌలిక ఆరోగ్యావసరాలను తీర్చే వైద్యకేంద్రాలను ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు అని అంటారు. మన జాతి ఆరోగ్య వ్యవస్థలో ఇవి కీలక పాత్ర వహిస్తాయి. గ్రామవాసుల ఆరోగ్యాన్ని, సంక్షేమాన్ని గమనించడానికి ఉపరిసౌకర్యాలు కలిగిఉంటాయి. వ్యాధి నిరోధకసేవలకు, చికిత్స చేయడానికి

పరిమితమయిన ప్రాంతంలో ఆరోగ్యసేవలు ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు అందిస్తుంటాయి. ఆరోగ్య ప్రణాళికావేత్తలు వీటిని కనీస విభాగాలుగా భావిస్తారు.



సాముదాయిక అభివృద్ధి కార్యక్రమంలో భాగంగా 1952లో దేశంలో ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలను ప్రారంభించారు. ప్రతి సాముదాయిక అభివృద్ధి బ్లాక్ కేంద్రంలో ప్రాథమిక ఆరోగ్యకేంద్రాన్ని స్థాపించారు. అక్కడ ఉండే వంద గ్రామాలలోని 80 వేల నుంచి లక్ష జనాభాకు ఈ కేంద్రాలు పనిచేసేవి. ప్రస్తుతం జనాభా పరిధిని తగ్గించి గిరిజన ప్రాంతాల్లో 20 వేలకు, ఇతర ప్రాంతాల్లో 30 వేలకు ఒక కేంద్రాన్ని స్థాపిస్తున్నారు.

గ్రామప్రజలకు ఆరోగ్యసేవలను దగ్గరగా తీసుకెళ్ళే ఉద్దేశంతో ఈ కేంద్రాల పర్యవేక్షణలో కొన్ని ఉపకేంద్రాలు నెలకొల్పారు. లోగడ ప్రతి పదివేల జనాభాకు ఒక ఉపకేంద్రం ఉండేది. ప్రస్తుతం మూడువేల జనాభా ఉన్న గిరిజన ప్రాంతాల్లోనూ, అయిదువేల జనాభా ఉన్న ఇతర ప్రాంతాలలోనూ సాముదాయిక అభివృద్ధి బ్లాక్‌లో అనువైన చోట్ల ఈ ఉపకేంద్రాలు

నెలకొల్పుతున్నారు. ఆరోగ్య భద్రతా వ్యవస్థను దేశంలో విస్తరించడంలో ఉపకేంద్రాలు అంత్యస్థానాలు.

ఈనాటికి దేశంలో 19,640 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, 1,21,874 ఉపకేంద్రాలున్నాయి. ఇవికాక 1666 సాముదాయిక కేంద్రాలున్నాయి. క్రీ.శ. 2000 నాటికి లక్ష కేంద్రాలు స్థాపించాలని ఆరోగ్యశాఖ ముఖ్యాశయం.

ప్రతి ప్రాథమిక కేంద్రంలోను ఒక బహిరంగ చికిత్సాలయం, వైద్య సంప్రదింపులకు ఒక గది ఉంటుంది. కుటుంబ నియంత్రణ సేవలకు, మాతా శిశు సంక్షేమ సేవలకు వసతులుంటాయి. చిన్న తరహా శస్త్ర చికిత్సలకు సదుపాయం, చిన్న ప్రయోగశాలలు, ఆరుపడకలు ఉంటాయి. ఇందులో నాలుగు పడకలను ప్రసూతి సేవలకు కేటాయిస్తారు. అయితే గడ్డు సమస్యలున్నవారి విషయంలో, క్లిష్టమైన పరిస్థితిలో ఉన్నవారి విషయంలో వైద్య, శస్త్ర చికిత్స సేవలను, స్త్రీలకు వచ్చే రోగాలకు చికిత్స చేయడానికి, ప్రసూతిసేవలు అందించడానికి ప్రాథమిక ఆరోగ్యకేంద్రంలో సదుపాయాలుండవు. వారిని ఆ ప్రాంతంలో దగ్గరగా ఉండే మండల వైద్యశాలలకుగానీ, జిల్లా వైద్యశాలలకుగానీ పంపిస్తారు. అక్కడయితే ఎక్స్‌రే సౌకర్యాలు, చికిత్సాలయం, ప్రయోగశాలతోపాటు ప్రత్యేక వైద్యసేవలు అందుబాటులో ఉంటాయి.

ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు ప్రజాసంక్షేమం నిమిత్తం ఎన్నో సామూహిక ప్రయోజనాలను నెరవేరుస్తుంది. వైద్యభద్రతతోపాటు స్త్రీల, శిశువుల సంక్షేమాన్ని గమనిస్తూ, కుటుంబ నియంత్రణ కార్యక్రమాలను ప్రోత్సహిస్తాయి. అంతేకాకుండా పాఠశాలల్లో విద్యార్థుల ఆరోగ్యాన్ని శ్రద్ధతో గమనిస్తాయి. ఆరోగ్య బృందాలు అప్పుడప్పుడూ పాఠశాలలను ఎంచుకొని వారి ఆరోగ్యాన్ని

పరిశీలించి తగిన సలహాలిస్తాయి. మలమూత్రాదులవంటి వ్యర్థపదార్థాలను ఊరవతల వదిలే విధానాలను ప్రోత్సహించి, రక్షిత నీటి సరఫరా పథకాలను అమలు చేసేట్లు చూసి పరిసరాలను, పరిశుభ్రతను మెరుగుపరుస్తాయి.

అంటురోగాల వ్యాప్తిని అరికట్టడం ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల మరో కర్తవ్యం. వాటిని వ్యాప్తి చెందనీయకుండా తరచూ టీకామందును ప్రజలకు అందుబాటులో ఉంచుతారు. పరిశుభ్రతను, నివారణోపాయాలను తెలుపుతూ ప్రజలను అప్రమత్తులుగా చేస్తారు. ఈ కేంద్రం పనిచేసే ప్రాంతంలో జనాభా గణాంకాలను సేకరించి ఆరోగ్యవిద్యను బోధించడం, ఎప్పటికప్పుడు సందర్భానికి తగినట్టుగా జాతీయారోగ్య కార్యక్రమాలు అమలుపరచడం వీరి కర్తవ్యంలో భాగమే. ఇదేకాక జిల్లా వైద్యకేంద్రాలు అప్పుడప్పుడూ నిర్దేశించిన ఇతర సేవలను సమర్థవంతంగా నిర్వహిస్తాయి.

ఈ కేంద్రాల స్థాపన తొలిదశలో చాలా తక్కువమంది ఉద్యోగులుండేవారు. వారికి ఆర్థిక వనరులు చాలా తక్కువగా అందుబాటులో ఉండేవి. వైద్యచికిత్సకు సరిపడిన ఉద్యోగులు ఉండేవారు కాదు. క్రమేపీ ఉద్యోగుల పద్ధతిని మార్చి ఎన్నో మార్పులు చేసి కుటుంబ నియంత్రణ వంటి జాతీయ కార్యక్రమాలను ఈ కేంద్రం నిర్వహించాల్సిన విధులలో భాగంగా చేశారు. తరువాత స్త్రీ పురుష-ఆరోగ్యసేవికలను, సహాయకులను నియమించారు.

ప్రస్తుతం ప్రతి కేంద్రంలో 11 మంది ఉద్యోగులు పనిచేస్తున్నారు. వీరిలో ఇద్దరు వైద్యాధికారులు, కుటుంబ నియంత్రణకు విస్తరణాధికారి, ఇద్దరు ఆరోగ్య సహాయకులు, పరిశుభ్రతను గమనించే అధికారి, ఒక మంత్రసాని, ఇద్దరు బంట్రోతులు, ఒక డ్రైవరు ఉంటారు.

ప్రపంచ ఆరోగ్యసంస్థ సాముదాయిక ఆరోగ్యాన్ని, వైద్యాన్ని, పాలనాసూత్రాలను నిర్వచించింది. వీటిని సమర్థవంతంగా అమలు చేస్తున్నాయి. ప్రజల సేవలో నిమగ్నమయిన ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు సాముదాయిక దృక్పథానికి ప్రతీక. గ్రామవాసుల ఆరోగ్య సమస్యల పరిష్కారానికి కల్పవృక్షం.

## అభ్యాసవేదిక

1. అర్థాలు :

   కీలకపాత్ర = ముఖ్యమైన పాత్ర; నిర్దేశించు = సూచించు; సంక్షేమం = బాగోగులు; నియంత్రణ = అదుపుచేయు; నిర్వర్తించు = అమలుచేయు; పరిశుభ్రత = శుచిగా ఉండటం.

2. కింద ఇచ్చిన పర్యాయపదాలను చదివి పాఠంలో వచ్చిన పదాన్ని కింద గీతగీసి గుర్తించండి :

   శక్తి, నైపుణ్యం, సామర్థ్యం, తెలివితేటలు.

   ఆలోచన, ఆశయం, లక్ష్యం, దృక్పథం.

   చెట్టు, తరువు, భూమిజం, వృక్షం.

   చిహ్నం, గుర్తు, ప్రతీక, సంకేతం.

3. పాఠం చదివి కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :

   1. అంతరంగ ×
   2. వెలుపల ×
   3. వ్యాప్తిచెందు ×
   4. తొలగించు ×

4. కింద ఇచ్చిన పదాలకు వేర్వేరు అర్థాలను గమనించండి :

   సూత్రం - నియమం, దారం, కట్టుబాటు, ఏర్పాటు

సేవ - ఉద్యోగం, పూజ, పని

భద్రత - క్షేమం, శుభం, బంగారం

5. కింద ఇచ్చిన పదాలను స్వంతవాక్యాల్లో ఉపయోగించి రాయండి :

1. నెలకొల్పు
2. ప్రోత్సహించు
3. మెరుగుపరచు
4. నిర్వచించు

6. కింది ప్రశ్నలకు జవాబు రాయండి :

1. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను మొదట ఎప్పుడు స్థాపించారు ?
2. ఆ కేంద్రాలలో ఏం సౌకర్యాలుంటాయి ?
3. ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు ఎటువంటి సామూహిక ప్రయోజనాలు నెరవేరుస్తాయి ?
4. ఈ కేంద్రాలలో ఉండే ఉద్యోగుల సంఖ్య ఎంత ? వారెవరో వివరించండి.
5. గడ్డుకేసులు తటస్థించినప్పుడు ఏంచేస్తారు ?

7. కింది వాక్యాలలోని ఖాళీలను సరయిన పదాలతో పూరించండి :

1. ఆరోగ్యావసరాలను తీర్చే వైద్యకేంద్రాలను __________ అని అంటారు.
2. లోగడ ప్రతి పదివేల జనాభాకు ఒక __________ ఉండేది.
3. క్రీ. శ. 2000 నాటికి __________ స్థాపించాలని ఆరోగ్యశాఖ ముఖ్యాశయం.
4. పాఠశాలల్లో __________ ఆరోగ్యాన్ని శ్రద్ధతో గమనిస్తాయి.
5. __________ వ్యాప్తిని అరికట్టడం ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల మరో కర్తవ్యం.
6. గ్రామవాసుల పరిష్కారానికి కల్పవృక్షం.

8. కింది చిత్రం ఆధారంగా వీలయినన్ని సరయిన వాక్యాలు రాయండి :

| | |
|---|---|
| రవి అన్నం తింటూ | కవిత్వం రాస్తున్నది. |
| జలజ పాటపాడుతూ | నవల చదువుతున్నాడు. |
| వంశీ బడికి వెళ్తూ | నాట్యం చేస్తోంది. |
| వందన రేడియో వింటూ | కవితతో మాట్లాడుతున్నాడు. |

నమూనా :- జలజ పాటపాడుతూ నాట్యం చేస్తోంది.

9. ఉపాధ్యాయులకు సూచనలు :
స్థానికంగా ఉండే ప్రాథమిక ఆరోగ్య కేంద్రం గురించి వివరించాలి. పాఠశాలలను వారు దర్శించే వివరాలు తెలపాలి.

—0—

ఇంటికి బడికి చుట్టుపక్కల మురికినీటి గుంటలు ఉండకుండా చూడండి

# 10. మన పరిసరాల రక్షణ

[మన జీవితంతో పెనవేసుకున్న చెట్లు చేమలను, అడవులను, చెరువులను కాపాడుకోవలసిన అవసరాన్ని ఈ వ్యాసం వివరిస్తుంది. జీవరాసుల జీవనానికి పరిసరాల రక్షణ అవసరం అని మనం తెలుసుకుంటాం.]

**పాఠంలో ముఖ్యమైన పదాలు :**

భూగ్రహం
జీవరాసులు
తక్షణం
పరిగణించు
నిర్మూలన
నాణ్యత
పెంపొందించు
నివాస ప్రాంతం
ఉద్యమం
శూన్యం
జీవనవిధానం

పరిరక్షణ
సాంస్కృతిక విద్య
ఆరాధించు
అంతరింపజేయు
ప్రాణికోటి
జీవనాధారం
భౌతికం
నదం
అనుగ్రహం
పుణ్యక్షేత్రం
ఆగ్రహానుగ్రహాలు

తపించు
చేతన
ఇమిడిపోవు
ద్రవం
జీవనకేంద్రం
తటాకం
జీవావరణం
పూడిక
గంగానమ్మ
విశిష్టం
సహజీవన వ్యవస్థ

* * *

ఈ భూగ్రహం మీద జీవరాసుల జీవనానికి యోగ్యకరమైన పర్యావరణ పరిస్థితులు కాపాడాలంటే అడవుల సంరక్షణ, అడవులు పెంచడం మనందరి తక్షణ కర్తవ్యం. ప్రస్తుత పరిస్థితిలోవలె మనిషి అడవులను తనకు పనికివచ్చే ఏదో ఒక వస్తువును పరిగణించే దృక్పథాన్ని విడనాడాలి. చెట్లను జీవనాన్ని ప్రసాదించే సృష్టిదేవతలుగా పరిగణించి చెట్లపై భక్తి భావం పెంచుకోవాలి.

మానవుడు సాధ్యమైనంతవరకూ అటవీ నిర్మూలనావసరాలను తగ్గించుకోవాలి. మనందరం కూడా చెట్లు అడవులు మనజీవన విధానంలో ఒక తప్పనిసరి భాగం అని గుర్తించాలి. సమాజంలోని వ్యక్తులు జీవనస్థాయి లెక్కించేప్పుడు కేవలం మనకు అందుబాటులో ఉండి మనమనుభవించగల వస్తువులను మాత్రమే కాకుండా మనకు ఆరోగ్యకర వాతావరణాన్ని అందించే చెట్లు, అడవుల వంటి ప్రకృతి నాణ్యతను కూడా దృష్టిలో తీసుకోవాలి. కేవలం మనం మన అత్యవసర అవసరాలకు మాత్రమే అడవులను నరకాలి. అంతేకాకుండా మనం నరుకుతున్న అడవులను ప్రకృతి తిరిగి పెంపొందించుకోగలిగే పరిస్థితులను కూడా కల్పించవలసిన బాధ్యత మనపై ఉన్నదనే విషయం గుర్తించాలి.



మన జీవనవిధానంలో ఇటువంటి దృక్పథం చోటుచేసుకున్నప్పుడే మనం అడవులను మన పర్యావరణాన్ని కాపాడుకోగలుగుతాం. తరిగిపోతున్న అడవులను కాపాడుకోవడంలో మన నివాస ప్రాంతాలలో పచ్చనిచెట్లు పెంచడంలో ప్రజలు ఎంతో విశిష్టమైన పాత్ర వహించాల్సి ఉంటుంది. అడవుల, చెట్ల పెంపకం ఒక ప్రజాఉద్యమంగా చేపట్టినప్పుడే మనం నష్టపోయిన అడవులను తిరిగి అభివృద్ధి చేయగలం. ఇది మనం సాధించాలనుకొంటున్న స్థిరమైన లేదా నిరంతర అభివృద్ధికి తొలిమెట్టు.

ఈ సందర్భంలో మన పూర్వీకులనాటి నుంచీ జరుపుకొనబడుతున్న వనమహోత్సవం పండుగను గుర్తుచేసుకోవడం చాలా అవసరం. వనమహోత్సవం పండుగనాడు మన పూర్వీకులు ప్రకృతిని ఆస్వాదిస్తూ వనాలలో కలిసి భోజనం చేయడం, వనాల ప్రాముఖ్యత తెలియజేసే, వనాల రక్షణకు సంబంధించిన పాటలు పాడడం, ప్రజలలో అడవుల ప్రాముఖ్యత గురించి అవగాహన ఏర్పర్చడానికి ఎంతో ఉపయోగపడేది. ఈనాడు కొద్దిమంది వేలంవెర్రిగా వనభోజనాలకు వెళ్తున్నప్పటికీ అడవుల ప్రాముఖ్యత గురించి తెలియజేయడంలో ప్రస్తుతం ఈ పండుగ పాత్ర శూన్యం. ఆధునిక నాగరిక జీవనశైలికి దూరంగా ఉన్న కొన్ని గిరిజన జాతులవారు ఈనాటికీ అడవిని తమ తల్లికంటే పవిత్రమైనదిగా ఆరాధించడం, మొక్కులు నాటే కార్యక్రమం చేపట్టడం, అనాగరీకులనబడే గిరిజనులకు అడవుల ప్రాముఖ్యతపై గల అవగాహన గురించి తెలియజేస్తుంది. ప్రకృతి పరిరక్షణ దృష్ట్యా మన పూర్వీకులు రూపొందించిన సాంస్కృతిక విద్యల ప్రాముఖ్యతను గుర్తించి మనం వాటిని అంతరింపచేయకుండా మనజీవన విధానంలో కూడా చిత్తశుద్ధితో ఆదరించడం ంతో అవసరం.

సకల ప్రాణికోటికీ నీరు జీవనాధారం కదా ! సంస్కృతినీ, నాగరికతనీ నీరు, నారు పోసి పెంచుతుంది. నీటిపట్ల ఒక జాతికున్న అనుబంధం ఆ జాతి సంస్కృతిని సూచిస్తుంది. దాహానికీ, వ్యవసాయానికీ భౌతికంగా పనికొచ్చే నీటిని మన సంప్రదాయంలో కేవలం నీరుగా భావించలేదు. నదీనదాలను దేవతల రూపంలో పూజించారు. ఆమె అనుగ్రహం కోసం తపించేవారు. నదులవెంట అనేక పుణ్యక్షేత్రాలు వెలిశాయి. గంగను భూమిమీద తేవడం కోసం భగీరథుడు తపస్సును చేశాడు. అంటే మన చేతనలో నది ఇమిడిపోయింది. భారతీయ నదులకు మరెక్కడా లేని అందమైన పేర్లున్నాయి. అంటే మన హృదయంలో నీరు ఒక పదార్థం లేక ద్రవం కాదు. ఆగ్రహానుగ్రహాలున్న ప్రియమైన దేవత.

గ్రామాలలో, చెరువులు జీవనకేంద్రాలుగా ఉంటూవచ్చాయి. చాలా గ్రామాల్లో ఊరిచెరువు ఆకారాన్ని బట్టి గ్రామం పెరిగేది. పెద్ద పెద్ద వ్యవసాయ తటాకాలు జీవావరణాన్ని కాపాడుతూ గ్రామజీవనంలో సహజీవన వ్యవస్థనీ కల్పించాయి. ఇటీవలి కాలం వరకూ వేసవిలో చెరువును గ్రామస్థులందరూ కలిసి పూడిక తీసేవారు. గంగానమ్మ జాతర వంటి జలదేవతల పండుగలు, తిరునాళ్ళు జరిపేవారు. అందువల్ల నీరు అనేది ఏ ఒక్క వ్యక్తికి చెందిన ఆస్తి అనే భావం ఉండేది కాదు.

## అభ్యాసవేదిక

*1.* **అర్థాలు :**

దృక్పథం = ఆలోచన; నిర్మూలన = తొలగింపు; పర్యావరణం = చుట్టూఉండే పరిసరాలు; ఆస్వాదించు = అనుభవించు; అవగాహన = అర్థం చేసుకోవడ పరిగణించు = లెక్కించు; సహజీవనం = తోడుగా జీవించడం.

2. కింది వాక్యాలను చదివి వాటిలో కిందగీసిన పదాలకు అదే అర్థం వచ్చే వేరేపదంతో వాక్యాన్ని తిరిగి రాయండి :

   1. గ్రామాలలో చెరువులు జీవనకేంద్రాలుగా ఉంటూవచ్చాయి.
   2. సకల ప్రాణికోటికి నీరు జీవనాధారం.
   3. మానవుడు సాధ్యమైనంతవరకూ అటవీనిర్మూలనావసరాలను తగ్గించుకోవాలి.
   4. చెట్లపై భక్తిభావం పెంపొందించుకోవాలి.
   5. అత్యవసర అవసరాలకు మాత్రమే అడవులను నరకాలి.

3. పాఠాన్ని చదివి కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :

   1. చేపట్టు ×
   2. నవీనులు ×
   3. అనుగ్రహం ×
   4. అస్థిరం ×
   5. నాగరికులు ×

4. కింద ఇచ్చినవాటిని స్వంత వాక్యాల్లో ఉపయోగించి రాయండి :

   1. ఇమిడిపోవు
   2. ఆస్వాదించు
   3. పెంపొందించు
   4. అంతరింపజేయు
   5. తోపించు

5. కింది ప్రశ్నలకు జవాబు రాయండి :

   1. మన ఆరోగ్యానికి ప్రకృతిలో అవసరమయినవి ఏమిటి ?
   2. అడవులను ఏ విధంగా వృద్ధిచేయగలం ?
   3. వనమహోత్సవం అంటే ఏమిటి ? పూర్వీకులు ఏవిధంగా చేసేవారు ?

4. ప్రాణికోటికి జీవనాధారం ఏది ? అక్కడ ఏం వెలిశాయి ?
5. గ్రామజీవన కేంద్రాలు ఏవి ?

6. కింది వాక్యాలలోని ఖాళీలను సరయిన పదాలతో పూరించండి :
   1. మనందరం కూడా ________ అడవులు మన జీవన విధానంలో ఒక తప్పనిసరి భాగం అని గుర్తించాలి.
   2. ________ ప్రాముఖ్యం గురించి అవగాహన ఏర్పర్చటానికి ఎంతో ఉపయోగపడేది.
   3. సకల ప్రాణికోటికీ ________ జీవనాధారం కదా !
   4. నదీనదాలను ________ రూపంలో పూజించారు.
   5. వేసవిలో ________ గ్రామస్థులందరూ కలసి పూడిక తీసేవారు.

7. కింది పదానికి ముందు అక్షరాలు చేర్చి అర్థవంతమైన కొన్ని పదాలు రాసి, వాటి అర్థాలు వివరించండి :

   జ్ఞానం          నమూనా :- విజ్ఞానం

8. కింది చట్రం ఆధారంగా వీలయినన్ని సరయిన వాక్యాలు రాయండి :

| | | | |
|---|---|---|---|
| అతను | బట్టలు వేసుకున్న | తరువాత | బడికి వెళ్తాడు |
| చైతన్య | అన్నంతిన్న | | అన్నంతింటాడు |
| రవి | స్నానంచేసిన | | సినిమా చూస్తాడు |
| | ఆటలుఆడిన | | బట్టలు వేసుకుంటాడు |
| | | | స్నానం చేస్తాడు |

నమూనా :- చైతన్య ఆటలు ఆడిన తర్వాత స్నానం చేస్తాడు.

9. ఉపాధ్యాయులకు సూచనలు :
   1. వనమహోత్సవం ప్రాముఖ్యం వివరించాలి.
   2. స్థానికంగా ఉండే చెరువులపేర్లు, నదులపేర్లు చెప్పించాలి. వాటి పూర్వాపరాలను వివరించాలి. అక్కడ జరిగే జాతరలు, తిరునాళ్ళు వివరించాలి.

## వ్యాకరణం

**కర్త, కర్మ :**

భావాలను తెలిపేందుకు భాషను ప్రయోగిస్తున్నప్పుడు వాక్యాలలో క్రియాపదాలతోపాటు మరికొన్ని పదాలను ప్రయోగిస్తాం. ఈ వాక్యాలను గమనించండి

1. అశోకుడు అహింసను బోధించాడు.
2. పిల్లి ఎలుకను చంపింది.
3. రామయ్య అన్నం తింటున్నాడు.

ఈ వాక్యాల్లో బోధించాడు, చంపింది, తింటున్నాడు అనే క్రియాపదాలున్నాయి. వాక్యాల మొదట్లో ఆ పనులు చేసేవారిని తెలిపే పదాలు అశోకుడు, పిల్లి, రామయ్య అనేవి ఉన్నాయి. ఈ పనిని చేసేవారిని ' కర్త ' అని అంటారు. కర్తను తెలిపే పదాన్ని కర్తృపదం అని గుర్తిస్తారు.

ఈ వాక్యం గమనించండి.

4. ముసలి రామయ్య బండి ఎక్కలేదు.

ఈ వాక్యంలో కర్తృపదం ముందర ' ముసలి ' అని ఉంది. రామయ్య ఎలువంటివాడో తెలుపుతుంది. ఈ పదాన్ని విశేషణం అని పిలుస్తారు. విశేషణంతో కలిసి ఉన్నప్పుడు కర్తృపదాన్ని విశేష్యం అని పిలుస్తారు. విశేష్యం లక్షణాలను తెలిపేదే విశేషణం.

పైన వాక్యాల్లో క్రియాపదం, కర్తృపదంతో పాటుగా మరికొన్ని పదాలున్నాయి. పని ఫలితాన్ని పొందేవారిని ఆ పదాలలో – అహింస, ఎలుక, అన్నం గుర్తించవచ్చు. ఫలితం పొందేవారెవరైనా వారివి కర్మ అంటారు. కర్మను తెలిపే పదాన్ని కర్మపదం అంటారు.

సాధారణంగా వాక్యాలలో చేసే పని (క్రియ), చేసేవాడు (కర్త), పని ఫలితాన్ని పొందేవాడు (కర్మ) ఉంటూంటాయి.

## అభ్యాసం

క్రింది వాక్యాల్లోని కర్త, కర్మ, క్రియలు గుర్తించండి :

1. చలమయ్య చెట్టు నాటాడు.
2. పంతులుగారు జండా ఎగురవేశారు.
3. విద్యార్థులు జాతీయగీతం ఆలపించారు.
4. మేము ఉగాదినాడు ఊరికి వెళ్ళాం.
5. నేను పాటలు పాడతాను.
6. అందరూ మితాహారం భుజించాలి.

—o—

కళ్ళు దురదగా ఉన్నప్పుడు చేతితో రుద్దవద్దు వెంటనే డాక్టరును సంప్రదించాలి

# 11. జానపద కళలు

[పల్లెపట్టుల్లో ఎన్నెన్నో వేడుకలు, వినోదాలు కన్పిస్తాయి. ఇవి మన కళల పెరుగుదలకు ఎంతో తోడ్పడ్డాయి. ఈ వ్యాసంలో అటువంటి కళలను గురించిన పరిచయం ఉంది].

*పాఠంలో ముఖ్యమైన పదాలు*

| | | |
|---|---|---|
| వైభవం | ద్యోతకం | పాత్రోచితం |
| తేటతెల్లంచేయు | పొట్టగడపుకొను | సమయస్ఫూర్తి |
| జీవనాడి | చొప్పకర్ర | సంభ్రమం |
| వెటకారం | ఊరేగు | యాచించు |
| పునరుక్తి | ఆశ్చర్యచకితులు | కసరత్తు |
| తారసపడు | పొట్టపోసుకొను | పదచలనం |
| సారూప్యత | పులకాంకితులు | ఉపకరంబు |
| కళారూపం | బట్టబయలు | స్ఫురించు |
| కాలగర్భం | ప్రాచుర్యం | ప్రబంధ పద్ధతి |
| కులవృత్తి | విశేషపక్క | పాటవం |
| ప్రస్తుతించు | ఒరవడి | ఆనవాయితీ |
| సాధ్యశూరులు | అర్ధనారీశ్వరుడు | అంగరక్షకులు |
| ఆచార వ్యవహారాలు | జానపదకళారూపాలు | దురాచారం |
| దురన్యాయం | పాత్రోచిత సంభాషణ | యక్షగాన కళాకారులు |

* * *

మన ప్రాచీన చరిత్రను, మన సంస్కృతి వైభవాన్ని, మన ఆచార వ్యవహారాలను, మన వేడుకలు, వినోదాలను ఒక్కమాటలో చెప్పాలంటే

మన జీవనయాత్రలో ఎదురయ్యే సమస్త విభిన్న కర్మలను తేటతెల్లం చేసే ఈ జానపదకళలు జాతికి జీవనాడివంటివి.

పట్టణ ప్రజలు సైతం ఆయాకళలను చూసి రంజింపచేసే విధంగా శృతిమించిన వెటకారం, హాస్యం, అసందర్భపు సంభాషణలను పునరుక్తులను తొలగించి ఆయా ప్రక్రియలను సంస్కరించవలసిన అవసరం ఎంతో ఉంది.

తెలుగువారివిగా ముద్రవేయబడిన, వైవిధ్యంగల జానపదకళలు ప్రస్తుతం ఏభై వరకు మనకు మారుమూల పల్లెల్లో తారసపడతాయి. ఇంకో ముప్పై అపురూపకళలు సర్వేలో దొరకకపోవు. సారూప్యతగల కళలను ఒక్కటిగా చేసి, కొత్తవారికీ వాటిలో శిక్షణ ఇచ్చి, మన నైపుణ్యాన్ని ఇతరులకు సైతం ప్రదర్శించవచ్చు.

వాస్తవానికి ఆధునిక నాగరికత బాగా వ్యాపించిన కృష్ణా, గుంటూరు ఇత్యాది చోట్ల అతి ప్రాచీనమైన జానపద కళారూపాలు అప్పుడే కాలగర్భంలో కలిసిపోయాయి. కులవృత్తులమీద, పండుగలమీద ఆధారపడిన కొన్ని కళారూపాలు మాత్రం ఈనాటికీ ఉండీలేనట్టుగా ఉన్నాయి. రాష్ట్రంలోని జిల్లాలన్నింటిలో ఈనాటికీ ఎక్కువ కళారూపాలు కరీంనగర్, వరంగల్ జిల్లాలలో తారసపడతాయి. కొన్నింటిని విశేషకళారూపాలను, సారూప్యత ఉన్నవాటిని దిగువన ప్రస్తుతించడం జరిగింది.

**సాధనాశూరులు – కాటిపాపలు :**

సాధనాశూరుల వృత్తిపేరులోనే వారి నైపుణ్యం ద్యోతకమవుతుంది. వీరు కేవలం పద్మశాలీలను అడుక్కొని పొట్టగడుపుతున్నారు. ఈ వృత్తివారు కేవలం – కరీంనగర్ జిల్లాలోనే సుమారు 40 కుటుంబాల వారున్నారు. వీరు రాళ్ళను చిటికెలో విగ్రహాలు చేయడం, చొప్పకర్రల ఉయ్యాలలో ఊరేగడం,

నీళ్ళలో రంగుపొడులు వేసి తిరిగి పచ్చిదనం లేకుండా ఆయారంగు పొడులను బయటకు తీయడం - ఇత్యాది విద్యలతో జనాన్ని ఆశ్చర్యచకితులను చేస్తారు.

కాటిపాపలు కాటికి కాపరులై బతకాలనే కట్టడి కలవారు. వీరు సన్నని భయంకరమైన కిరీటాలు ధరించి ఒకానొక యాసలో మాట్లాడుతూ తమజోలెలోని అమ్మవారి బొమ్మతీసి దాన్ని తాకుతూ వివిధ వస్తువులను ప్రత్యక్షం చేస్తారు. పాములు, తేళ్ళు, కప్పలు, ఎలుకలు ఇత్యాదులను కూడా వారు ' మహంకాళి శక్తి ' అంటూ తెప్పించి ప్రేక్షకులను పులకాంకితులు చేస్తారు. ఇలాంటి తమాషాలను చేసి పొట్ట పోసుకొనే కళాకారులు పల్లెలలో మరికొన్ని జాతులలో కూడా ఉన్నారు.

**పగటి వేషాలు, బహురూపులు, విప్రవినోదులు :**

సంఘంలోని దురాచారాలను, దురన్యాయాలను, వినోదం రంగరించి బట్టబయలు చేయడం వీటి ప్రధానాశయం. కూచిపూడి భాగవతులు ఈ కళలను ప్రాచుర్యంలోకి తెచ్చారు. తరువాత సున్నం వీరయ్య తమ విశేష ఫక్కీలో ఈ కళకు ప్రత్యేకత తెచ్చారు. వీరు పెట్టిన ఒరవడిలో విభూతి భవానీ లింగం ప్రభృతులు ఇప్పటికీ మందుల వేషం, గొల్లమ్మత్త వేషం, అర్ధనారీశ్వర వేషం, శక్తి వేషం ఇత్యాది 37 వేషాలు రోజుకొకటి చొప్పున తమ సంచారంలో ప్రదర్శించి జీవిస్తున్నారు. వీరికి బంధువులు కర్ణాటక, తమిళనాడు, కేరళ రాష్ట్రాలలో కూడా ఉన్నారట. వీరంతా జంగాలు. తెలంగాణాలో ఈ విద్య ప్రదర్శించేవారిని బహురూపులుగా వ్యవహరిస్తున్నారు. వీరంతా పాత్రోచిత సంభాషణ చెప్పడంలో, సమయస్ఫూర్తిగా వ్యవహరించడంలో నిష్ణాతులు. వీరు చూస్తుండగానే పల్లెలలో తేళ్ళు, పాములు చేసి ఖాళీ చేతిలోంచి డబ్బులు

కురిపించి ప్రేక్షకులను సంభ్రమాశ్చర్యాలతో ముంచెత్తుతారు. బ్రాహ్మణులను యాచించి బతికే విప్రవినోదులు సైతం దాదాపు ఈ విద్యలే ప్రదర్శిస్తారు.

**దొమ్మరి ఆట, గారడీ విద్య, మౌళి :**

దొమ్మరాటలో వివిధరకాల కసరత్తు ప్రదర్శనే కాకుండా ముఖ్యంగా సాని గడ ఎక్కడం దాదాపు పాతిక 30 అడుగుల ఎత్తుగల గడపై గల ఇనుపచువ్వపై బొడ్డుపెట్టి కాళ్ళూచేతులు బార్లాజాపి గిరుగిరున తిరుగుతుంది. ఈ విశేషాంశాన్ని చైనా దొమ్మరులు కూడా ప్రదర్శించలేకపోవడం గమనార్హం.

వీరి విద్యకు కొంచెం అటు, ఇటుగా గడలేకుండా ఇతర విశేషాలను గారడీవాళ్ళు, మౌళీ ఆటగాళ్ళు ప్రదర్శించడం చూస్తున్నాం.

**గురవయ్య నృత్యం :**

ఇవి ఎక్కువగా అనంతపురం జిల్లాలో ఉన్నాయి. ఉరుము అనేది వాద్యవిశేషం. వీరి నియమం ప్రకారం చెప్పులు కూడా తొడుక్కోరు. పవిత్రంగా భావించే ఈ వాద్యాన్ని స్త్రీలు కూడా తాకకుండా జాగ్రత్తపడతారు. విశేషమైన దుస్తులు వేసుకొని పది పన్నెండు రకాల పదచలనాలతో ఈ వాద్యాన్ని ఎంతో మధురంగా వారు వాయిస్తారు. ప్రధానంగా గ్రామాలలో దేవత ఉత్సవాలలో వీరు పాల్గొంటారు.

గురవయ్య నృత్యం టిబెటన్స్ నృత్యాన్ని కళ్ళముందు కడుతుంది. వీరు నృత్యంలో గొంగళి వస్త్రంగా ధరిస్తారు. ఢమరుక చేతబట్టుకొని, నడుముకు గజ్జెలు కట్టుకుంటారు. పిల్లనగ్రోవి ఊదుతూ ఒకానొక విశేషరీతిలో నర్తిస్తారు. వీరి కుటుంబాలలో పదకొండు సంవత్సరాల వయసులోనే గురవయ్యలుగా చేస్తారు. అంటే దేవుడి పేరున విడుస్తారు. వారు ఇంటింటికి దేవుని పేర భిక్షాటన చేస్తారు.

**గంటె భాగవతులు :**

వీధి నాటకాలు ఆడేవారిలో వీరిదొక తరహా. పాతరోజులలో ఆము‹
నూనె దీపాలతో వీరు నాటకాలాడేవారు. ఈ నాటకంలోని ప్రతి ఒక్కరిచేతి‹
ఒక గంటె ఉంటుంది. అందులో వెలిగించిన వత్తి ఉంటుంది. దీనివ
ప్రతిపాత్రధారి తన వంతు సంభాషణలు చెప్పినా, ముఖంలో భావా‹
పరికించినా ఈ గంటెలోని దీపం బాగా ఉపకరించేది. ప్రస్తుతం ఈ కళాకారు‹
బాగా తగ్గిపోయారు.

**చిందు, జోగుల నృత్యరీతులు :**

చిందు, జోగితలు హరిజనులలో ఒక తెగకు చెందినవారు. మహాభారత, భాగవత, రామాయణ గాథలను ప్రదర్శిస్తారు. యక్షగాన కళాకారులను మరిపించే విధంగా వేషాలు వేస్తారు. వీరు ఎక్కువగా పగటిపూటనే తమ ప్రదర్శన ఎ ఇస్తారు.

**యక్షగానం, వీథినాటకం, భాగవతం :**

ఈ మూడూ దాదాపు ఒకేరకంగా స్ఫురించినా వాటిని ప్రదర్శించిన సందర్భాలలో దేని ప్రత్యేకత దానిదే.

యక్షగానం కళారూపాన్ని భరతులు, బహురూపులు, సైంధవులు, దాసరులు కేవలం తెలంగాణంలో ప్రదర్శిస్తున్నారు.

ఈ యక్షగానం కాలక్రమేణా వీథినాటకంగా రూపొంది దాదాపు ఇదే సాహిత్యంతో రాయలసీమ ప్రాంతంలో ప్రదర్శిస్తున్నారు.

కోస్తా ఆంధ్రలో అమ్మవారి జాతరల సందర్భంగా ప్రబంధ పద్ధతిలో 'భాగవతం' ప్రదర్శిస్తారు. ఇందులో నాటకీయతకన్నా మిన్నగా పాత్రధారులు

తమకు నృత్యసంగీతాలలో గల ప్రత్యేక పాటవాల ప్రదర్శన ఎక్కువగా చేస్తారు.

**పులివేషం, సిద్దీల నృత్యం :**

దసరా, మొహర్రం పండగల సందర్భంగా పులివేషం వేయడం ఆనవాయితీ. దాదాపు 8 గంటలసేపు పులిమేకప్ చేస్తారట. డప్పులకు అనుగుణంగా వీరోచితంగా అడుగులు వేస్తూ వినోదం చేస్తారు.

14వ శతాబ్దం మధ్యభాగంలో అరబ్బులు, టర్కీలు, ఇరానీలవంటి ఇతర ముస్లింలతో హైదరాబాదుకు వలస వచ్చిన సిద్దీలు నిజాంకు అంగరక్షకులుగా ఉండేవారు. తమ నైపుణ్యాన్ని ప్రతిబింబిస్తూ చేతిలో ఖడ్గం ధరించి వివిధ భంగిమలలో చేసే నృత్యవిశేషమే సిద్దీ నృత్యంగా వ్యవహరించబడుతున్నది.

**కత్తిసాము :**

విజయనగరంలో వర్ధిల్లిన కత్తిసాము నైపుణ్యానికి పరాకాష్ఠ. మనిషిని వెల్లకిలా పడుకోబెట్టి ఆయన పొట్టపై అరటిపండు పెట్టి, పైనుంచి ఒకే దెబ్బతో కడుపు కేమాత్రం తగలకుండా రెండుగా నరకడం, అటుపిదప సూదిని పొట్టపై పెట్టి, పొట్టకు కత్తి తగలకుండా రెండుగా నరకడం ప్రేక్షకుల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది.

**తోలుబొమ్మలు – బుట్టబొమ్మలు :**

ప్రాచీన తెలుగు సంస్కృతిని, కళా ప్రతిభను చాటి చెప్పే జానపదకళా విశేషం తోలుబొమ్మలాట.

బుట్టబొమ్మలు – చింతగుజ్జు, వెదురుతో ఎంతో ఎత్తుగా తయారుచేసిన రాధాకృష్ణులు, హనుమంతుడు, గరుత్మంతుడు ఇత్యాది బొమ్మలను తలపై

పూర్తిగా పెట్టుకొని డప్పులకు అనుగుణంగా అడుగులు వేయడం ఇందులోని ప్రత్యేకత.

ఆంధ్రదేశంలోని జానపద కళారూపాలను గురించి ఇలా పేర్కొంటూపోతే కులానికి ఒకటి అన్నట్టుగా ఉన్నాయి. ఏమైనా మొత్తంమీద రాష్ట్రంలో కురవంజి ట కళారూపంగా పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు.

### అభ్యాసవేదిక

*1.* **అర్థాలు :**
సంస్కరించు = బాగుచేయు; ముండ్లు తెప్పించు = ఆశ్చర్యపరచు; వైభవం = గొప్పతనం; నైపుణ్యం = తెలివితేటలు; తారసపడు = ఎదురుపడు; పునరుక్తులు = మళ్ళీ మళ్ళీ చెప్పు.

*2.* **కింది పదాలకు అదే అర్థం ఇచ్చే మరో రెండు పదాలు రాయండి :**

1. ఈశ్వరుడు = (1) ________ (2) ________
2. వినోదం = (1) ________ (2) ________
3. చువ్వ = (1) ________ (2) ________
4. కఱ్ఱ = (1) ________ (2) ________

*3.* **పాఠాన్ని చదివి కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :**

1. సదాచారం ×
2. అప్రధానం ×
3. నవీనం ×
4. బోర్లా ×
5. సందర్భం ×

4. కింద ఇచ్చిన పదాలను స్వంత వాక్యాలలో ఉపయోగించి రాయండి :

1. బట్టబయలుచేయు
2. పొట్టపోసుకొను
3. తేటతెల్లంచేయు
4. గిర్రున తిరుగు

5. కింది ప్రశ్నలకు సమాధానం రాయండి :

1. జానపద కళలు ఎక్కడ కాలగర్భంలో కలిసిపోతున్నాయి ?
2. విప్రవినోదులు, పగటి వేషాలవారు ఎవరు ? వారు ఏం ప్రదర్శిస్తారు.
3. గంటె భాగవతులు ఎవరు ? ఏం ప్రదర్శిస్తారు ?
4. పులివేషాలు ఎప్పుడు వేస్తుంటారు ?
5. బుట్టబొమ్మలు దేనితో తయారుచేస్తారు ?

6. కింద ఇచ్చిన ఖాళీలను పాఠం చదివి సరయిన పదంతో పూరించండి :

1. ఈనాటికీ ఎక్కువ కళారూపాలు __________ జిల్లాలలో తారసపడతాయి.
2. __________ వృత్తి పేరులోనే వారి నైపుణ్యం ద్యోతకమవుతుంది.
3. __________ భాగవతులు ఈ కళలను ప్రాచుర్యంలోకి తెచ్చారు.
4. ఈ విశేషాంశాన్ని __________ దొమ్మరులు కూడా ప్రదర్శించ లేకపోవడం గమనార్హం.
5. __________ అనేది వాద్య విశేషం.

7. పాఠం చదివి కింద వాక్యాలను జతపరచండి :

| | | |
|---|---|---|
| 1. ఈ వాద్యాన్ని స్త్రీలు కూడా | ( ) | వత్తి ఉంటుంది. |
| 2. రాష్ట్రంలో కురవంజి | ( ) | ప్రదర్శనలు ఇస్తారు. |
| 3. అందులో వెలిగించిన | ( ) | అంగరక్షకులుగా ఉండేవారు. |
| 4. వీరు ఎక్కువగా పగటిపూటనే | ( ) | మొట్టమొదటి కళారూపం. |
| 5. సిద్దీలు నిజాంకు | ( ) | తాకకుండా జాగ్రత్తపడతారు. |

**8. క్రింది చిత్రం ఆధారంగా వీలయినన్ని సరయిన వాక్యాలు రాయండి :**

| | |
|---|---|
| వానలో తడిస్తే | ఎవరు పాడతారు ? |
| బడికి ఆలస్యంగా వెళ్తే | ఎవరు పరుగెత్తుతారు ? |
| పోటీలో గెలిస్తే | జలుబు చేస్తుంది. |
| బాగా చదివితే | మెచ్చుతారు అరుస్తారు. |
| నీ దగ్గర బలపం లేకపోతే | బహుమతి వస్తుంది. |
| రాజా పరుగెత్తకపోతే | ఎక్కువ మార్కులు వస్తాయి. |
| కవిత పాడకపోతే | నువ్వు రాయవు. |

నమూనా :- వానలో తడిస్తే జలుబు చేస్తుంది.

9. (*a*) విద్యార్థులకు సూచనలు :

1. ఆసక్తి ఉన్న కళారూపాన్ని తమ మిత్రులమధ్య ప్రదర్శించాలి.
2. తోలుబొమ్మలు, బుట్టబొమ్మల మాదిరిగానే కాగితాలతో బొమ్మలు చేసి దానితో ప్రదర్శనలు నిర్వహించవచ్చు.

(*b*) ఉపాధ్యాయులకు సూచనలు :

1. ఈ పాఠంలో ఇచ్చిన కళారూపాలను విద్యార్థులచేత పట్టిక రూపంలో రాయించాలి.
2. స్థానికంగా ఏ కళారూపం ప్రదర్శనయినా జరిగినప్పుడు విద్యార్థులకు చూపించి ప్రత్యక్ష పరిచయం చేయించాలి. వారు మాట్లాడే భాష మొదలయినవి వివరించాలి.

—o—

**ఆత్మబలం లేనివాడు దేనిలోనైనా రాణించలేడు**

# 12. పొడుపు కథలు

[జానపదులు పల్లెల్లో కాలక్షేపానికి కబుర్లు చెప్పుకొనేటప్పుడు, పొలాల్లో పనిచేస్తూ శారీరక కష్టాన్ని మరచిపోవడానికి ' పొడుపు కథలు ' చెప్పుకుంటారు. పొడుపు కథలు పిల్లలకు జ్ఞాపకశక్తిని సమస్యా పరిష్కారమార్గాన్ని లోకజ్ఞతను కల్గిస్తాయి. పల్లెవాళ్ల మనసులో కొత్త ఆలోచనలు పుడతాయి. కొత్త ప్రశ్నలు తలెత్తుతాయి. అబ్బురపాటు కలిగిస్తాయి. ప్రశ్నలకు జవాబు చెప్పాలనే ఉత్సాహాన్ని రేకిస్తాయి. పొడుపు కథ విప్పటంలో ఆనందం వెల్లివిరుస్తుంది. కనుక పొడుపు కథలు బాలబాలికల మెదడుకు పదను పెడతాయి. ఈ పొడుపు కథలను నేర్చుకోండి.]

పాఠంలో ముఖ్యమైన పదాలు :

| | | | |
|---|---|---|---|
| తొన | తమ్మ | పరిమళం | క్రుంగు |
| కమలం | మన్నన | పొంగు | హంగు |

* * *

1. తెల్లటి పొలంలో, నల్లటి విత్తనాలు
   చేత్తో చల్లుతారు, నోట్తో ఏరుతారు.

పొలం తెల్లగా ఉంది. విత్తనాలు నల్లగా ఉన్నాయి. నల్లటి విత్తనాలను చేతితో చల్లుతారు. నోటితో వాటిని ఏరుకుంటారు. అవి ఏవి ?

2. ఒక పండు – పండుకు పన్నెండు తొనలు
   తొనకు ముప్పయి గింజలు
   పదునైదు నలుపు; పదునైదు తెలుపు.

ఒక పండులో పన్నెండు భాగాలున్నాయి. ఒక్కొక్క భాగంలో ముప్పయి గింజలున్నాయి. వాటిలో పదైదు నల్లనివి. పదైదు తెల్లనివి. అవి ఏవి ?

3. కాటుక రంగు – కమలము హంగు
విప్పిన పొంగు – ముడిచిన క్రుంగు.

కాటుకలాగా నల్లని రంగు కలిగి ఉంటుంది. తామరపువ్వు మాదిరి ఉంటుంది. విప్పితే వెడల్పు అవుతుంది. ముడిస్తే చిన్నదై పోతుంది. ఏమిటది ?

4. తల నుండి పొగ చిమ్ముచుండు – భూతము కాదు
కన్నులెఱ్ఱగా నుండు – రాకాసి గాదు
పాకిపోవుచునుండు – పాముగాదు.

తలనుండి పొగవస్తూ ఉంటుంది కాని భూతం కాదు. కన్నులు ఎర్రగా ఉంటాయి. రాక్షసుడు కాడు. భూమ్మీద పాకిపోతూ ఉంటుంది కాని పాము కాదు. ఏమిటది ?

5. చెట్టున బుట్టిన గంగి
రాతిని బుట్టిన సరంగి
తీగకు బుట్టిన తిమ్మ
పాపనోట్లో తమ్మ.

చెట్టునుండి లభించే వస్తువు, రాతినుండి దొరికే వస్తువు, తీగనుండి లభించే వస్తువు. ఇవన్నీ కలిసి తాంబూలమౌతాయి. ఆ వస్తువులేవి ?

6. తొండమున్న ఏనుగుకాదు
రెక్కలున్న పక్షిగాదు
ఆరుకాళ్ళ చీమగాదు
కోకయున్నను సీతగాదు

ఏనుగువలె తొండం ఉంటుంది. కాని ఏనుగు కాదు. రెక్కలు ఉన్నాయి కాని పక్షిగాదు. ఆరుకాళ్లు ఉన్నాయి కాని చీమగాదు. కోక ఉంది కాని స్త్రీ కాదు. ఎవరది ?

7. నాలుగు కాళ్ళుండు నడయాడ లేదు
చేతులు రెండుండు పనిచెయ్యలేదు
మన్నని వారొస్తే మర్యాద చేస్తుంది
కూర్చుండ బెడుతుంది, గౌరవిస్తుంది.

నాలుగు కాళ్లు ఉన్నాయి కాని తిరుగాడలేనిది. రెండు చేతులు ఉన్నాయి కాని పనిచేయలేనిది. గౌరవింపదగిన వారొస్తే, కూర్చుండబెట్టి మర్యాద చేస్తుంది. అది ఏది ?

8. నిగ నిగలాడే నిర్మల వస్తువు
ఘుమ ఘుమలాడే గుమ్మగు వస్తువు,
భుగ భుగమండే పరిమళ వస్తువు,
నీటికి నానదు, గాలికి కరుగు, నిప్పుకుమండు.

ఆ వస్తువు నిగ నిగలాడుతూ స్వచ్ఛంగా ఉంటుంది. ఘుమ ఘుమలాడే మంచి వాసన కల్గి ఉంటుంది. చక్కగా మండుతుంది. నీటిలో నానదు. గాలిలో కరిగిపోతుంది. నిప్పుకు మండుతుంది. ఆ వస్తువేమిటి ?

9. నీళ్లు లేని సముద్రాలు
రాళ్లు లేని పర్వతాలు
ఇళ్లు లేని మహాపట్టణాలు.

సముద్రాలు ఉంటాయి కాని నీళ్లుండవు. పర్వతాల్లో రాళ్లుండవు. మహా పట్టణాలుంటాయి గాని ఇళ్లుండవు. ఆ ప్రదేశమేమిటి ?

10. అయిదక్షరాల నగరము
ఒకటి అయిదూ జోడిస్తే బరువు
మూడు నాలుగు కలిపితే ఆభరణం

రెండో అక్షరానికి యకారం లోపిస్తే నాలుగోది
మూడు అయిదు జతచేస్తే నాడి అని అర్థం
తెగబారెడు బతుకు బతికిన ఆ నగరమేది ?

ఆ నగరం పేరు అయిదక్షరాలు. ఒకటవ అక్షరం, అయిదవ అక్షరం కలిస్తే బరువు ' అని అర్థం. మూడవ అక్షరం, నాలుగవ అక్షరం కలిపితే ' ఆభరణం ' అని అర్థం. రెండో అక్షరంలో 'య' కారం లోపిస్తే నాలుగవ అక్షరం అవుతుంది. మూడవ అక్షరం అయిదవ అక్షరము కలిస్తే ' నాడి ' అని అర్థం. దీర్ఘచరిత్ర గలిగిన ఆ నగరమేది ? చుక్కోండి.

## జవాబులు

1. తెల్లటి పొలంలో అంటే తెల్లని కాగితంపైన అని అర్థం. నల్లటి విత్తనాలు అంటే నల్లటి సిరా. చేత్తో చల్లుతారు అంటే రాస్తారు. నోటితో ఏరుతారు అంటే చదువుతారు. తెల్లటి కాగితంపై, నల్లటి సిరాతో, చేత్తో రాసి, నోటితో చదువగలిగేవేవని తెలిసింది గదూ !

   *[అక్షరాలు]*

2. ఒక పండు అంటే సంవత్సరం. పన్నెండు తొనలు అంటే పన్నెండు నెలలు. ముప్పయి గింజలు అంటే నెలకు ముప్పై రోజులు. అందు పదునైదు నలుపు అంటే కృష్ణపక్షం. పదునైదు తెలుపు అంటే శుక్లపక్షం.

   *[సంవత్సరం, నెలలు, రోజులు, కృష్ణపక్షం, శుక్లపక్షం]*

3. రంగు కాకివలె నలుపుగా ఉంటుంది. ఆకారం తామరపూవువలె ఉంటుంది. విప్పితే విచ్చుకుంటుంది. ముడిస్తే ముడుచుకొంటుంది. అదేమిటో అర్థమయిందా ?

   *[గొడుగు]*

4. తలనుండి పొగ చిమ్మటం అంటే ఇంజనునుండి పొగరావడం. కన్నులెర్రగ ఉండడం అంటే లైట్లు వెలగడం. పాములా పాకుతూ పోవడం అంటే పట్టాలపై పాకుతూపోవడం.

   *[రైలుబండి]*

5. చెట్టునబుట్టిన గంగి అంటే చెట్టునుండి లభించే వక్క; రాతిని బుట్టిన సరంగి అంటే సున్నపురాయి నుండి లభించే సున్నం; తీగకు బుట్టిన తిమ్మ అంటే తీగనుండి లభించే తమలపాకు; ఈ మూడు కలిస్తే 'తమ్మ' అవుతుంది అంటే 'తాంబూలం' అవుతుంది.

[వక్క, సున్నం, ఆకులు - తాంబూలం]

6. ఏనుగుకున్నట్లు తనకొక తొండముంటుంది. దానితో మకరందా పీలుస్తుంది. తన రెక్కలతో ఎగురుతుంది. చీమలా తనకు ఆరుకా ఉంటాయి. తనపేరులో 'కోక' అనే పదముంటుంది. అర్థమయిం గదూ ! అదేమిటో.

[సీతాకోకచిలుక]

7. కుర్చీకి నాలుగు కాళ్లు ఉంటాయి. కాని కదలదు. రెండు చేతులు కూడా ఉంటాయి కాని పనిచెయ్యవు. అతిథులు వచ్చినప్పుడు వారిని కూర్చుండబెట్టి, మర్యాదచేసి గౌరవించడానికి పనికివస్తుంది.

[కుర్చీ]

8. తెల్లగా, స్వచ్ఛంగా, ప్రకాశవంతంగా ఉంటుంది. కమ్మని వాసన నిస్తుంది. చక్కగా మండుతుంది. గాలిలో ఉంచితే కరిగిపోతుంది. నిప్పుకు మండుతుంది. అది ఏమిటో తెలిసిందా ?

[కర్పూరం]

9. సముద్రాలు, పర్వతాలు, పట్టణాలు కన్పిస్తాయి. కాని నిజానికి అక్కడ నీళ్లుండవు; రాళ్లుండవు; ఇళ్లుండవు. ఎక్కడ ?

[ప్రపంచ పటం]

10. నగరం పేరు అయిదక్షరాలు. ఒకటో అక్షరం, అయిదో అక్షరం కలిస్తే 'భారం' అనే పదం ఏర్పడుతుంది. అంటే బరువు అని అర్థం. మూడు, నాలుగు అక్షరాలు కలిస్తే 'నగ' అంటే ఆభరణం అని అర్థం. రెండో అక్షరం 'గ్య'లోని యకారం తొలగిస్తే 'గ' అవుతుంది. అది నాలుగో అక్షరం. మూడో అక్షరం 'న' అయిదో అక్షరం 'రం' కలిస్తే 'నరం' అవుతుంది. అంటే నాడి అని అర్థం. దీర్ఘచరిత్ర గలిగిన ఆ నగరం ఏదో తెలిసింది గదూ !

[భాగ్యనగరం]

## అభ్యాసవేదిక

1. **అర్థాలు :**

కమలం = తామర; పొంగు = విస్తరించు; క్రుంగు = ముడుచుకొను; తమ్మ = తాంబూలం; పరిమళం = సువాసన; మన్నన = గౌరవం.

2. **పిల్లలకు సూచనలు :**

   1. పెద్దలనుండి ఇటువంటి పొడుపు కథలు సేకరించండి.
   2. మీ మిత్రులకు పొడుపు కథలు వినిపించి, సమాధానాలు రాబట్టండి.
   3. మీరే స్వయంగా ఇట్లాంటి పొడుపు కథలను రూపొందించటానికి ప్రయత్నించండి.

3. **ఉపాధ్యాయులకు సూచనలు :**

   1. మరికొన్ని పొడుపు కథలను రూపొందించి లేదా సేకరించి, వాటిలోనున్న వినోదాన్ని, విజ్ఞానాన్ని విద్యార్థులకు పంచటానికి ప్రయత్నించండి.
   2. తరగతిలో విద్యార్థులను జట్లుగా విభజించండి. ఒక జట్టు పొడుపు కథను వేయమనండి. వేరొక జట్టును విప్పమనండి. ఈ పోటీ ద్వారా జిజ్ఞాసను, ఆలోచనను రేకెత్తించండి.

—o—

# 13. పరుగుల రాణి పి. టి. ఉష

[ఈనాడు పురుషులతోపాటు స్త్రీలు అన్ని విషయాల్లో ముందడుగు వేస్తున్నారు. ఈ వ్యాసంలో ప్రముఖ క్రీడాకారిణి పి.టి. ఉష సాధించిన విజయాల వివరణ ఉంది.]

**పాఠంలో ముఖ్యమైన పదాలు :**

| | | |
|---|---|---|
| అనన్య సామాన్యం | పరిమితమగు | వ్యాయామక్రీడ |
| ఆదరణ | స్వాతంత్ర్యం | ప్రఖ్యాతి |
| ఉత్తేజం | క్రీడాకారిణి | అధికారి |
| ప్రోత్సాహం | స్వస్థలం | స్థిరపడు |
| విలాసవస్తువు | ఘటన | నిరంతరం |
| అపురూపం | ఘనత | స్ఫూర్తి |
| స్వీకరించు | వ్యవధి | అంతర్జాతీయ క్రీడారంగం |

* * *

మన దేశంలో రకరకాల క్రీడలున్నాయి. క్రీడ అంటే ఆడే ఆట అని అర్థం. పిల్లలు, పెద్దలు, స్త్రీ పురుషులు అనే భేదం లేకుండా వీటిని ఆడతారు. ఉదాహరణకు మన పల్లెపట్టుల్లో బారాకట్ట, చెడుగుడు, కోతికొమ్మచ్చి, బిళ్లంగోడి మొదలైన క్రీడలున్నాయి. క్రికెట్, ఫుట్‌బాల్, టెన్నిస్ వంటి క్రీడలు ఇటీవలి కాలంలో వచ్చాయి. పరుగుపందాలు ఎప్పటినుంచో ఉన్నాయి. వీటిలో చాలా క్రీడలు వ్యాయామానికి తోడ్పడేవి. వ్యాయామక్రీడల్లో ఆరితేరిన క్రీడాకారులు మనదేశంలో కొందరున్నారు. వారిలో అనన్య సామాన్య ప్రతిభ కనబరిచిన మహిళ పి. టి. ఉష. ఆమె జీవితంలో యువతరానికి ఉత్తేజం కలిగించే విజయాలు ఎన్నెన్నో ఉన్నాయి.

పరుగుల రాణిగా పేరుపొందిన పి.టి. ఉష పూర్తి పేరు పిలవుళ్ళ కాండి తెక్కె వరంబిల్ ఉష. కాలికట్‌కి 35 కి.మీ. దూరంలో ఆమె ప్వగ్రామం పయ్యోలి ఉంది. టేబిల్‌ఫ్యాన్‌ను కూడా విలాస వస్తువుగా భావించే కుటుంబంలో పైతల్-లక్ష్మి దంపతులకు రెండో కుమార్తెగా మెలడీకి 15 కి.మీ. దూరంలో కుత్తలి అనే గ్రామంలో తాతగారింట 1964 మే 20 న ఉష జన్మించింది.

అంతర్జాతీయ క్రీడారంగంలో ఎదగడానికి మొదటి ప్రోత్సాహం మేనమామ శ్రీధరన్ అందించాడు. స్కూల్లో బాలకృష్ణన్ మాస్టర్ ఆటలపట్ల మక్కువ పెంచాడు. నాలుగో తరగతిలో ఉండగానే భవిష్యత్తులో అంతర్జాతీయంగా కనబరిచే వ్యాయామక్రీడ ప్రతిభ బయటపడింది.

పదేళ్ళ వయసున్న ఉష తనకన్నా వయసులో మూడేళ్ళు పెద్దదయిన బేబీ సరళను ఓడించి ఉపజిల్లా నాయకత్వం (సబ్ డిస్ట్రిక్ట్ ఛాంపియన్) చేజిక్కించుకొంది. అదే ఆమె అపురూపమైన క్రీడాజీవితానికి అందమైన ప్రారంభం.

1976 లో శ్రీధరన్ కేరళ రాష్ట్రప్రభుత్వం సమర్పిస్తున్న క్రీడాపాఠశాల పథకం గురించి చదివి ఉష తల్లిదండ్రులతో మాట్లాడి ఒప్పించి ఆమెను పోటీలో పాల్గొనేలా చేశాడు. అందులో ఎంపికయింది. క్రీడాపాఠశాలలోనే ఉషకి ఓ. మాధవన్ నంబియార్‌తో పరిచయం అయింది. క్రీడలశాఖనుంచి మెర్సీకాలేజ్ కాలికట్‌కి ఉషవెళ్ళినా నంబియార్ వెంటే ఉన్నారు. ఆయనను ఉషకి పూర్తికాలపు కోచ్‌గా 1981లో కేరళ క్రీడామండలి నియమించింది.

1978లో క్విలన్‌లో జరిగిన జాతీయమీట్‌లో జూనియర్ 100 మీ. గోల్డ్, హైజంప్ గోల్డ్ హర్డిల్స్ 60 మీ. గోల్డ్, 200 మీ. గోల్డ్ లాంగ్ జంప్

వెండి పతకాలు సాధించి, 14 ఏళ్ళ వయసులో 4 బంగారు పతకాలు, ఒక వెండి పతకం గెలుచుకొని అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తింది. అప్పటి కేరళ ముఖ్యమంత్రి శ్రీ ఎ. కె. ఆంటొనీ చేతులమీదుగా ట్రోఫీతోపాటు రెండువేల రూపాయల నగదును సగర్వంగా స్వీకరించింది. ఆ తర్వాత త్రివేంద్రంలో కేరళ పాఠశాల వ్యాయామక్రీడల పోటీల్లో, నాగపూర్ జాతీయ పాఠశాలల క్రీడల్లోనూ, త్రిచూర్‌లో రాష్ట్ర జౌత్సాహిక వ్యాయామక్రీడల పోటీల్లో వరసబెట్టి పతకాలు సాధించడంతో ఉష పేరు మార్మోగిపోయింది.



1979లో జాతీయ పాఠశాల క్రీడలు నాగపూర్‌లో జరిగాయి. ఉష జీవితంలో అదొక మరపురాని ఘటన. అప్పటికి మెట్రిక్ పరీక్షకి నెలరోజులు

వ్యవధి మాత్రం ఉంది. పోటీల్లో పాల్గొంటూనే తీరిక దొరికినప్పుడల్లా పుస్తకాలతో కుస్తీ పట్టేది. అప్పటికే వ్యాయామక్రీడల కారణంగా చాలా పాఠాలు పోగొట్టుకుంది. రోజంతా పరుగులు పెట్టాక మిగతావాళ్ళు ఆ అలసట మర్చిపోవడానికి కబుర్లతో, జోకులతో కాలక్షేపం చేసేవారు. ఉష మాత్రం తన గదిలో పుస్తకాలకు పరిమితమైపోయేది. అయినా పోటీల్లో ఆమె నాలుగు బంగారు పతకాలు గెలుచుకుంది. పోటీలున్నంతకాలం జ్వరంతో బాధపడింది.

1977 అక్టోబరు నుంచి డిసెంబర్ వరకు ఉష 12 పోటీల్లో (మీట్స్), 60 సంఘటనల్లో (ఈవెంట్స్) పాల్గొని దాదాపు 50 పతకాలు గెల్చుకొని ఘనతను ప్రకటించుకొంది. ఆమెపై కురిసిన పతకాల వర్షం గురించి చెప్పడానికి ఇదొక ఉదాహరణ మాత్రమే.

1982 ఢిల్లీ ఏసియాడ్‌లో 18 ఏళ్ళ ఉష రెండు రజతాలను సాధించింది. ఆమె ప్రతిభకు గుర్తింపుగా కేరళ ప్రభుత్వం 50 వేల రూ॥ నగదు బహుమతి ప్రకటించింది. 1983 ఫిబ్రవరిలో జాతీయ అంతర్‌రాష్ట్రీయ పోటీలో యధావిధిగా అధికవేగంతో పరిగెత్తి సాధించే లక్ష్యాన్ని (స్ప్రింట్ డబుల్) సాధించింది. నవంబర్ 83లో కువాయిట్‌లో జరిగిన ఏషియన్ వ్యాయామక్రీడల పోటీలో 400 మీ. స్వర్ణం చేజిక్కించుకొని 200 మీ.లో తనని ఓడించినందుకు లిడియా డివేగా మీద బదులు తీర్చుకొంది.

అక్టోబర్ 83లో జాతీయ వ్యాయామక్రీడలు జంషెడ్‌పూర్‌లో జరిగితే ఉష మెడను నాలుగు బంగారు పతకాలు అలంకరించాయి. 1985లో జకార్తా పోటీల్లో ఆరు మెడల్స్‌ను సాధించింది. 1986లో సియోల్ ఏసియాడ్‌లో నాలుగు స్వర్ణాలు ఒక వెండి పతకం సాధించి ప్రపంచవ్యాప్తంగా సంచలనం కలిగించింది.

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక వ్యాయామక్రీడారంగంలో ఉష కొచ్చిన గుర్తింపు మరెవరికీ రాలేదనడంలో అతిశయోక్తి కాదు. వ్యాయామ క్రీడాకారిణిగా మరపురాని విజయాలు చవిచూసి ఉష ఎందరో అభిమానులను ఎంతో పేరు ప్రఖ్యాతులను సంపాదించుకొంది.

4.

గతపదేళ్ళలో కేరళలో పుట్టిన అమ్మాయిల్లో సగంమందికి పైగా ఆమె పేరు పెట్టుకొన్నారు. కేరళలోని ఒక రైల్వే స్టేషన్‌కు ఆమె పేరు పెట్టారు.

భారత ఉత్తమ మహిళా క్రీడాకారిణిగా ఆసియా ఉత్తమ క్రీడాకారిణిగా ఎన్నో బహుమతులు పొందింది. ప్రస్తుతం ఉష భారతీయ రైల్వేలో అధికారిగా స్థిరపడినా ఆమె క్రీడాజీవితం భవిష్యత్తులో అన్ని తరాలకు నిరంతరం స్ఫూర్తి కలిగిస్తూనే ఉంటుంది.

5.

## అభ్యాసవేదిక

*1.* **అర్థాలు :**

ప్రతిభ = తెలివితేటలు; వ్యవధి = సమయం; మక్కువ = ఇష్టం; ఘనత = గొప్పతనం; నగదు = డబ్బు; ప్రస్థానించు = కదులు.

*2.* ***కింది వాక్యాలను చదివి వాటిలో కింద గీతగీసిన పదాలకు అదే అర్థం వచ్చే వేరే పదంతో వాక్యాన్ని తిరిగి రాయండి :***

6.

1. ఉష తనకన్నా వయసులో పెద్దయిన బేబీ సరళను ఓడించింది.
2. 1982 ఢిల్లీ ఏసియాడ్‌లో ఉష రెండు రజతాలను సాధించింది.
3. తన గదిలో పుస్తకాలకు పరిమితమైపోయేది.
4. ఎంతో పేరు ప్రఖ్యాతులను సంపాదించింది.
5. తాతగారింట ఉష జన్మించింది.

పాఠాన్ని చదివి కింది పదాలకు వ్యతిరేకపదాలు రాయండి :

నమూనా :- అనధికారి × అధికారి

1. అపరిమితం ×
2. ఓటమి ×
3. మరణించు ×

కింద ఇచ్చిన పదాలను స్వంత వాక్యాలలో ఉపయోగించి రాయండి :

1. మార్మోగిపోవు
2. కుస్తీపట్టు
3. బదులు తీర్చుకొను
4. ఆశ్చర్యంలో ముంచెత్తు

కింది ప్రశ్నలకు జవాబు రాయండి :

1. పి.టి. ఉష పూర్తిపేరు ఏమిటి ? ఆమె ఎక్కడ పుట్టింది.
2. మొట్టమొదట క్రీడాకారిణిగా ఇంట్లో ప్రోత్సహించిందెవరు ?
3. ఓ. మాధవన్ నంబియార్ ఎవరు ? ఉషకు ఏవిధంగా సహాయపడ్డాడు ?
4. 1979లో నాగపూర్‌లో ఉష ఏవిధంగా గడిపింది ?
5. ఢిల్లీ ఏసియాడ్‌లో ఎన్ని పతకాలు సాధించింది ?
6. సియోల్‌లో ఉష ఏవిధంగా పేరు తెచ్చుకొంది ?

కింది వాక్యాలలోని ఖాళీలను సరయిన పదాలతో పూరించండి :

1. కాలికట్‌కి 35 కి.మీ. దూరంలో ఆమె స్వగ్రామం ________ ఉంది.
2. స్కూల్లో ________ ఆటలపట్ల మక్కువ పెంచాడు.
3. ________ ఉషకి ఓ. మాధవన్ నంబియార్‌తో పరిచయం అయింది.

4. 14 ఏళ్ళ వయసులో ఒక వెండి పతకం గెలుచుకొని అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తింది.

5. 1979 లో నాగపూర్‌లో జరిగాయి.

6. పోటీలున్నంతకాలం బాధపడింది.

7. కింది అక్షరాలతో ఏర్పడే పదాలను రాయండి :

| | | |
|---|---|---|
| అ | ర | ం |
| ద | ధ | గ |
| న | ఈ | య |

నమూనా :- నగరం

8. కింది చట్రం ఆధారంగా వీలయినన్ని సరయిన వాక్యాలు రాయండి :

| | | | | |
|---|---|---|---|---|
| నిన్న | నేను | అన్నం | తిన(టం) | లేదు |
| ఇప్పుడు | మీరు | పూలు | కోయ(టం) | ను |
| రేపు | | ఇల్లు | ఊడవ(టం) | రు |

నమూనా :- నిన్న నేను అన్నం తినలేదు.

9. ఉపాధ్యాయులకు సూచనలు :

1. ఈ పాఠంలో వచ్చిన ఇంగ్లీషు పదాలను అకారాది క్రమంలో రాయించాలి.
2. ఇందులో వచ్చిన క్రీడల పేర్లను, ముఖ్యంగా వ్యాయామక్రీడల పేర్లను, వాటిని తెల్పటానికి ఉపయోగించిన భాషను వివరించాలి. ఉదా :- టెన్నిస్, స్ప్రింట్ డబుల్, ఈవెంట్స్, మీట్, మొదలగునవి. స్థానిక క్రీడల వివరాలనూ క్రీడల్లో ప్రసిద్ధులయినవారి పేర్లనూ చెప్పించాలి. స్థానికంగా జరిగే క్రీడోత్సవాల గురించి వివరించాలి.

# 6. సంతృప్తికి కారణం

[ మనం పాడుకునే గేయాలు రెండు రకాలుగా ఉంటాయి. మొదటి రకం ఉన్నవి. రెండవ రకం కథ లేనివి. ఈ గేయంలో కథ ఉంది. ఈ కథలోని ఉ సంతృప్తితో జీవించేది. ఇతరులకు కీడు చేయకపోవటమే సంతృప్తికి కారణమని చెప్పే కథాగేయం ఇది ]

**పాఠంలో ముఖ్యమైన పదాలు :**

| | | | |
|---|---|---|---|
| ఆకతాయి | తూలి | శిరసు | సలుపు |
| ఎరుగని | ఒడిసిపట్టు | కళ | ఉల్లాసం |
| పదిలంగ | మెరుపు | లోటు | ఉరుకు |
| క్రూరత్వం | కీడు | అమాయకుడు | పరులకు |
| కుడుపు | జాలి | | |

* * *

కుచ్చుతోక నాడిస్తూ
కొమ్మలెక్కి దూకేస్తూ
ఉడుత ఒకటి సరదాగా
అడవిలోన తిరుగసాగె

అంతలోన పట్టు తప్పి
ఆకతాయి ఉడుత తూలి
నేలపై పరుండిన తో
డేలు మీద జారిపడిపోయె

## వ్యాకరణం

**వాక్య నిర్మాణం :**

వాక్యంలో సాధారణంగా కర్త, కర్మ, క్రియలుంటాయని ఇదివరకే తెలుసుకున్నారు కదా ! అయితే ప్రతి వాక్యంలోనూ ఇవి తప్పనిసరిగా ఉండనక్కర్లేదు. కొన్ని వాక్యాలు ఏదో ఒకటి లేకుండా కూడా ఉంటాయి. ఈ వాక్యం గమనించండి.

ఇదుగో సుబ్బయ్య

ఈ వాక్యంలో కర్త ఉంది. కర్మ లేదు. క్రియ లేదు. అయినా అర్థం స్ఫురిస్తూనే ఉంది. ఈ వాక్యాన్ని గమనించండి.

ఆవు నెమరు వేస్తోంది.

ఈ వాక్యంలో నెమరువేయు అనే క్రియ ఉంది. ఆవు అనే కర్తృపదం ఉంది. కాని క్రియాఫలం పొందే కర్మపదం లేదు.

వాక్యాన్ని ప్రయోగించేప్పుడు కర్త, కర్మ, క్రియ వరుసగా ఉంటాయి.

రవి ఢిల్లీ వెళ్ళాడు.

ఈ వాక్యంలో రవి కర్త, ఢిల్లీ కర్మ, వెళ్ళాడు క్రియ. అయితే ఈ పదాలు ఎప్పుడూ ఈ వరుసలో ఉండక్కర్లేదు. అర్థానికి, సందర్భానికి ఇచ్చే ప్రాధాన్యతను బట్టి కర్త, కర్మ, క్రియల వరుసలో మార్పురావచ్చు. అయినా స్థూలంగా అర్థంలో తేడా ఉండదు.

రవి వెళ్ళాడు ఢిల్లీ

వెళ్ళాడు ఢిల్లీ రవి

వెళ్ళాడు రవి ఢిల్లీ

ఢిల్లీ వెళ్ళాడు రవి

ఢిల్లీ రవి వెళ్ళాడు

ఇంతే కాకుండా వాక్యంలో స్థలాన్ని కాలాన్ని తెలిపే పదాలు కూడా ఉంటాయి.

కిరణ్ మొన్న రైల్లో పాఠం చదివాడు. ఈ వాక్యంలో మొన్న కాలాన్ని, రైల్లో స్థలాన్ని తెలుపుతాయి.

వాక్యాల్లో కర్త, కర్మ, క్రియల విశేషణాలు ఎప్పుడూ వాటి ముందుగానే ఉంటాయి.

తెల్లని కొంగలు నీలాకాశంలో వేగంగా ఎగురుతున్నాయి.

ఇందులో తెల్లని, నీల, వేగంగా అనేవి విశేషణాలు. వాక్యంలో కర్త ఏ వచనంలో ఉంటే క్రియ అదే వచనంలో ఉంటుంది.

వా<u>డు</u> ఇక్కడికి వస్తున్నా<u>డు</u>

మీ<u>రు</u> ఎప్పుడు వస్తా<u>రు</u> ?

కాబట్టి వాక్యంలో కర్త వచనాన్ని బట్టి క్రియావచనం మారుతుందన్నమాట.

## అభ్యాసం

*1. క్రియలేని వాక్యాలను అయిదింటిని రాయండి :*

*2. కర్మలేని వాక్యాలను అయిదింటిని రాయండి :*

*3. కింది వాక్యాలను కర్త, కర్మ, క్రియల వరుసమార్చి రాయండి :*

1. అబ్దుల్ ప్రయాణానికి సిద్ధమయ్యాడు.
2. మేరీకి ఒక కోరిక కలిగింది.
3. నరసయ్య ఎడారిలో పయనించాడు.
4. దొంగలు నిజాయితీని మెచ్చుకొన్నారు.
5. క్రిష్ణయ్య రొట్టె తిన్నాడు.

*4. ఈ కింది వాక్యాల్లో స్థలాన్ని, కాలాన్ని తెలిపే పదాలు గుర్తించండి :*

1. రాత్రివేళలో మజిలీ చేయడం కష్టం.
2. మీరు సత్రంలో పడుకోండి.

3. నేను రేపు అమెరికా వెళ్ళొచ్చు.
4. సాయంత్రం నడక ఆలసటగా ఉంటుంది.
5. వైద్యుడు నన్ను ఆసుపత్రికి రమ్మన్నాడు.

ఈ కింది వా-్యల్లో విశేషణాలు గుర్తించండి :

1. అనిల్ పాఠశాలకు తొందరగా నడుస్తాడు.
2. ఎర్రటి పెన్నుతో పరీక్షలు రాయకూడదు.
3. టీచర్ రంగడిని మెత్తగా కొట్టాడు.
4. తెల్లముత్యాలు ఎర్రతివాచీ మీద మెరుస్తున్నాయి.

ఈ కింది వా-్యల్లో కర్తృపదం, క్రియాపదం వచనాన్ని గమనించండి :

నేను రేపు ఊరికి వెళ్తాను.

మేము పొలం పనులు చేస్తుంటాం.

మనం ఎప్పుడు కోతలు కోద్దాం.

నువ్వు నాతో వస్తున్నావు.

మీరు రేపు రండి.

వాడు పాఠం చదువుతున్నాడు.

అతను ఎక్కడికి పోతాడు ?

ఆయన ఇక్కడికి వస్తారా ?

ఆమె పాటలు పాడుతోంది.

అది పాలు తాగుతోంది.

అవి గడ్డి మేస్తున్నాయి.

వాళ్ళు ఎక్కడికో పోతున్నారు.

7. కింది పట్టిక ఆధారంగా వీలైనన్ని వాక్యాలు రాయండి :

| | | | |
|---|---|---|---|
| | | | పోతాను |
| | | | పోతాం |
| | | | పోయాడు |
| | | | పోయింది |
| | నిన్న | | పోయారు |
| నేను | | | పోయాను |
| మేము | | బడికి | పోయాం |
| రవి | | | పోతాడు |
| సీత | రేపు | | పోతుంది |
| విద్యార్థులు | | | పోతారు |
| | | | పోతున్నాను |
| | | | పోతున్నాం |
| | రోజూ | | పోతున్నారు |
| | | | పోతోంది |
| | | | పోతున్నాడు |

—o—

# 14. డాక్టర్ యల్లాప్రగడ సుబ్బారావు

[భయంకరమైన రోగాలను నివారించి మన ఆరోగ్యాన్ని పెంచేందుకు ఎందరో శాస్త్రజ్ఞులు కృషిచేశారు. వారిలో ప్రముఖుడు డా॥ యల్లాప్రగడ సుబ్బారావు. ప్రపంచానికి ఆయన ఇచ్చిన కానుకలు విటమిన్లు, మరి కొన్ని ఔషధాలు.]

**పాఠంలో ముఖ్యమైన పదాలు :**

| | | |
|---|---|---|
| మేధావులు | ఆశీర్వదించు | స్థాపించు |
| పరిశోధన | ఆర్థికపరిస్థితి | మహోపకారం |
| పాశ్చాత్యులు | సాఫీ | నిరోధించు |
| మహానుభావుడు | ఉష్ణమండలం | తపన |
| మానవాళి | ఆహ్వానించు | వ్యాధి |
| పవిత్రం | నిరంతరం | మహనీయుడు |
| సంప్రదించు | పరిశీలనా ధ్యేయం | లెక్కచేయు |
| మతాధిపతులు | రసాయనికాలు | సోకు |

* * *

మనం మందులషాపుకి వెళ్ళి చూస్తే అద్దాల బీరువాలలో రకరకాల మందులు కనిపిస్తాయి. వాటిని అన్నిటినీ చూస్తే ' అబ్బా ! ఇన్నిమందులు ఎవరు కనిపెట్టారో ?' అని ఆశ్చర్యం కలుగుతుంది. అనేకమంది మేధావులు అహోరాత్రాలు పరిశోధనలుచేసి వాటిని కనిపెట్టారు.

వాళ్ళంతా పాశ్చాత్యులనుకోకూడదు. వారిలో కొందరు భారతీయులున్నారు. పైగా మన తెలుగుగడ్డపై జన్మించిన ఒక మహానుభావుడూ ఉన్నాడు. ఆయనే యల్లాప్రగడ సుబ్బారావు.

ప్రపంచ మానవాళికి సేవచేసినవారు సుబ్బారావు. 1896 సంవత్సరం జూలై 1 తేదీన పవిత్ర గోదావరీ తీరాన రాజమహేంద్రవరంలో సుబ్బారావు జన్మించారు. ఆయన పుట్టిన ఇల్లు సిరిసంపదలతో తులతూగేది కాదు.

పుట్టగానే తండ్రిని పోగొట్టుకున్నాడు. పెరిగి తెలివి వచ్చిననాటికి అన్నగారు 'స్ప్రూ' అనే భయంకర వ్యాధికి గురి అయ్యాడు. అతడికి ఆ చిన్ని సుబ్బారావు ఎంతో సేవ చేశాడు. సరైన మందులు లేక రోగ బాధతో సతమతమవుతున్న అన్నగారి స్థితిని చూసి విచారించేవాడు.

స్ప్రూ, కలరా, కుష్ఠ మొదలయిన భయంకరమైన ఈ రోగాలను పారదోలే తరణోపాయం లేదా ? అనే ఆలోచన ఆనాడే అతడిలో అంకురించింది. అయితే బాగా చదువుకోవడానికి సరిగా డబ్బు దొరికేది కాదు. సన్యాసుల్లో కలవాలనుకున్నాడు. మతపరంగా మానవసేవచేస్తున్న రామకృష్ణమఠంవారిని సంప్రదించాడు. ఆ మఠాధిపతులు " రోగగ్రస్తులైన మానవాళికి సేవచేసే వైద్యుడివి " కమ్మని ఆశీర్వదించారు. వారి ఆజ్ఞను మన్నించి మద్రాసు మెడికల్ కాలేజీలో చేరాడు. ఆర్థిక పరిస్థితులను తట్టుకోవడానికీ అతడి డాక్టరీ చదువు చక్కగా సాగడానికీ తల్లి అతడికి వివాహం చేసింది.

ఆయన భార్య కస్తూరివారి ఇంటి బిడ్డ. ఆయన చదువు సాఫీగా సాగింది. 1921లో డాక్టర్ పట్టా సంపాదించాడు. తరువాత ఆ కాలేజీలోనే ఆయనకు డిమాన్‌స్ట్రేటర్ పదవి లభించింది.

భారతదేశంలో ఇంకా చదవదగ్గది కనిపించలేదు. మనిషిని పట్టిపీడించే ఉష్ణమండలపు జబ్బులను ఇంగ్లండు వెళ్ళి పరిశోధించాలనుకున్నాడు. అందు కోసము ఇంగ్లండు వెళ్ళాడు. లండన్ స్కూల్ ఆఫ్ ట్రాపికల్ మెడిసిన్‌లో చేరి



డిప్లొమా సంపాదించాడు. అమెరికాలోని హార్వర్డ్ వైద్యవిద్యాలయానికి చెందిన డాక్టర్ రిచర్డ్ స్ట్రాంగ్ అనే వైద్యాచార్యుడితో సుబ్బారావుకు పరిచయం ఏర్పడింది.

సుబ్బారావులోని ప్రతిభను గుర్తించి డాక్టర్ స్ట్రాంగ్ అతడిని అమెరికా ఆహ్వానించాడు. నిరంతర పరిశీలనా ధ్యేయం ఉన్న సుబ్బారావుకు పెన్నిధి దొరికినట్లయింది.

కొన్ని నెలలు బాగా శ్రమించాడు. పగలు చదువుకుంటూ రాత్రి హాస్పిటల్ లో పనిచేస్తూ కాలం గడిపాడు. ఒక సంవత్సరం అలా కష్టపడ్డాడు. డాక్టర్ స్ట్రాంగ్‌గారి సహాయంతో వారానికి పదిడాలర్ల జీతంతో లైబ్రరీలో ఉద్యోగం సంపాదించాడు.

హార్వర్డ్‌లో ఒక సంవత్సరం గడిచింది. అతడికి బయోకెమిస్ట్రీ మీదికి మనసుపోయింది. వెంటనే ఆ శాఖలో చేరాడు. డాక్టర్ ఓఫోలిన్ అనే ప్రముఖ శాస్త్రజ్ఞుడి నాయకత్వంలో తన పరిశోధన కొనసాగించాడు. 1930లో డాక్టర్ పట్టా సంపాదించాడు.

అక్కడ కండరాలపై రసాయనికాల ప్రభావం గురించి పరిశోధన చేశాడు. ఆ పరిశోధన ఆయనకు అంతర్జాతీయ ఖ్యాతిని తెచ్చిపెట్టింది.

భారతదేశం వచ్చి భారతీయులకు సేవచేస్తూ తన పరిశోధన కొనసాగించాలనే కోరిక కలిగింది. కలకత్తాలో ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైజీన్ అండ్ పబ్లిక్ హెల్త్ అనే సంస్థ స్థాపించబడింది.

ఫోర్డు ధర్మనిధి సంస్థ సుబ్బారావుగారిని దానిలో ఆచార్యునిగా పొమ్మని ఆదేశించింది. కాని ఆ పదవి సుబ్బారావుకు ఇవ్వక అధికారులు ఒక ఆంగ్లేయునకు ఇచ్చారు.

తరువాత ఆయన దృష్టి స్ప్రూ మొదలైన భయంకర రోగాల మీదకు మళ్ళింది. వాటిని గురించి పరిశోధన కొనసాగించాడు. దానితో వచ్చే ' ఎనీమియా ' మీద కూడా పరిశోధనలు సాగాయి. ఎన్నో వైద్యవిధానాలు కనుక్కొన్నాడు. ఆ విధానాలు B-2 అనే వెలలేని మందు వెలుగులోకి రావడానికి సహాయపడ్డాయి.

అమెరికాలోని పెరల్ రివర్ దగ్గర లెడర్లే పరిశోధనాలయం ఉంది. దానిలో వారానికి మూడురోజులు పనిచేసే అవకాశం దొరికింది. ఆ సమయంలో రోజుకు ఇరవై రెండు గంటలు కూడా సుబ్బారావు పనిచేసేవాడట. 1940లో లెడర్లే పరిశోధనాలయానికి సుబ్బారావును అసిస్టెంట్ డైరక్టర్‌గా నియమించారు. తరువాత దాని డైరక్టర్ పదవిని అలంకరించాడు. ఒక భారతీయుడికి ఈ పదవి లభించడం అపూర్వం! కావలసినంత ధనసహాయం, చేతికింద దాదాపు 300 మంది పరిశోధకులు, సహచరులతో నిరంతరం శ్రమించాడు. రకరకాల పరిశోధనలు చేసి ' ఫోలిక్ ఆసిడ్ ' అనే మందు కనుక్కున్నారు.

చిన్నప్పుడు సుబ్బారావు అన్నగారు బాధపడ్డ స్ప్రూ జ్వరం . . . . ఎనీమియా జబ్బుకు త్వరలో నయమయ్యే మందులు తయారయ్యాయి. సుబ్బారావు ఆధ్వర్యంలో క్షయవ్యాధి గురించి కూడా ఆ పరిశోధనాలయంలో పరిశోధనలు సాగాయి. ఇంకా యూరోమైసిన్ అనేమందు కూడా ఇక్కడ

కనుక్కున్నారు. 'లెడర్లే పరిశోధనాలయం' ఆయన ఆధిపత్యంలో మూడు పువ్వులు ఆరుకాయలుగా వర్ధిల్లింది. మానవాళికి మహోపకారం చేసే రకరకాల మందుల్ని అందించింది. ఆయనకు పిల్లలంటే చాలా ఇష్టం. చాలామంది అమెరికన్ పిల్లలకు చదువుకోవడానికి సహాయపడ్డారు.

ప్రపంచంలో పిల్లలకు ఆయన ఇచ్చిన కానుకలు విటమిన్లు, ఆంటీబయోటిక్ ల్యూకోమియా అనే జబ్బుకు ఔషధాలు. కోటి సోదరుల రోగాలను నిరోధించాలనే తపనతో పాటుపడ్డ ఆ మహనీయుడు తన ఆరోగ్యాన్ని లెక్కచేయలేదు. చివరికి ఆయనకు కరోనరీ థ్రాంబోసిస్ అనే వ్యాధి సోకింది. ఆ వ్యాధికి గురయి 1948 ఆగస్టు 9వ తేదీన అమెరికాలోనే మరణించాడు. ఆయన పరిశోధించి మానవాళికి అందించిన వైద్యవిధానాలు చిరకాలం నిలిచి ఉంటాయి.

## అభ్యాసవేదిక

1. అర్థాలు :

   అహోరాత్రాలు = పగలు, రాత్రి; తరణోపాయం = కష్టంనుండి దాటించే ఉపాయం; పాశ్చాత్యులు = పశ్చిమదేశం వారు; ఖ్యాతి = కీర్తి; అంకురించింది = మొలకెత్తింది.

2. కింద ఇచ్చిన పర్యాయపదాలను చదివి పాఠంలో వచ్చిన పదాన్ని కింద గీతగీసి గుర్తించండి :

   నమూనా :- <u>ఖ్యాతి</u> – విఖ్యాతి – ప్రసిద్ధి – కీర్తి

   లక్ష్యం, ఆశయం, ధ్యేయం, ఉద్దేశం.

   అధినేత, అధిపతి, అధికారి, పాలకుడు.

   రోగం, జబ్బు, అనారోగ్యం, నలత.

3. పాఠాన్ని చదివి కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :

1. సంపాదించుకొను ×
2. సంతోషం ×
3. మానుకొను ×

4. కింద ఇచ్చిన వేర్వేరు అర్థాలకు పాఠంలో వచ్చిన పదాలను ఇవ్వండి :

నమూనా :– దిష్టి, చూపు, ఆలోచన, దృష్టి

ఖాళీ, సారి, అనువు,

ఉత్తర్వు, అనుమతి,

జ్వరం, వేడి, ఎండ,

5. కింద ఇచ్చిన పదబంధాలను సొంతవాక్యాల్లో ఉపయోగించి రాయండి :

1. పెన్నిధి దొరుకు
2. పట్టి పీడించు
3. పదవి అలంకరించు
4. మనసుపోవు
5. మూడు పూవులు ఆరు కాయలుగా వర్ధిల్లు

6. కింది ప్రశ్నలకు జవాబు రాయండి :

1. సుబ్బారావుగారు ఎప్పుడు జన్మించారు ?
2. ఆయన వైద్య విద్య చదవడానికి ప్రోత్సహించిందెవరు ?
3. సుబ్బారావుగారిని అమెరికా ఆహ్వానించింది ఎవరు ?
4. సుబ్బారావుగారు కనిపెట్టిన ఔషధాలేమిటి ?
5. ఆయనకు ఎవరంటే ఇష్టం ?

7. కింది వాక్యాలలోని ఖాళీలను సరయిన పదాలతో పూరించండి :

1. పుట్టగానే ____________ పోగొట్టుకున్నాడు.
2. వారి ఆజ్ఞను మన్నించి ____________ కాలేజీలో చేరాడు.
3. 1921లో ____________ సంపాదించాడు.

# 15. జాషువ

[గుర్రం జాషువ తెలుగువారందరూ అభిమానించే మంచి కవి. చిన్నతనంలో అంటరానివాడుగా బాధలు పడ్డవాడు. చుట్టూ ఉన్న చెట్టుచేమల్ని, మనుషుల్ని, సమాజాన్ని పరిశీలించి ఆయన కవిత్వం రాశారు. ఆయనది కులమతాలకు అతీతమైన దృష్టి. అసమానతలను ఆయన వ్యతిరేకించాడు. మనిషిని ప్రేమించాడు. మానవత్వాన్ని చాటాడు.]

**పాఠంలో ముఖ్యమైన పదాలు :**

| | | | |
|---|---|---|---|
| హృదయం | మజిలీ | విశ్వం | వాగు |
| దంపతులు | సాంగత్యం | కనకం | ప్రశంస |
| దారిద్ర్యం | పంజరం | కవితాశారద | నేత్రావధానం |
| ఆవేదన | ప్రకృతి | వాణి | విశ్వాసం |
| వ్యక్తిత్వం | ఇతిహాసాలు | పాద | చివాలున |
| డప్పు | ఆగ్రహించు | సన్మానించు | |

* * *

నను గాంచి పెంచినాలో
గొనబుంగవనంబు, పాదు కొల్పిన తల్లీ !
నను మరచిన నిను మరవను
వినుకొండా ! నీకునా పవిత్ర ప్రణతుల్

కవిజాషువాకు వినుకొండతో గాఢమైన అనుబంధం. వినుకొండ గుంటురుజిల్లాలో ఉంది. వినుకొండకి కొంచెందూరంగాఉన్న మిస్సెమ్మ తోటలో 1895 సెప్టెంబరు 28వ తేదీన జాషువా జన్మించాడు.



తల్లి లింగమ్మ, తండ్రి వీరయ్య. జాషువా పుట్టిన మరో ఏడు సంవత్సరాలకు లింగమ్మ, వీరయ్య దంపతులకు మరో అబ్బాయి పుట్టాడు. ఈ దంపతులకు అంతకు ముందు పుట్టిన బిడ్డలు కొంతకాలం పెరిగి చనిపోయారు. అందువల్ల తల్లిదండ్రులు ఈ ఇద్దరు బిడ్డలనూ తమకున్న రెండుకళ్లుగా పెంచుకున్నారు. జాషువా తమ్ముడి పేరు ఇస్రాయేలు.

ఎదుగుతున్నకొద్దీ రెండు విషయాలు జాషువ చిన్నారి మనస్సుపై గాఢమైన ముద్రవేశాయి. ఒకటి దారిద్ర్యం. రెండవది అంటరానితనం.

ఒకనాడు ఊరిమైదానంలో పిల్లలు ఆడుకొంటున్నారు. వారితో ఆడాలని బాలుడైన జాషువ కూడ అక్కడికి వెళ్ళాడు. అయితే వారిలో కొందరు జాషువను ఆటలోకి రానివ్వలేదు. " నీవు అంటరానివాడివి కదా, నిన్ను తాకవలసి వస్తే ఎలాగ ? కనుక నీవు ఆటకు రావద్దు " అన్నారు. దానితో జాషువ చిన్నారి హృదయం అవమానంతో నిండిపోయింది.

మరొకసారి ఊరిలో నాటకం ఉందని డప్పువేసి ప్రచారం చేస్తున్నారు. "అంటరానివారు నాటకానికి రాకూడదొహో", అని మరీ మరీ చెపుతున్నాడు డప్పువాడు. అయినా ఉత్సాహంచేత జాషువ నాటకశాల వద్దకు వెళ్ళాడు.

టికెట్లు ఇచ్చేవాడు జాషువను గుర్తుపట్టి ' నీవు రావద్దు ' అన్నాడు. మర జాషువ ఆవేదనతో ఇంటికి వచ్చాడు. " నేనెందుకు అంటరానివాడిని ?" అ ప్రశ్న వేసుకున్నాడు. తల్లిని అడిగేవాడు. తల్లి లింగమాంబ " ఇది జాతికి వచ్చిన జబ్బు నాయనా, దానిని బాగుచేయగల వైద్యుడు రావాలి " అనేది.

ఆ రోజుల్లో వినుకొండ ప్రాంతమంతా ఎటుచూసినా నిలువెత్తున నాగజెముడు పొదలతో నిండి వుండేది. జాషువ తన స్నేహితులను వెంటవేసుకొని పొదలలోని పాములను, కవుజుపిట్టలను, చింత తోపులోని పిట్టలను వేటాడుతూ ఆకతాయితనంగా తిరిగేవాడు.

జాషువకు పిట్టలు, జంతువులను పెంచడం అంటే బలే సరదా. వీ సాంగత్యం అతనికి అనుకోని ఆనందాన్ని కలిగించేది. ఒకసారి తమ ఇంట ఆవరణలో ఎవరో పేదబాటసారులు రాత్రిపూట మజిలీ వేశారు. వారివద్ద ఒ పంజరంలో కౌజుపిట్ట ఉంది. అది తనకు కావాలని పట్టుబట్టాడు జాషు. లింగమాంబ ఎంత అడిగినా ఆ పేదబాటసారులు పిట్టను ఇవ్వమన్నారు. అందరు నిద్రపోయాక జాషువ ఆ పిట్టను దొంగిలించి దాచాడు. తెలతెలవారుతుండగా బాటసారులు ప్రయాణమైపోతూ పంజరం కోసం చాలా వెతికారు. జాషువ మాత్రం తనకేమి తెలియనివాడిలా ఉన్నాడు. తల్లి అడిగినా తనకు ఏమీ తెలియదన్నాడు. బాటసారులు ఎంతో నిరాశతో బయలుదేరబోతూ వుండగా గంపకింది కౌజుపిట్ట కూయడం మొదలుపెట్టింది. ఇంకేముంది? దొంగ పట్టుబడిపోయాడు. ఆ పిట్ట ఆనాడు నేర్పిన నీతిపాఠాన్ని జీవితాంతం మరిచిపోలేదు జాషువ.

కొండలు, కోనలు, తోటలు, పొలాలు తిరిగే జాషువ ప్రకృతిని బాగా పరిశీలించాడు. తన చుట్టూ వున్న సమాజంలో తానుపొందుతున్న ఆవేదనను

ఆ ప్రకృతి సాంగత్యంలో పోగొట్టుకొనేవాడు. తనలో ఉబికి వస్తున్న భావావేశానికి అక్షరరూపం ఇవ్వడానికి తగినంత భాష తనవద్ద లేదు. అందుకని పురాణాలు, ఇతిహాసాలు చదవడం మొదలుపెట్టాడు. దానికి ఇటు తనకులంవారు ఆగ్రహించారు. అటు అగ్రవర్ణాలవారు కోపాన్ని వెళ్ళగక్కారు. అందుచేత జాషువకు గురువుగా ఎవరూ ముందుకు రాలేదు. అయినా ఆయన మాత్రం తన భావోద్వేగానికి అడ్డుకట్టలు వేసుకోలేకపోయారు. రాత్రిపూట ఊరికి దూరంగా ఉన్న ఒక పాడుబడిన మసీదులో గుడ్డిదీపపు వెలుగులో పురాణేతిహాసాలు చదువుకున్నాడు. సమాజంలో ఎక్కడ అసమానత ఉందో, అన్యాయం నిలిచిందో దానిని తన కవిత్వం ద్వారా లోకానికి ఎత్తి చూపించాడు.

ఆ రోజుల్లో సుప్రసిద్ధ తెలుగుకవులు అష్టావధానాలు, శతావధానాలు చేస్తు ఊరూరా ప్రశంసలు పొందుతూ వుండేవారు. తానూ తనతమ్ముడు ఇశ్రాయేలు కలసి కష్టతరమైన నేత్రావధానాన్ని అభ్యసించి దానిని ప్రదర్శించారు. ఈ అవధాన ప్రదర్శన సమయంలోనే జాషువకు ప్రప్రథమ సన్మానం ఒక కుగ్రామంలో జరిగింది. ఆ సన్మానమేమిటి ? ఒక ఆసామి జాషువకు 'పదిసేర్ల సజ్జలు ' ఇచ్చి సత్కారించాడు.

ఆయన కవిత్వాన్ని విని 'భేష్, భేష్' అన్నవారు, మీదేకులం ? అని ప్రశ్నించి, జవాబు విని, చివాలున లేచిపోయేవారు. ఆ సంఘటన కవి హృదయానికి బాకులా గుచ్చుకున్నది. తాను కవి, తనకు ఏ మతమూ లేదు. తాను ఏ కులానికి చెందినవాడూ కాడు. తాను విశ్వనరుడు అని చెప్పుకుంటూ మానవతాదృష్టిని పెంచుకుంటూ పయనం సాగించాడు. సాంఘిక అసమానతలపై తిరుగుబాటు చేశాడు. ఈ తిరుగుబాటు ఆయనలో ఆత్మవిశ్వాసాన్ని పెంచింది. కవిగా, విశ్వనరునిగా నిలబడడానికి తగిన శక్తి వచ్చింది. ఇక ఆయన కులమతాలు గీసిన కట్టుబాట్లకు, ఇటు ఆర్థిక

అసమానతలకు లొంగిపోలేదు. యుద్ధవీరుడైనాడు. " గవ్వకు సాటిరాని ఈ కాకులు నన్ను ఏమనినా, నన్ను చేరిన కవితాశారద వదలిపోదు. కలం చేబట్టాను. ఇక రవ్వలు రాల్చగలను " అంటూ రొమ్ము విరిచి తన వ్యక్తిత్వాన్ని చాటుకొని జాషువ ' కవిజాషువ ' అయినాడు. ' పిరదౌసి, ' ' గబ్బిలం ', ముంతాజ్ మహల్, స్వప్నకథ, బాపూజీ, నేతాజి, ముసాఫిరులు, క్రీస్తుచరిత్ర, క్రొత్తలోకం ఖండకావ్యాలు మొదలైన గ్రంథాలు ఆయన వాణి నుండి వెలువడినాయి.

ఆంధ్రదేశంలోని కవితాభిమానులు ఊరూరా ఆయనను సన్మానించారు. కనకాభిషేకం చేశారు. ' కవిగజగండపెండేరం ' కాలికి తొడిగారు. ' పద్మభూషణ' బిరుదు నిచ్చి ప్రభుత్వం సన్మానించింది. డెబ్బదైదేండ్లు జీవించిన జాషువ నవయుగ కవిచక్రవర్తి.

## అభ్యాసవేదిక

*1.* **అర్థాలు :**

హృదయం = మనస్సు; దంపతులు = ఆలుమగలు; డప్పు = తప్పెట; జబ్బు = రోగం; ఆవేదన = బాధ; పంజరం = పక్షుల నుంచే గూడు; మజిలీ = బాటసారులు విశ్రాంతి తీసుకొనేచోటు; సాంగత్యం = సహవాసం; ఆగ్రహించు = కోపగించుకొను; విశ్వం = ప్రపంచం; వాణి = వాక్కు; కవితాశారద = కవితాసరస్వతి; పొద = చెట్లగుబురు; సన్మానించారు = గౌరవించారు; ప్రశంస = పొగడ్త; నేత్ర+అవధానం = కళ్ళతో చేసే అవధానం; చివాలున = వెంటనే; విశ్వాసం = నమ్మకం; కనకం = బంగారం.

**2. కింది పదములకు అదే అర్థం ఇచ్చే రెండేసి పదాలు రాయండి :**

1. బాట = (1) ________ (2) ________
2. హృదయం = (1) ________ (2) ________
3. సాంగత్యం = (1) ________ (2) ________
4. కనకం = (1) ________ (2) ________
5. శారద = (1) ________ (2) ________
6. విశ్వం = (1) ________ (2) ________

**3. పాఠాన్ని చదివి కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :**

1. సన్నని ×
2. గిట్టు ×
3. గౌరవం ×
4. ఆనందం ×
5. న్యాయం ×
6. దూషించు ×
7. సులభతరం ×
8. ప్రశ్న ×
9. విశ్వాసం ×
10. అనుగ్రహం ×

**4. కింది పదాలుగల వేర్వేరు అర్థాలను గమనించండి, నేర్చుకోండి :**

1. వర్ణం = కులం, అక్షరం, రంగు
2. వాణి = వాక్కు (మాట), సరస్వతి
3. ప్రకృతి = సహజ సంపద, స్వభావం, శబ్ద [illegible]
4. గురువు = ఉపాధ్యాయుడు, తండ్రి, బృహస్పతి
5. నేత్రం = కన్ను, నక్షత్రం, [illegible]
6. సమయం = కాలం, ప్రతిజ్ఞ, [illegible]
7. మతం = జాతి, అభిప్రాయం, [illegible]
8. శక్తి = బలిమి, పార్వతి, సామర్థ్యం
9. శారద = సరస్వతి, శరత్కాలం

**5. కింది మాటలను స్వంత వాక్యాలలో [illegible] రాయండి :**

1. పట్టుబట్టు 2. వెళ్లగక్కు 3. [illegible]
4. తిరుగుబాటు చేయు 5. [illegible]

*6. కింది పదాలను వాటికి సంబంధిత పదాలతో జతపరచండి :*

| అ | | ఆ | |
|---|---|---|---|
| 1. వీరయ్య, లింగమాంబలు | – | జాషువ | (  ) |
| 2. గుండ్లకమ్మ | – | జాషువ బిరుదు | (  ) |
| 3. పద్మభూషణ | – | జాషువ తమ్ముడు | (  ) |
| 4. ఇశ్రాయేలు | – | గ్రంథం పేరు | (  ) |
| 5. గబ్బిలం | – | జాషువ తల్లిదండ్రులు | (  ) |
| 6. నవయుగ కవి చక్రవర్తి | – | ఒక వాగుపేరు | (  ) |
| 7. వినుకొండ | – | | |

*7. కింది పదాలను గమనించండి. ఎటునుండి చదివినా ఒకటేమాట. ఇలాంటి మాటలు కొన్నింటిని రాయండి :*

ఉదా :– కిటికి, కలక, నటన

*8. కింది ప్రశ్నలకు జవాబులు రాయండి :*

1. జాషువ తల్లిదండ్రులెవరు ?
2. జాషువ ఎప్పుడు జన్మించాడు ?
3. జాషువ మనసుపై గాఢమైన ముద్ర వేసినవి ఏవి ?
4. అతని మనసు ఎందుకు అవమానంతో నిండిపోయింది ?
5. అందుకు తల్లి లింగమాంబ ఏమన్నది ?
6. జాషువ తన చదువును ఎట్లా కొనసాగించాడు ?
7. జాషువ ప్రప్రథమంగా ఏవిధంగా సత్కారింపబడ్డాడు ?
8. జాషువ ' కవిజాషువ ' ఎట్లు అయినాడు ?
9. జాషువ రాసిన గ్రంథాలేవి ?
10. అతనిని ప్రభుత్వం ఎట్లా సన్మానించింది ?

*9. పాఠం చదివి కింది ఖాళీలను పూరించండి :*

జాషువ గుంటూరు జిల్లాలో ____________ పట్టణం సమీపాన చిన్న ____________ లో ____________ సంవత్సరం సెప్టెంబరు ____________ తేదీన పుట్టాడు. అతని తండ్రి ____________ తల్లి ____________ . అతనికి

చిన్నప్పటినుండి ___________, ___ ______ అనే రెండు విషయాలు తన మనస్సుపై ___________ వేశాయి. తనచుట్టూ వున్న ___________లో తాను పొందుతున్న ___________ను ప్రకృతి ___________లో పోగొట్టుకొనేవాడు. అందుకని ___________, ___________ చదవడం మొదలుపెట్టాడు. కాని జాషువకు ___________గా వుండుటకు ఎవరు ముందుకు రాలేదు. అయినా తన ___________ నికి ___________ వేసుకోలేక పోయారు. సమాజంలో ___________ ఉందో, ___________ నిలిచిందో దానిని తన ___________ ద్వారా ___________కి ఎత్తి చూపించారు.

***10.*** **విద్యార్థులకు సూచనలు :**

జాషువ రాసిన ఈ పద్యాన్ని కంఠస్థం చేయండి. పరీక్షకోసం కాదు.

ఆ.వె. " కులమతాలు గీచుకొన్న గీతలజొచ్చి
పంజరాన గట్టువడను నేను
నిఖిలలోకమెట్లు నిర్ణయించిన నాకు
తరుగు లేదు, విశ్వనరుడు నేను "

***11.*** **ఉపాధ్యాయులకు సూచన :**

1. అవధానం, అష్టావధానం, శతావధానం, నేత్రావధానం – వీటిని గూర్చి తెలియజేయండి. వీలుంటే పిల్లలు వీటిని చూసే అవకాశం కల్పించండి. ' పద్మభూషణ ' బిరుదు గూర్చి చెప్పండి.
2. జాషువ గ్రంథాలను, పద్యాలను పరిచయం చేయండి.
3. జాషువను గూర్చి పదిపంక్తుల వ్యాసం రాయించండి.
4. విద్యార్థులు నిఘంటువును చూచి, వేర్వేరు అర్థాలున్న పదాలు/ఒకే అర్థమిచ్చే విభిన్న పదాలు రాసేట్లు ప్రోత్సహించండి.

—0—

# 16. సమత

## (కంఠస్థం చేయాల్సిన పద్యాలు)

**పాఠంలో ముఖ్యమైన పదాలు :**

| | | | |
|---|---|---|---|
| శ్రీలు | భువి | సమత | మానవత్వం |
| శీర్ణమగు | నకలు | కలిమి | పరమార్థము |
| ధాత్రి | సమాదరంబు | పథము | విరిసినంత |
| కుదుపు | జగతి | | |

* * *

1. సమతలేని స్వేచ్ఛ సార్థక్యముండదు
స్వేచ్ఛలేని సమత శీర్ణమౌను
శ్రీలు పొంగు ధాత్రి స్వేచ్ఛా సమతలున్న
వాస్తవమ్ము నార్లవారి మాట.

2. ఎట్లు నడచు బండి యెత్తు పల్లములందు
కుదుపులేక, యెచటొ కూలిపడక
సమతలేని చోట్ల స్వాతంత్ర్య రథమిట్లె !
వాస్తవమ్ము నార్లవారి మాట.

3. సమతయనగ భూమి చదును చేయుటగాదు;
ఒకరికొకరు వట్టి నకలు కాదు;
సమత యనగ సర్వజన సమాదరంబు
వాస్తవమ్ము నార్లవారి మాట.

4. జాతి మత కులాది సకల భేదమ్ములు
విరిగి పోవు సమత విరిసినంత !
సమతలేని జగతి యమలోక సమమురా
వాస్తవమ్ము నార్లవారి మాట.

5. నలిగి పోవ జాతి కుల భేదముల మధ్య
చెలిమిలేదు, మనకు కలిమి లేదు !
చెలిమి కలిమిలేక బలమెట్టులుండురా ?
వాస్తవమ్ము నార్లవారి మాట.

6. మతములెన్నియైన మానవత్వమొకటే !
జాతులెన్నియైన జగతి యొకటె !
పథము లెన్నియైన పరమార్థమొక్కటే
వాస్తవమ్ము నార్లవారి మాట.

– నార్ల వెంకటేశ్వరరావు

అభ్యాసవేదిక

- అర్థాలు :

శీర్ణమౌను = నశించును; శ్రీలు = సంపదలు; ధాత్రి = భూమి; నకలు = ఉన్నది ఉన్నట్లుండేది; సమ+ఆదరంబు = సమానంగా గౌరవించుట; విరిసినంత = వికసించినంత/అభివృద్ధి చెందుట; జగతి = ప్రపంచం; కలిమి = సంపద; పథం = మార్గం.

2. పాఠాన్ని చదివి కింద యివ్వబడిన అర్థాలు వచ్చే పదాలు రాయండి :

1. భూమి –
2. ప్రపంచం –
3. సంపద –

3. కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :

1. స్వేచ్ఛ ×
2. ఎత్తు ×

3. స్వాతంత్ర్యము ×
4. కలిమి ×
5. చెలిమి ×
6. సమత ×

**4. పద్యాలకు భావం :**

1. సమతాభావం లేని స్వేచ్ఛకు ప్రయోజనముండదు. స్వేచ్ఛలేని సమానత్వం నశిస్తుంది. స్వేచ్ఛా సమానత్వాలున్నచోట సంపదలు వృద్ధి అవుతాయి.
2. ఎత్తు పల్లాలున్నచోట బండి కుదుపులు లేకుండా, ముందుకు పోలేదు. అట్లే సమానత్వం లేని చోట స్వేచ్ఛ అనే రథం ముందుకు సాగదు.
3. సమానత్వమంటే లోకాన్నంతాచదును చేయడం కాదు. ఒకరు ఉన్నట్లు మరొకరు ఉండడం కాదు. ప్రజలందరిని సమానంగా ఆదరించడమే నిజమైన సమత.
4. సమతాభావముంటే జాతులు, కులాలు, మతాలనే భేదాలన్నీ సమసిపోతాయి. సమానత్వం లేని లోకం యమలోకంతో సమానమైంది.
5. స్నేహ సంపద లేక మానవజాతి కులభేదాల మధ్య నలిగిపోతూంది. చెలిమి, కలిమి లేక బలముండదు గదా !
6. ఎన్ని మతాలున్నా మానవత్వమొక్కటే. ఎన్ని జాతులున్నా ప్రపంచ మొక్కటే. అట్లే ఎన్ని మార్గాలున్నా చేరవలసిన చోటు ఒకటే.

***5. కింది పదాలను సొంత వాక్యాలలో ఉపయోగించి రాయండి :***

1. సార్థక్యం
2. సర్వజన సమాదరం
3. మానవత్వం
4. పరమార్థం

***6. కింది ఖాళీలను పూరించండి :***

1. సమత లేక స్వేచ్ఛకు __________ ఉండదు.
2. సమత లేని జగతి __________ రా.
3. చెలిమి కలిమి లేక __________ ఉండదు.
4. పథములెన్నియైన __________ ఒక్కటే.
5. సమతయనగ __________ సమాధరంబు.

7. కింది ప్రశ్నలకు సమాధానాలు రాయండి :

1. సమత లేని స్వేచ్ఛ ఎట్లుంటుంది ?
2. స్వేచ్ఛా సమతలున్న ఏమి కలుగుతుంది ?
3. ' సమత ' అంటే ఏమిటి ?
4. సమతవల్ల కలిగే మేలు ఏమిటి ?
5. చెలిమి బలిమి లేకపోతే ఏమవుతుంది ?

8. కింది పదాలకు ముందుండవలసిన అక్షరం రాయలేదు. వాటికెదురుగా అర్థం ఉంది. ఆ అర్థం రావడానికి తగిన అక్షరాన్ని చేర్చండి :

ఉదా :- – పురం = సంసారం = కాపురం.

– పురం = సంసారం. దీనిలో ' పురం 'నకు ' కా ' చేరిస్తే ' కాపురం' అవుతుంది. అంటే సంసారం అని అర్థం వస్తుంది. అలాగే కింది వాటికి చేయండి.

| | |
|---|---|
| —— హారం = తిండి | —— కారం = స్వరూపం |
| —— హారం = చంపడం | —— కారం = చుట్టు గోడ |
| —— హారం = షికారు | —— కారం = మొదలుపెట్టడం |
| | —— కారం = అందంగా లేకపోవడం |

9. ' త ' అనే అక్షరంతో ముగిసే మూడక్షరాలు గల పదాలను కొన్నింటిని రాయండి:

ఉదా :- సమత

10. విద్యార్థులకు సూచనలు :

ఈ పాఠంలో పద్యాలను అన్నింటినీ కంఠస్థం చేయండి.

11. ఉపాధ్యాయినీ, ఉపాధ్యాయులకు సూచనలు :

1. ' సమత ' అనే భావాన్ని వివరించండి.
2. తరగతి గదిలో విద్యార్థులకు జట్టు కృత్యాలు ఇవ్వడంలో, కూర్చుండబెట్టడంలో సమతను పాటించండి.
3. పాఠశాలలో జాతీయ పండుగలు జరిపి, అందరు విద్యార్థులు పాల్గొనేటట్లు చూడండి.

—0—

అసూయ అపోహ లేనివాడే మానవుడు

# 17. ప్రగతి పథంలో స్త్రీ

## (సంభాషణ)

[అందుబాటులో ఉన్న అవకాశాలను వినియోగించుకోవాలి. బాగా చదువుకోవాలి మనోవికాసం కలిగించుకోవాలి. దీనివల్ల స్త్రీల పరిస్థితి మెరుగవుతుందని చాటిచెప్పే సంభాషణ]

**పాఠంలో ముఖ్యమైన పదాలు :**

| | | |
|---|---|---|
| ప్రగతి | పోరాటం | పరిపాటి |
| పథం | ప్రస్తావించు | ఆదర్శప్రాయులు |
| వసారా | ఏర్పాటగు | వికాసం |
| ఘనకార్యం | మధ్యతరగతి | గృహవిజ్ఞానం |
| నిస్వార్థం | ఉన్నతవర్గం | సాంకేతిక విద్య |

* * *

(వేదవతి ఇంటి వసారాలో బియ్యంలో రాళ్ళేరుతూ కూతురు గౌరితో మాట్లాడుతోంది. గౌరి లోపల దినపత్రిక చూస్తోంది)

వేదవతి : అమ్మా గౌరీ ఏం చేస్తున్నావమ్మా ?

గౌరి : (లోపలనుంచి) హోంవర్కు చేసేశాను. ఈ రోజు పత్రికలో బొమ్మ ఒకదాన్ని చూస్తున్నాను.

వేదవతి : అట్లాగా ఒక్కసారి ఇట్లారా ఈ రోజు దాని గురించి నీ చెప్పాలి.

(లోపల్నుంచి గౌరి ఆ పత్రికతోసహా వచ్చింది)

గౌరి : ఏమిటమ్మా అది ఈ బొమ్మ గురించేదో చెపుతానన్నావు ?

వేదవతి : ఆడపిల్లలు అన్ని రంగాల్లోనూ ఎంతటి ఘనకార్యాలు సాధించారో తెలియడం కోసం ఈ వ్యాసం బొమ్మతోసహా వేశారు తెలుసా ?

గౌరి : అట్లాగా అమ్మా ! (పత్రికలోని బొమ్మను చూపుతూ) వీరందరూ ఏం చేశారమ్మా ?

వేదవతి : విను మరి ! ఈ బొమ్మలో ఉన్నవారు శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్, కవయిత్రి సరోజినీనాయుడు, నిస్వార్థ సేవకురాలు మదర్ థెరీసా. మరి ఇందులో మనకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత స్త్రీల స్థితిలో వచ్చిన మార్పు, స్వాతంత్ర్య పోరాట సమయంలో స్త్రీలు తోడ్పాటునివ్వడం మొదలైన విషయాలను ఇందులో ప్రస్తావించారు.

గౌరి : ఇదివరకు ఆడవాళ్ళ స్థితి ఎట్లా ఉండేదమ్మా ?

వేదవతి : స్త్రీల పరిస్థితి పూర్వం ఏమాత్రం బాగుండేది కాదు.

గౌరి : మరి వాళ్ళలో మార్పెట్లా వచ్చింది ?

వేదవతి : దేశం బ్రిటిష్‌వారి పాలనలో ఉన్నప్పుడు జరిపిన పోరాటంలో అప్పుడప్పుడూ స్త్రీలు పాల్గొన్నారు. మన దేశానికి పూర్తిగా స్వాతంత్ర్యం లభించిన తర్వాత పరిస్థితిలో బాగా మార్పు వచ్చింది.

గౌరి : అదెలా మొదలయింది ?



వేదవతి : మనదేశం ఏర్పాటయ్యాక విద్య విషయంలో స్త్రీల స్థితి మెరుగయింది. మగవారితోపాటు ఆడపిల్లలు చదవడం పరిపాటి అయింది. స్త్రీలు చదువుకుంటే వారి బిడ్డలు ఆదర్శపౌరులుగా తీర్చిదిద్దగలమనే నమ్మకం ఏర్పడింది. క్రమేపీ జరిగిన మనోవికాసంవల్ల స్త్రీలు ఉన్నతవిద్యను అభ్యసించారు. గృహవిజ్ఞానం నుంచీ సాంకేతిక విద్యవరకు స్త్రీలు వారి అభిరుచిని బట్టి చదివే అవకాశాలు లభించాయి. వైద్యవిద్యను చదివినవారూ అధికంగానే ఉన్నారు.

గౌరి : మరి రాజకీయాల్లోనూ, సాంస్కృతిక రంగంలోనూ, ఆడవాళ్ళు అభివృద్ధి సాధించారా అమ్మా ?

వేదవతి : అవును. శ్రీమతి ఇందిరాగాంధీ వంటివారు రాజకీయాల్లోనూ, శ్రీమతి ఎమ్. ఎస్. సుబ్బలక్ష్మి వంటివారు సంగీతంలోనూ, శ్రీమతి రుక్మిణీ అరండేల్ వంటివారు నృత్యంలోను పురోగమించి స్త్రీ సాధించిన ప్రగతికి ఆదర్శప్రాయంగా నిలిచారు.

గౌరి : అయితే మరి మన పనిపిల్ల లక్ష్మి కొద్దిగా చదువుకుంది కానీ వాళ్ళమ్మాయిని బడికి పంపించదేం ?

వేదవతి : చాలా చక్కటి ప్రశ్నవేశావు. లక్ష్మిలాంటి వాళ్ళకు అందరూ పని చేస్తేనేకాని ఇల్లు గడవదు. అయినా తీరికవేళల్లో కూర్చోబెట్టి తనే చదివిస్తుంటుంది. ఆ అమ్మాయీ శ్రద్ధగా చదువుకుంటోంది. లక్ష్మిలాంటి కుటుంబాలు దేశంలో ఎన్నో ఉన్నాయి. క్రమేపీ అందరూ చదువు నేర్చుకుంటారు.

అందుబాటులో ఉన్న ప్రతి అవకాశం వినియోగించుకొని బాగా చదువుకొని మనోవికాసం కలిగించుకోవాలి. దానికి పట్టుదల, కృషి జతపడితే దేన్నయినా సాధించవచ్చు.

గౌరి : అయితే నేనూ బాగా చదువుకొని చురుకుదనంతో పైకి వస్తాను.

(ఇద్దరూ లోపలికి వెళ్ళారు)

## అభ్యాసవేదిక

***1.* అర్థాలు :**

ఘనకార్యం = గొప్పపని ; పోరాటం = యుద్ధం; పరిపాటి = అలవాటు; ప్రస్తావించు = పేర్కొను; పురోగమించు = ముందుకు వెళ్ళు; అభిరుచి = ఆసక్తి.

***2.* క్రింది వాక్యాలను చదివి వాటిలో క్రింద గీతగీసిన పదాలకు అదే అర్థం వచ్చే వేరేపదంతో వాక్యాన్ని తిరిగిరాయండి :**

1. స్త్రీల పరిస్థితి పూర్వం ఏమాత్రం బాగుండేది కాదు.
2. స్త్రీలు వారి అభిరుచిని బట్టి చదివే అవకాశాలు లభించాయి.
3. స్త్రీలు సాధించిన ప్రగతికి ఆదర్శప్రాయంగా నిలిచారు.
4. క్రమేపీ అందరూ చదువు నేర్చుకుంటారు.

*3. పాఠాన్ని చదివి కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :*

1. విను ×
2. పరతంత్ర్యం ×
3. స్వదేశం ×
4. అల్పం ×

*4. కింది పదాలకు ఇచ్చిన వేర్వేరు అర్థాలు గమనించండి :*

కృషి – శ్రమ, వ్యవసాయం

సాధన – ఉపాయం, ఉపకరణం

బంధనం – ముడి, నరం

*5. కింద ఇచ్చిన పదాలను స్వంత వాక్యాలలో ఉపయోగించి రాయండి :*

1. తోడ్పాటు నివ్వడం
2. స్థితి మెరుగవు
3. ఇల్లుగడచు
4. ఆదర్శప్రాయంగా నిలుచు

*6. కింది ప్రశ్నలకు సమాధానం రాయండి :*

1. గౌరి ఏంచేస్తోంది ?
2. వేదవతి ఎవరిగురించి వివరించింది ?
3. దేశంలో స్త్రీల స్థితులలో ఎప్పటినుంచి మార్పు కనిపించింది ?
4. మనోవికాసానికి తోడ్పడేదేమిటి ?
5. అన్ని రంగాల్లో ఉన్న స్త్రీలను ఉదాహరణలతో వివరించండి.

*7. కింద ఇచ్చిన ఖాళీలను సరయిన పదంతో పూరించండి :*

1. ఈ రోజు ______ లో బొమ్మ ఒకదాన్ని చూస్తున్నాను.
2. ఇదివరకు ______ స్థితి ఎట్లా ఉండేదమ్మా ?

3. మన దేశానికి పూర్తిగా స్వాతంత్ర్యం లభించిన తర్వాత పరిస్థితిలో __________ వచ్చింది.
4. __________ ఏర్పాటయ్యాక విద్య విషయంలో స్త్రీల స్థితి మెరుగయింది.
5. __________ కూర్చోబెట్టి తనే చదివిస్తుంటుంది.

8. కింద ఇచ్చిన వాక్యాలను 'అటం', 'వల్ల' ఉపయోగించి ఏకవాక్యంగా మార్చండి :

నమూనా :- నేను ఎక్కువగా మాట్లాడాను.
అందువల్ల రవికి కోపం వచ్చింది.
నేను ఎక్కువగా మాట్లాడటం వల్ల రవికి కోపం వచ్చింది.

1. గిరి వెంటనే రాలేదు, అందువల్ల అతనికి టికెట్లు అందలేదు.
2. అతను ఎక్కువగా నడిచాడు, అందువల్ల కాళ్ళు నెప్పులుగా ఉన్నాయి.
3. ఆమె నేను చెప్పిన మాట వినలేదు, అందువల్ల ఆమెకు నష్టమయింది.
4. రవి ఇంట్లో లేడు, అందువల్ల నేనతనితో మాట్లాడలేకపోయాను.
5. అతను చెప్పిన పని కాలేదు, అందువల్ల అతనికి సంతోషం కలిగింది.

9. ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులకు సూచనలు :

1. ఈ సంభాషణను విద్యార్థులచేత చెప్పించాలి.
2. స్థానికంగా ఉండే ప్రముఖ స్త్రీల పేర్లు వారు సాధించిన విజయాలను, చేసిన సేవలు వివరించాలి.

—0—

# 18. బాల సేవాసంఘం

## (లేఖ – సమాధానం)

[ఉత్తరాలు రాసే పద్ధతులను మనం నేర్చుకోవడం ఎంతో అవసరం. ఈ పాఠంలో బాల సేవాసంఘంకు సంబంధించిన ఒక లేఖ, దానికి సమాధానం ఉన్నాయి.]

**పాఠంలో ముఖ్యమైన పదాలు :**

| | | |
|---|---|---|
| సేవాసంఘం | సంజ్ఞ | తాకీడి |
| జయప్రదం | క్రమశిక్షణ | సేవలందించు |
| కార్యకలాపాలు | గాయపడు | ఆదరభావం |
| నిర్వహించు | పంచిపెట్టు | ఇబ్బందిపడు |

* * *

చిరంజీవి పవనకుమార్ కి, నక్కావారిపల్లె,
ఆశీస్సులు. 30-7-1993.

మేం క్షేమంగానే ఉన్నాం. నువ్వూ, అమ్మా నాన్న క్షేమంగా ఉన్నారు కదా ! మీ అమ్మమ్మ అక్కడినుంచి క్షేమంగా వచ్చి ఇల్లు చేరింది. నువ్వేదో మీ పాఠశాలలో సేవాసంఘం ఉందనీ, దానిలో నువ్వు పాల్గొంటున్నావనీ ఆ సంఘం పక్షాన పై వారం ఎక్కడికో వెళుతున్నావని ఆమె చెప్పింది. నీ ఖర్చులకోసం ఒక వందరూపాయలు పంపుతున్నాను. మీ పాఠశాలలో ఉన్న సేవాసంఘం గురించి వివరంగా నాకు రాయి.

ఇట్లు
మీ తాతయ్య
రామకృష్ణయ్య

చిరునామా :
చి ॥ పవనకుమార్,
కేరాఫ్ శ్రీ పాపారావు
15/2 దాసరివారి వీధి
విజయవాడ
పిన్. 502 010.

విజయవాడ,
6-8-1993.

ప్రియమైన తాతయ్యకు,

నమస్కారాలు.

మేము క్షేమం. మీ ఉత్తరం అందుకున్నాను. డబ్బు పంపినందుకు చాలా సంతోషంగా ఉంది.

మా పాఠశాలలో ఉన్న సేవాసంఘం గురించి రాయమన్నావు కదా ! ఇటువంటివి ఇక్కడ కొన్ని పాఠశాలల్లోనే ఉన్నాయి. క్రితం సంవత్సరం హైదరాబాదులో జరిగిన అల్లర్ల సందర్భంలో అంతకుముందు విజయవాడలో జరిగిన గొడవల తర్వాత ఈ సంఘం తన కార్యక్రమాలను జయప్రదంగా నిర్వహించింది.

పాఠశాలలో ఉండే ఈ సేవాసంఘాన్ని మేము మా స్కూలు పేరిట బాల సేవాసంఘం అని పిల్చుకుంటున్నాం. ఈ బాల సేవాసంఘంలో పాఠశాల విద్యార్థులు సభ్యులు కావచ్చు. అందరికీ సేవ చేద్దామన్న భావన ఈ సంఘం కల్పిస్తుంది. ఈ సేవాసంఘంలో ఉండేవారు విద్యార్థులు కావడంవల్ల వీరిని బాలసేవకులని పిలుస్తాం. సాధారణంగా బాలసేవకులు బృందంగా చేరి సేవాకార్యకలాపాలు నిర్వహిస్తుంటారు.

నేనుకూడా మా పాఠశాల సేవాసంఘంలో సభ్యుడినే. బాల సేవాసంఘంలో ఉన్నవారందరం కార్యక్రమం నిర్వహించేప్పుడు ఒకే రకమయిన దుస్తులు ధరిస్తాం. అవసరం వస్తే ఈలలతోనూ, చేతి సంజ్ఞలతోనూ మాట్లాడుకోగలం. మా సంఘంలో ఉండే క్రమశిక్షణను అందరూ మెచ్చుకుంటారు.

ఇక్కడ అల్లర్లు జరిగినప్పుడు గాయపడినవారిని వైద్యశాలలో చేర్చారు. అప్పుడు వారికి విరాళాల ద్వారా సేకరించిన ధనంతో పాలు, పళ్ళూ పంచిపెట్టాం. వస్తువులను పేదలకు పంచి ఇచ్చాం. అట్లాగే హైదరాబాదులో

అల్లర్లు జరిగినప్పుడు అక్కడికి వెళ్ళాం. అల్లర్లలో గాయపడినవారిని వైద్యశాలలో పరామర్శించి వారికి పాలు పళ్ళూ, రొట్టెముక్కలు పంచాం. వారిలో హిందువులూ ఉన్నారు. మహమ్మదీయులూ ఉన్నారు. అట్లాగే ఇక్కడ విజయవాడలో వర్షాలు ఎక్కువగా పడి వరదతాకిడికి గురయిన మురికివాడల్లోనూ, లంకప్రాంతాల్లోనూ సేవలందించాం. ఎవరికయినా గాయాలు తగిలితే, ప్రథమ చికిత్స చేశాం. ఏ వేళలోనయినా సరే అందరికీ సహాయపడటం మా సేవాసంఘం ఉద్దేశం.

బాలసేవకులకు ఇతరులపట్ల విశేషమైన గౌరవం, దయ ఉండాలని మా మాష్టారుగారు మాకు బోధించారు. ఏ మతం వారయినా మేము ఆదరభావం ప్రకటిస్తాం.

పై వారం మేము భద్రాచలం దగ్గర ఉండే కూనవరం దగ్గరకు వెళుతున్నాం. గోదావరి వరదలకు అక్కడి ప్రజలు ఎంతో ఇబ్బంది పడుతున్నారని మా మాష్టారు చెప్పారు. అక్కడికి వెళ్ళి మా సేవాసంఘం క్యాంపు ముగిసిన తర్వాత మళ్ళీ ఉత్తరం రాస్తాను. అందులో మరికొన్ని విశేషాలు రాస్తాను. అమ్మమ్మకు నా నమస్కారాలు.

ఇట్లు
మీ మనుమడు,
పవనకుమార్.

చిరునామా:
శ్రీరామకృష్ణయ్య,
కరణంవారి వీధి,
నక్కావారిపల్లె,
భట్టిప్రోలుమండలం,
కృష్ణాజిల్లా.

## అభ్యాసవేదిక

**1. అర్థాలు :**

పక్షాన = వైపున; తాకిడి = ప్రమాదం; బృందం = సమూహం; ఆదరం = గౌరవం; సంజ్ఞలు = గుర్తులు; క్రమశిక్షణ = ఒకపద్ధతి ప్రకారం నడవడం.

**2. పాఠాన్ని చదివి కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :**

1. తాతయ్య ×
2. అగౌరవం ×
3. తక్కువ ×
4. నిర్దయ ×

**3. కింది పదాలను స్వంత వాక్యాల్లో ప్రయోగించండి :**

1. గాయపడు
2. సేవలందించు
3. ఇబ్బందిపడు
4. పంచిపెట్టు
5. నిర్వహించు

**4. కింది ప్రశ్నలకు జవాబు రాయండి :**

1. పవనకుమార్‌కి తాతయ్య ఎంత డబ్బు పంపాడు ?
2. బాల సేవాసంఘం అంటే ఏమిటి ?
3. బాలసేవకులను ఆ విధంగా ఎందుకు పిలుస్తారు ?
4. బాలసేవకులు ఇతరులకు ఏ విధంగా సహాయపడుతుంటారు ?
5. బాల సేవాసంఘంవల్ల విద్యార్థుల్లో ఎటువంటి లక్షణాలు అలవడుతాయి ?

5. కింది వాక్యాలలో ఖాళీలను సరయిన పదాలతో పూరించండి :

1. అందరికీ __________ భావన సంఘం కల్పిస్తుంది.
2. మీ అమ్మమ్మ __________ వచ్చి చేరింది.
3. ఏ వేళలోనయినా సరే __________ మా సేవాసంఘం ఉద్దేశం.
4. __________ మేం ఆదరభావం ప్రకటిస్తాం.

6. ఈ కింది అక్షరాల నుపయోగించి వీలయినన్ని రెండక్షరాల, మూడక్షరాల పదాలను రాయండి :

| | | |
|---|---|---|
| స | దా | మ |
| ము | పా | ల |
| క | శ | య |
| ఆ | గ | న |
| ట | స | త |

నమూనా :- పాము, మునక

7. కింద సూచించిన నమూనాలో వాక్యాలను రెండు విధాలుగా రాయండి :

రవి నువ్వు అడిగితే పుస్తకం ఇస్తాడా ?

(a) రవి నేను అడిగినా పుస్తకం ఇవ్వడు.

(b) రవి నేను అడగకపోయినా పుస్తకం ఇస్తాడు.

1. సమీర నువ్వు పిలిస్తే సినిమాకు వస్తుందా ?
2. వాళ్ళు డబ్బులు ఇస్తే లోపలికి పోనిస్తారా ?
3. శారద వస్తే ఈ పని పూర్తి అవుతుందా ?
4. నువ్వు చెప్తే వాళ్ళు ఒప్పుకుంటారా ?

8. ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులకు సూచనలు :

1. ఉత్తరాలు రాయడంలో తేడాలు చూపిస్తూ మిత్రులకు, బంధువులకు విద్యార్థులతో సాధన చేయించాలి.
2. ఉత్తరంలో ఊరిపేరు, తేదీ, సంబోధన, ప్రారంభంలో ముగింపులో ఓపునామా రాస్తూ, పిన్ కోడ్ వేయించడం ఎలాగో చూపించాలి.
3. కార్డు, కవరు వెల, ఇన్ లాండ్ కవరు ధరలను తెలుపుతూ ఇదివరలో ఎలా వుండేవో వివరించాలి.
4. చుట్టుపక్కల జరిగిన సంఘటనలు వివరిస్తూ, విద్యార్థులు ఏ విధంగా ప్రవర్తించాలో, జాతీయ సమైక్యత అవసరాన్ని గురించి సూచించాలి.
5. అవకాశాన్నిబట్టి బాల సేవాసంఘం స్థాపించి, సేవలో శిక్షణ ఇవ్వాలి.

—o—

వీధుల్లో అమ్మే మూతలులేని అపరిశుభ్రమైన తినుబండారాలు తినకూడదు

# 19. సుభాషితరత్నాలు

## (కంఠస్థం చేయాల్సిన పద్యాలు)

**పద్యాలలో ముఖ్యమైన పదాలు :**

| | | | |
|---|---|---|---|
| కుత్సితుండు | లవణం | తండోపతండంబు | తథ్యము |
| కుంభం | పరతత్త్వం | పోరు | సన్నిభులు |
| తనుజాలు | పాపు | ఇంపు | దొడ్డగ |
| గొగ్గలైన | పూరిత | ఇంచుక | హంస |
| మాధురి | కొఱగామి | ఉర్వి | |

* * *

వేఱు పురుగు చేరి వృక్షంబు చెఱచును,
చీడపురుగు చేరి చెట్టు చెఱచు,
కుత్సితుండు చేరి గుణవంతు చెఱచురా
విశ్వదాభిరామ, వినురవేమ ! 1

కుండ కుంభమన్న కొండ పర్వత మన్న
ఉప్పు లవణ మన్న ఒంటి కాదె ?
భాషలిట్టె వేరు పరతత్త్వ మొక్కటే
విశ్వదాభిరామ, వినురవేమ ! 2

తప్పు లెన్ను వారు తండోప తండంబు
లుర్విజనులకెల్ల నుండు తప్పు;
తప్పు లెన్నువారు తమ తప్పు లెరుగరు;
విశ్వదాభిరామ, వినురవేమ ! 3

చెప్పులోని ఱాయి, చెవిలోని జోరీగ,
కంటిలోని నలుసు, కాలిముల్లు,
ఇంటిలోని పోరు ఇంతింత గాదయా ;
విశ్వదాభిరామ, వినురవేమ ! 4

నిక్కమైనమంచి నీలమొక్కటిచాలుఁ
దళుకుబెళుకు రాలుతట్టెడేల
చదువ పద్య మరయఁ జాలదాయొక్కటి
విశ్వదాభిరామ, వినురవేమ ! 5

చిత్తశుద్ధికలిగి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియుఁ గొదువకాదు
విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకునెంత
విశ్వదాభిరామ, వినురవేమ ! 6

తన కోపమె తన శత్రువు,
తన శాంతమె తనకు రక్ష దయచుట్టంబౌ,
తన సంతోషమె స్వర్గము,
తన దుఃఖమె నరక మండ్రు తథ్యము సుమతీ ! 7

కొంచెపు నరు సంగతిచే
నంచితముగఁ గీడు వచ్చునది యెట్లన్నన్
గించిత్తునల్లి కుట్టిన
మంచమునకుఁ జేటువచ్చుమహిలో సుమతీ ! 8

కష్టపెట్టబోకు కన్నతల్లిమనసు,
నష్టపెట్టబోకు నాన్నమనసు,
తల్లిదండ్రులన్న దైవసన్నిభులురా,
లలిత సుగుణజాల ! తెలుగుబాల ! 9

పూరిత సద్గుణంబుగల పుణ్యున కించుక రూపసంపదల్
దూరములైన వానియెడ దొడ్డగ చూతురు బుద్ధిమంతు లె
ట్లారయ; గొగ్గులైన మఱి యందుల మాధురి చూచికాదె ఖ
ర్జూర ఫలంబులన్ ప్రియము చొప్పడ లోకులు గొంట భాస్కరా. 10

**అభ్యాసవేదిక**

**ఉపాధ్యాయులకు సూచనలు :**

I. కిందిపదాలను విద్యార్థులకు వివరించండి.

1, 2, 3, 4, 5, 6 పద్యాలు వేమన శతకంలోవి. ఈ శతకాన్ని రాసిన వారు 'వేమన'.

కుత్సితుడు = గుణహీనుడు; విశ్వదాభిరామ ! = విశ్వద + అభిరామ ! = విశ్వకర్త అయిన పరమాత్మునిచే మనోజ్ఞమైనవాడా !

పరతత్త్వము = పరమమైన లక్షణం, పరమార్థం; ఫలితార్థం

తండోపతండములు = గుంపులు గుంపులు

7, 8 పద్యాలు : సుమతి శతకంలోవి. ఈ శతకాన్ని రాసినవారు 'బద్దెన'.

9. ఈ పద్యం 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్య శాస్త్రి రచించిన "తెలుగుబాల" లోది. లలిత సుగుణజాల ! తెలుగుబాల ! = సుకుమారమైన ఎన్నో మంచి గుణములు గల ఓ తెలుగు బిడ్డా !

10. 'భాస్కర శతకము' మారద వెంకయ్య విరచితం.

II. ఉపాధ్యాయులు పద్యాలలోని భావం విద్యార్థులచేత వారి సొంత మాటలలో చెప్పించాలి.

III. పై పద్యాలను విద్యార్థులచే కంఠస్థం చేయించాలి.

IV. పద్యాలు కంఠస్థం చేయడమేగాక, వల్లెవేయటంలో బాలబాలికలకు పోటీ నిర్వహించాలి.

—o—

ఆదర్శాలు వల్లించేవానికి ఆచరణకూడా తెలియాలి

# 20. పుట్టినరోజు పండుగ
## (నాటిక)

['వెట్టిచాకిరి' అనేది సంఘానికి మాయనిమచ్చ. బాలలతో వెట్టి చేయించడం, పిల్లలను కార్మికులుగా వినియోగించడం మానవత్వానికి తీరని కళంకం అని చాటే నాటిక.]

**పాఠంలో ముఖ్యమైన పదాలు :**

| | | |
|---|---|---|
| వెట్టిచాకిరి | తీరని కళంకం | బాకీ |
| మాయనిమచ్చ | దిద్దబెట్టు | జీతంచేయు |
| కార్మికులు | చీకటితోలేచు | పెయ్య |
| మానవత్వం | జీతంగింజలు | ఖర్చుపెట్టు |

* * *

**పాత్రలు :**

రాజు - ఒక అబ్బాయి; ప్రసాద్ - రాజు తండ్రి;

రత్నం - రాజు తల్లి; విశ్వం - రాజు మేనమామ;

సుబ్బన్న - ప్రసాద్ ఇంట్లో పనిచేసే కుర్రవాడు;

గంగన్న - సుబ్బన్న తాత.

(రాజు మామూలు డ్రెస్‌లో నీట్‌గా ఉంటాడు. సుబ్బన్న బీదరికాన్ని సూచించే డ్రెస్‌లో ఉంటాడు. అంటే ఒక చిన్న లాగు మటుకు ఉంటుంది. చింపిరి జుట్టు. రాజు పలకా బలపం తెచ్చి)

రాజు : సుబ్బన్నా.

సుబ్బన్న : (చేతిలో తట్ట గొడ్డలితో వచ్చి) ఏంటి సినదొరా !

రాజు : ఇదిగో — నా పుట్టినరోజు సందర్భంలో నీకోసం పలక, బలపం తెచ్చాను. ఓనమాలు దిద్దబెడతా రా !

సుబ్బన్న : అమ్మో ! ఇప్పుడ్యాడి సదువులేం ? ఇంట్ల శనా పనుండాది. పొయిలకు పుల్లలు కొట్టాలె, అంట్లు తోవాలె, పాలు బిండాలె, గడ్డికిపోయి రావాలె, గొడ్లకాడి పేడ దియ్యాలె. శనా పనుండాది.

రాజు : ఆ ఆ పనులు రోజూ ఉండేవే లెద్దూ, దిద్దబెడతా; ఒకసారి చూసిరాయి. పలకా బలపం దాచుకో.



సుబ్బన్న : మీకు తెలవదు సినదొరా ! అమ్మగారు జూస్తే కొట్టనే కొడ్తరు.

రాజు : నువ్విట్రా సుబ్బన్నా ! (సుబ్బన్న దగ్గరికొస్తాడు) ఏమిటి ? ఇవాళ చాలా నీరసంగా ఉన్నావు ?

(సుబ్బన్న మాట్లాడడు)

రాజు : ఏం సుబ్బన్నా ! మా...డవేం ?

(సుబ్బన్న వెక్కి వెక్కి ఏడుస్తాడు)

రాజు : అదేమిటి సుబ్బన్నా ! ఏడుస్తావెందుకు ? మా అమ్మేమైనా కొట్టిందా ? (కొట్టలే... తల ఊపుతాడు)

రాజు : చూడు సుబ్బన్నా ! నువ్వు చీకటితో లేచి పది గంటల దాకా కాఫీ అయినా తాగకుండా పనిచేస్తావు, నీకు ఆకలెయ్యదూ ? (సుబ్బన్నకు ఇంకా దుఃఖం వస్తుంది)

సుబ్బన్న : నాకు కాపెందుకు సిన...రా ? (మరీ ఏడుపు) నిన్నటి సంది బువ్వే ...దు దొరా. ఉపాసం.

రాజు : అరరేపాపం ! ఏం నా... జీతం గింజలియ్యలేదా ?

సుబ్బన్న : నాకు జీతం రాదు గద ...నదొరా ! తాతలనాటి బాకీకింద జీతం చేస్తున్న.

రాజు : ఏమిటి మీ తాత బాకీ...ద నువ్వు జీతం చేస్తున్నావా ?

సుబ్బన్న : ఔ, సినదొరా ! ఇరవై ఏండ్లసంది మా తాత తమకాడ జీతం జేసుకుంట వస్తే అమ్మగారి కాడ అప్పుదీసుకుండంట. ఆ అప్పు మా అమ్మ అయ్య...కొచ్చిన రోగాలకు కర్సు బెట్టిండంట. ఆ కర్సుకు మా ఆవు ...య్యనమ్మినా ఆల్లరోగాలు నయంగాక సచ్చిపోయిన్రంట. అమ్మగారి అప్పు అట్నే మిగిలిందంట. మాతాతకు పనిసేతగా...ంటె నేను జీతానికొస్తున్న సినదొరా ! ఇంగ నాకు జీతం ఎ...స్తది.

రాజు : మరి నీకు గింజలు రాకుంటే అన్నం ఎట్లా తింటావు ?

కృష్ణాజిల్లా.

సుబ్బన్న : సేతనైతే మా తాత కట్టెలమ్ముకొస్తడు. అయ్యి అమ్మడయి గింజలొస్తే తింటం, లేకుంటే ఏం లేదు.

రాజు : అయితే నువ్వు కడుపు మాడ్చుకుంటూనే పనిచేస్తున్నా వన్నమాట ! నాకీ సంగతే తెలియదు సుబ్బన్నా !

రత్నం : (చేతిలో పెద్ద బిందెతో వస్తూ) ఏరా సుబ్బిగా ! ఇక్కడే ఉన్నావూ ? నాకు తెలుసు నేను అరవందే ఈ ఇంట్లో ఎవరూ పనిచెయ్యరని. ఇవేళ చిన్నదొర పుట్టినరోజు పండగని చెప్పావ్రా ?

సుబ్బన్న : సెప్పిన్రు దొరసాని !

రత్నం : అయినా నన్ను అరిపించాలని ఇట్లా నిలబడ్డావన్న మాట. ఎన్నో పనులున్నాయి. గుడ్లు మిటకరిస్తూ నిలబడితే పని కాదు. పనికి ఒళ్ళొంచాలె, వెళ్ళు (సుబ్బన్న వెళ్ళిపోతాడు) (రాజుతో) ఏరా వాడంటే పరాయివాడు, నీవన్నా కాస్త పోయి ఉండొద్దూ. పుట్టినరోజు పండుగ నీదనుకున్నావా ? నాదా ?

రాజు : నాకేం తెలుసమ్మా నాదని ! మీరేగా కావాలని చేస్తున్నారు.

రత్నం : చాల్లే చదువు. తలంటి పోసుకుందువుగాని ! (రాజు వెడతాడు) అరే సుబ్బిగా నీళ్ళు తోడడం అయిందా ? వస్తున్నా అబ్బబ్బ నాకు తెలుసు. నేను అరవంది ఈ ఇంట్లో ఎవరూ పని చెయ్యరని.

ప్రసాద్ : (కొత్త బట్టలతో వస్తూనే) ఏయ్‌- ఇదిగో నీవు అరవకుండానే అబ్బాయికి కొత్తబట్టలు తెచ్చాను మరి.

రత్నం : సరే, మంచిపని చేశారుగానీ కాస్త మీరు కూడా స్నానం చేయండి.

ప్రసాద్ : ఎప్పుడో చేశాగదే !

రత్నం : అవును కదూ ! హడావుడిలో మరిచేపొయ్యాను. అయినా చీకటితో లేచి అరిస్తే తెల్లారాకగాని స్నానం చెయ్యలేదు. ఎలాగూ నా అరుపు తప్పిందా ఏమిటి ? నాకు బోలెడు పనుంది. సుబ్బిగా అలాగే నిలబడ్డావా ? పొయ్యి కింద మంట భగభగ మండుతున్నదా ? (దుస్తులు కుర్చీమీద వేసి లోనికెళ్లబోతుండగా విశ్వం వస్తాడు)

విశ్వం : ఏమి బావగారూ ! క్షేమమే కదా ?

ప్రసాద్ : అరరే విశ్వం ! నువ్వెప్పుడొచ్చావోయ్ ?

విశ్వం : ఇదేమి బావగారు ! పరిహాసమా ఏమి ? ఇప్పుడే కదా వచ్చుచుంటిని.

ప్రసాద్ : అలాకాదులే నేను ఇప్పుడే బజారునుంచి వస్తున్నాను. నువ్వు ఎప్పుడో వచ్చావనుకుంటున్నాను. రత్నం ! రత్నం.

రత్నం : (వస్తూనే) అబ్బబ్బ ఎందుకండీ అరుస్తారు ? ఏం కావాలి ? మీ వస్తువులు కనబడటం లేదా ? నాకు తెలుసు నేను చూసిపెట్టందే ఈ ఇంట్లో ఎవరూ ఏమి చేయలేరని.

ప్రసాద్ : అయిపోయిందా నీ దండకం. కాస్త ఉపన్యాసం ఆపి అటుచూడు మీ తమ్ముడొచ్చాడు. తమ్ముడు విశ్వం.

రత్నం : అదేమిట్రా విశ్వం ! లోపలికి రాకుండా కొత్తవాడిలాగే ఉండిపోయావేమిట్రా ! అంతా బాగున్నారా ? ఇంతకూ వాడి కాళ్ళు కడుక్కొనేందుకు నీళ్ళిచ్చారా లేదా ?

విశ్వం : అక్కగారూ ! నాకాపాతకాలపు పద్ధతులక్కర్లేదు కాళ్ళకు బురద ఏమియు అంటలేదు.

రత్నం : అట్లాయితే తలంటు పోసుకుందువుగాని రా! అల్లుడి పుట్టినరోజు పండుగగా మరి !

విశ్వం : స్నానము చేసియే బయలుదేరితిని అక్కగారూ !

రత్నం : నీ మొహం నువ్వూ నీ భాష. వాడి భాష వింటూ అలాగే నిలబడ్డారేమిటండీ వాడిని తీసుకొని ఫలహారానికి రారేమిటి లోపలికి. రండి !

(లోనికి వెడుతుంది)

ప్రసాద్ : పదవోయ్ విశ్వం ! ఫలహారమన్నా చెయ్యండిక. ఇక నీ అక్కయ్య ఊరుకోదు.

విశ్వం : అటులనే, ఉపాహారానికి ఇరువురము బావగారూ !

ప్రసాద్ : ఏమిటోయ్ ఆ కృతక భాష ? అంతా వ్యావహారికం కావాలనుకుంటూ ఉంటే నువ్వు గ్రాంథికంలోకి వెడుతున్నావేమిటి ?

విశ్వం : చెప్పినది చేయక పోవుటయేగదా నేటి యుగధర్మము. మాట వరుసకు మీరు శాసనసభలో ప్రజలు అమలుజరుపుటకు అనేక చట్టములను ప్రవేశపెట్టుచుంటిరి. కాని వాటిని మీరు అమలు జరుపుదురా ఏమి ? వరకట్న నిషేధము ప్రవేశపెట్టితిరి. భూసంస్కరణలు ప్రవేశ పెట్టితిరి. వెట్టి చాకిరీని నిషేధించితిరి. అవి అమలుజరుపుడని లేనిచో శిక్షింపబడుదురని ప్రజలను

బెదిరించుటయేగాని మీరు స్వయముగా అమలు జరుపుచుంటిరాయేమి ?

ప్రసాద్ : చాల్లే చాల్లే నిన్ను కదిలించడం నాదే బుద్ధితక్కువ. పద పద ఫలాహారానికి. అక్కయ్య అరుస్తుంది.

(విశ్వం, ప్రసాద్ వెళ్ళబోతుండగా గంగన్న తట్టతో వస్తాడు. ప్రసాద్ అడుగుతాడు)

ప్రసాద్ : ఏమిట్రా గంగా ఇలా వచ్చావు ?

గంగన్న : గింజలు దొరా !

ప్రసాద్ : ఎక్కడి గింజలురా ?

గంగన్న : ముంగల్నే తిన్నం లేరి గని దొరా ! విన్నాయియ్యాల సేతగాక నేను కట్టెలకు పోలేదు దొరా ! నేను బువ్వలేకున్నా తట్టుకులేస్తగని చంటోడు సుబ్బిగాడు తట్టుకోలేడు దొరా ! తల్లిదండ్రి లేనోడు ఆడి గోసచూడలేను పటుమానికెలు ఇప్పియ్యురి.

ప్రసాద్ : ఇప్పటికే ఎక్కువ మయ్యాయి తెలుసా ?

గంగన్న : అంతేలేరి. తమరి బాకీకింద ఇంకా ఎన్నాళ్ళు జీతం చెయ్యాలె దొరా ?

ప్రసాద్ : ఏడాదని నువ్వేగదరా అన్నావు.

గంగన్న : అన్నలేరిగని దొరా ! ఎట్టగేని అంతవాడ్డీ జర తీసెయ్యాలె దొరా !

ప్రసాద్ : అదంతా నాకు తెలియదు.

గంగన్న : అంతే లేరిగని దొరా. ఇరువై యేళ్ళసంది తవరి పాదాలకాడ బతుకుతుండం. జర కాపాడాలే !

ప్రసాద్ : అందుకే ఏడాది తగ్గింపు అయినా అదంతా నాకేమి తెలియదన్నాగా (వెళ్ళబోతుంటే)

గంగన్న : దొరా 5 మానికెలన్న సెలవిప్పియ్యిరి.

ప్రసాద్ : అరే గంగా అనవసరంగా నాకు కోపం తెప్పించకు అయిదు మానికలు కావు కదా ! అయిదు గింజెలు లేవు. చేస్తారా ఏడాది జీతం చెయ్యండి. లేకుంటె ఆ రూపాయలు వడ్డీతో తీసుకొన్న అప్పు కట్టిపొండి.

గంగన్న : డబ్బుల్యాడ తెస్తంలేరి దొరా ! జీతాలే చేసి తవబాకీ తీర్చుకుంటం. (ప్రసాద్ లోనికి వెళతాడు. గంగన్న బయటికి వెళ్ళబోగా సుబ్బన్న వస్తాడు)

సుబ్బన్న : తాతా కన్లు తిరుగుతుండయే.

గంగన్న : కడుపుల బువ్వ లేకుంట కన్లు దిరిగి గేరిరాక ఏవైతదారి. ఇంటికి పోదాం పా (సుబ్బన్నను తీసుకుపోబోతుండగా రాజు టీ, టిఫిన్లతో వచ్చి)

రాజు : వెళ్ళకు సుబ్బన్నా.

గంగన్న : ఇప్పుడే వస్త సినదొరా ! ఆనికి ఒంట్లె బాగాలేదు. ఇంట్ల దింపివస్త. ఆనికింద నేను జేస్తలేరి జీతం.

రాజు : ఎవరూ వెళ్ళొద్దు గంగులూ ఇదిగో టిఫిన్, కాఫీ తీసుకోండి.

గంగన్న : మాకా సినదొరా.

రాజు : మీకే గంగులూ ! నిన్నటినుంచి నువ్వూ, సుబ్బన్నా అన్నమే తినలేదట. ఎలా ఉన్నారు పాపం ఇప్పుడివి తీసుకోండి.

గంగన్న : తినాలనే ఉండదిగని . . . పెద్దయ్యగారు, అమ్మగారు ఏమనుకుంటరో ఏమో ?

రాజు : అదేంలేదు ఆ విషయం నేను చూసుకుంటాలెండి. అంతేకాదు. నాన్న నాకోసం తెచ్చిన డ్రస్సుకూడా సుబ్బన్న వేసుకోవాలి.

గంగన్న : ఏందిది సినదొరా ! అమ్మో ఈ డిరుసు ఏస్తే ఇంగ మేము బతికే దుండదా ?

రాజు : మీకే భయమూ లేదని నేను చెప్పానుగా ! సుబ్బన్న తప్పకుండా ఈ డ్రస్సు వేసుకోవాలి. వేసుకో నేనిప్పుడే వస్తాను (రాజు బయటకు వెడతాడు. గంగులు సుబ్బన్నకు డ్రస్సు వేయడంతో తికమకపడుతుండగా ప్రసాద్ వచ్చి కోపంగా)

ప్రసాద్ : ఏం పనిరా ఇది ? వాడు ఇక్కడ పెట్టుకొని వెడితే వాడు లేనిదిచూసి ఆ డ్రస్సు మీరు వేసుకున్నారన్నమాట. ఇలా ఉందన్నమాట మీ పని ? (బెత్తం తెచ్చి సుబ్బన్నను కొట్టడానికి ఎత్తేసరికి రాజు పూలదండతో వచ్చి)

రాజు : ఆగండి నాన్నగారూ ! సుబ్బన్నను కొట్టకండి. వాళ్ళకు ఆ టిఫిన్, డ్రస్సు ఇచ్చింది నేనే ! ఆ బెత్తంతో నన్ను కొట్టండి. (వంగి వీపు అందిస్తాడు)

ప్రసాద్ : రాజూ ఏమంటున్నావు ?

రాజు : నిజమే నాన్నగారూ ! (ఇంతలో తల్లీ, మామా కూడా వస్తారు.) ఈ రోజు ముచ్చటగా నా పుట్టినరోజు పండుగ వేడుక చేస్తున్నారు. ప్రతి పండుగకూ ఏదో వరంలాగా నన్ను మంచి కోరిక కోరుకోమంటున్నారు. ఈసారి కూడా ఒక కోరిక కోరాలని

ఉంది. మీరు శాసనసభ్యులై ఉండి ప్రజలందరి క్షేమంకోరే చట్టాలు ఎన్నో చేస్తున్నారు. అందులో వెట్టిచాకిరీని నిషేధించే చట్టం కూడా ఒకటి. ఒకనాడు పంతులుగారు దాని అవసరాన్ని బళ్ళో చెబితే నేను అంతగా పట్టించుకోలేదు. కాని ఈనాడు గంగన్న, సుబ్బన్న జీవితాలు చూశాక దాని అవసరం ఎంత ఉందో అర్థం చేసుకున్నాను. అందుకే నా పుట్టినరోజు సందర్భంగా వాళ్ళ కుటుంబాన్ని వెట్టి చాకిరీ నుంచి విముక్తులు చేయాలనే వరాన్ని కోరుకోదలిచాను. నా కోర్కె తప్పయితే ఆ బెత్తంతో నన్ను మీ ఆవేశం చల్లారేదాకా కొట్టడంలో ఎంతమాత్రం వెనుకాడవద్దని ప్రార్థిస్తున్నాను. (అని వీపు వంచుతాడు)

ప్రసాద్ : (బెత్తం దూరంగా వేసి రాజు మెళ్ళో దండవేసి ఎత్తుకొని) చిన్నవాడవైనా ధైర్యంగా నిజాన్ని చెప్పి పరోక్షంగా చెళ్ళున కొట్టినందుకు నేనెంతో సంతోషిస్తున్నాను. గర్విస్తున్నాను.

విశ్వం : నీలాంటి కుర్రాళ్ళు ఇలా అడిగి లోకజ్ఞానం తెచ్చుకుంటే మీచదువుకూ సార్థకత వస్తుంది.

ప్రసాద్ : ఏమిటోయ్ విశ్వం; భాషే మార్చేశావు !

విశ్వం : బావగారు ! మీ అంతటి గొప్పవారే మారిపోయినప్పుడు నాలాంటి సామాన్యుడికి ఆ కృత్రిమ భాష ఎందుకండీ ?

ప్రసాద్ : భలేవాడివోయ్. మళ్ళీ ఒక దెబ్బ వేశావూ ? నిన్ను కదిలించడం నాదే తప్పు.

రత్నం : అంతా కలిసి నన్నేగా వంచేది (లోపలికి పోతుంది)

ప్రసాద్ : విశ్వం ! ఎందరు మారినా మీ అక్కగారు మారదు. కాస్త ఆమెను మార్చరాదూ ?

విశ్వం : మీరు నిజాయితీతో నిలబెడితే అంతా మారతారు బావగారూ ! అరే రాజూ ! పుట్టినరోజు పండుగను ఒక ఒట్టి కాలక్షేపపు వేడుకగా కాక — గట్టి ప్రయోజనంగా మార్చినందుకు. అక్కయ్యా ! ఆ స్వీట్లు ఇలా అందుకో ! (రత్నం స్వీట్లు తెస్తుంది. అది విశ్వం తీసుకోబోతాడు)

రాజు : స్వీట్లు మీకు నాకు కాదు మామయ్యా ఇవ్వాల్సింది. నా చిన్నకోర్కెను మన్నించినందుకు నేనే మీకివ్వాలి అని (ఒక్కొక్కరి నోట్లో స్వీట్లు కుక్కి గంగన్న సుబ్బన్నలకు తప్ప, తల్లి తండ్రీ మామలకు నమస్కరిస్తూ ఉండగా) . . .

*(తెర)*

## అభ్యాసవేదిక

*1.* అర్థాలు :

కృత్రిమం = స్వాభావికం కానిది; వెట్టి = బానిస; బాకీ = అప్పు; చాకిరి = సేవ; కుక్కు = బలవంతంగా తిను; జీతం చేయు = ఉద్యోగం/పని చేయు.

*2.* ఈ పాఠంలో చదువురానివాళ్ళు ఏ విధంగా మాట్లాడతారో సుబ్బన్న, గంగన్న సంభాషణల్లో గమనించవచ్చు. వారు మాట్లాడిన భాషలో పదాలను చదువుకున్న వారు ఏ విధంగా మాట్లాడతారో కొన్ని ఉదాహరణలు ఇచ్చాం. దాని ఆధారంగా మిగిలిన ఖాళీలను పూరించండి :

ఏంటి – ఏమిటి

సినబాబు – చినబాబు

యాడి – ఎక్కడి

సదువు -

ఇంట్ల -

శనా -

కొట్టాలె -

గొడ్లకాడి -

బువ్వ -

*3. ఈ నాటకంలో వచ్చిన ప్రాంతీయపదాలు మీ ప్రాంతంలో ఏ అర్థంతో ఉన్నాయో విద్యార్థులకు వివరించాలి :*

నమూనా :- తట్ట

కోస్తా ప్రాంతంలో - గంప

రాయలసీమ ప్రాంతంలో - పళ్ళెం

తెలంగాణా ప్రాంతంలో - ఇనుపగంప

*4. కింద ఇచ్చిన పదాలను సొంత వాక్యాలలో రాయండి :*

1. దిద్దబెట్టు
2. ఖర్చుపెట్టు
3. తలంటిపోయు
4. కడుపుమాడ్చుకొను
5. గుడ్లు మిటకరించు

*5. కింది ప్రశ్నలకు జవాబు రాయండి :*

1. సుబ్బన్న ఏం చేస్తుండేవాడు ?
2. సుబ్బన్న ఎవరు చేసిన బాకీ తీరుస్తున్నాడు ?
3. పుట్టినరోజు పండగ ఎవరిది ?
4. ప్రసాద్ సుబ్బన్నను ఏం చేయబోయాడు ?
5. రాజు వాళ్ళ నాన్నతో ఏం మాట్లాడాడు ?

6. *కింది వాక్యాలలోని ఖాళీలను సరయిన పదాలతో పూరించండి :*

1. నా పుట్టినరోజు సందర్భంలో నీకు                    తెచ్చాను.
2. నువ్వు ________ తో లేచి కాఫీ అయినా తాగకుండా ________ చేస్తావు.
3. నాన్న ________ గింజ లియ్యలేదా ?
4. ________ పని చేస్తున్నావన్నమాట.

7. *కింద ఇచ్చిన వాక్యాలను ఒక్కటిగా రాయండి :*

నమూనా :- ఆ వైద్యశాల ఆ వీథివారికి ఉపయోగపడింది.
అంతే కాదు ఇరుగుపొరుగు ఊళ్ళవాళ్ళకు కూడా.

ఆ వైద్యశాల ఆ వీథివారికే కాక ఇరుగుపొరుగు ఊళ్ళవాళ్ళకు కూడా ఉపయోగపడింది.

1. సుబ్బారావు బాంకు నుంచి డబ్బు అప్పు తీసుకున్నాడు. అంతేకాదు ఊళ్ళోవాళ్ళందరి దగ్గరకూడా.
2. సుమ టీచరుగారితో పోట్లాడింది. అంతేకాదు క్లాసులోనుంచి బైటికి వెళ్ళిపోయింది.
3. ఆ సన్యాసి ఒక వైద్యశాలను కట్టించాడు. అంతేకాదు అందులో ఉచితంగా వైద్యం చేసే ఏర్పాట్లు కూడా చేశాడు.

8. *ఈ పాఠంలో సుబ్బన్న, గంగన్న, విశ్వం మాట్లాడిన భాషను గమనించండి. తరువాత ఈ అభ్యాసాన్ని చేయండి :*

నమూనా :- ఇపుడ్యాడ సదువులు.
ఇప్పుడెక్కడి చదువులు.

1. ఇంట్ల శనా పనుండాది.
2. మీకు తెలవదు సినదొరా !
3. కాళ్ళకు బురద ఏమియు అంటలేదు.
4. స్నానము చేసియే బయలుదేరితివి.
5. విన్నాయియ్యాల సేతగాక నేను కట్టెంకుబోలేదు.

**9. ఉపాధ్యాయులకు సూచనలు :**

1. ఆంధ్రప్రదేశ్ పటాన్ని చూపుతూ మూడు ప్రాంతాలను చూపిస్తూ ఏయే ప్రాంతాలలో ఏ వ్యవహారం మాట్లాడతారో స్థూలంగా పరిచయం చేయాలి.
2. ఈ పాఠంలో వచ్చే మాండలికపదాలను గురించి ముందుగా విద్యార్థులకు బోధించాలి. ఆధునిక ప్రమాణభాషలో ఏమంటారో సూచించాలి.

   ఉదా :- సదువు – చదువు; శనా – చాలా
3. ఈ పాఠంలో వచ్చిన మాండలిక పదాలను పట్టికగా రాయించాలి.
4. ఈ పాఠంలో వచ్చిన ప్రాచీన భాష వ్యవహారం ఎట్లా ఉందో (విశ్వాం పాత్ర ఉపయోగించిన భాష) వివరించాలి.
5. మాండలిక భాషలో ఉండే పర్యాయరూపతకు ఇచ్చిన అభ్యాసం (4) ఆధారంగా స్థానికంగా ఉండే వ్యవహారంతో మరికొన్ని పదాలను వివరించాలి.

## వ్యాకరణం

**విభక్తులు :**

ఈ వాక్యాలను గమనించండి :

1. అక్క పిలుస్తోంది.
2. నేను నెహ్రూగారిని చూశాను.
3. రవి అక్కతో బడికి వెడుతున్నాడు.
4. ఈ విషయం మీ అమ్మాయికి చెప్పండి.
5. నేను ఇంటి దగ్గర నుంచి వస్తున్నాను.
6. కుర్చీలో ఎవరూ లేరు.

ఈ వాక్యాలలో కింద గీసిన గీతలుగల అక్షరాలను తొలగిస్తే ఆ వాక్యాల అర్థం తెలియదు. వాక్యంలో ఉండే పదాల మధ్య సంబంధాన్ని ఆ అక్షరాలు కలిగిస్తున్నాయి. అప్పుడే వాక్యం అర్థం అవుతుంది. లేకపోతే ఆ వాక్యం అర్థం కాదు.

పదాల మధ్య సంబంధాన్ని తెలిపే ఈ అక్షరాలను విభక్తులంటారు. తెలుగుభాషలో వాక్యంలో ఉండే పదాల సంబంధాన్ని ఏడు విధాలుగా – ఏడు విభక్తులతో తెలుపుతారు.

ప్రథమా విభక్తి – సాధారణంగా కర్తృపదంగా ఉండే నామవాచక రూపమే దీన్ని తెలుపుతుంది. సంస్కృత పదాలు తెలుగులో చేరినప్పుడు 'డు, ము, వు'–లు చేరుతాయి. లు బహువచనం.

ద్వితీయా విభక్తి – ని/ను

తృతీయా విభక్తి – తో

చతుర్థీ విభక్తి – కు/కి

పంచమీ విభక్తి – నుంచి

షష్ఠీ విభక్తి – సాధారణంగా కర్తృపదంగా ఉండే రూపమే షష్ఠీవిభక్తిని తెలుపుతుంది.

సప్తమీ విభక్తి – లో

ప్రథమా విభక్తి తప్ప, మిగిలిన విభక్తులు చేరేముందు నామవాచకాలలో, సర్వనామాలలో 'ఇ, టి, ఇంటి, తి, అ' అనే అక్షరాలు చేరుతాయి. ఈ అక్షరాలను ఔప విభక్తికాలు అని పిలుస్తారు. ఇవి చేరిన పదాలను ఔప విభక్తిక రూపాలు అని అంటారు. ఈ విషయం అర్థమయ్యేందుకు ఈ ఉదాహరణలు గమనించండి.

1. ఇవాళ ఊరికి వెళ్ళాలి.
2. ఆమె గోతిలో పడింది.
3. రేపటి నుంచి బడికి రావాలి.
4. పదింటికి బడిగంట కొడతారు.
5. పిల్లలు నీళ్ళలో నానకూడదు.

ఈ వాక్యాలలో కింద గీతగీసిన పదాలు ఔప విభక్తిక రూపాలు చేరినవి.

ఇవికాక ఎవరినైనా పిలిచేప్పుడు పదం చివర అక్షరాన్ని దీర్ఘం చేసి పలుకుతాం

అక్కా !

తమ్ముడూ !

అంతేకాక పదాలకుముందు ఓ, ఓరి, ఓసి అనే అక్షరాలు పిలిచేప్పుడు చేర్చి కొన్ని సందర్భాల్లో పలుకుతారు. వీటిని సంబోధన విభక్తులు అంటారు. వీటిని ఉపయోగించిన ఉదాహరణలు గమనించండి.

ఓ రామా !

ఓరీ రంగయ్యా !

ఓసి వనజా !

## అభ్యాసం

**కింది వాక్యాలలోని విభక్తులను గుర్తించండి :**

1. రాముడు దశరథుని కొడుకు.
2. మేము సెలవులో హైదరాబాదుకు వెళ్ళాం.
3. అపాయాన్ని ఉపాయంతో తప్పించుకోవాలి.
4. దేశ భాషలలో తెలుగు లెస్స.
5. ఆవు పాలను ఇస్తుంది.
6. పంతులుగారు నీతిని బోధిస్తారు.
7. ఓ గౌరీ ఇటురా !
8. ఆయన పెన్నుతో రాస్తారు.
9. మీరు డాక్టర్‌గారికి వందరూపాయలు ఇచ్చారు.
10. నేను ఇంటిదగ్గర్నించి వస్తున్నాను.

—o—

# 21. సుభాషితాలు

## (కంఠస్థం చేయాల్సిన పద్యాలు)

[' సు ' అంటే ' మంచి ' అని అర్థం. ' భాషితం ' అంటే మాట. సుభాషితాలు అంటే మంచిమాటలు. సంస్కృత భాషలో ' భర్తృహరి ' అనేకవి ' సుభాషిత త్రిశతి ' అనే పేరుతో నీతి, శృంగార, వైరాగ్య శతకాలను రచించాడు. నీతిబోధకమైన ఈ గ్రంథాన్ని ఏనుగు లక్ష్మణ కవి, ఎలకూచి బాలసరస్వతి, పుష్పగిరి తిమ్మన అనే ముగ్గురు కవులు తెలుగులోకి అనువదించారు. ఈ పద్యాలు ఏనుగు లక్ష్మణకవి అనువాదం చేసినవి.]

పద్యాలలో ముఖ్యమైన పదాలు :

| | | | |
|---|---|---|---|
| కుసుమ గుచ్ఛం | వెండి | గోప్యం | కలుషం |
| పొసగు | సోముడు | ఆపన్నుడు | చిత్తవిస్ఫూర్తి |
| మహిత గతులు | ఒడలు | లేవడి | సాధుసంగం |
| మస్తకం | తాపమొందు | సూక్తి | తరువు |
| వనం | అఘం | ధీజడిమ | నింగి |
| జీర్ణభావం | ఉపకర్తలు | ఛాయ | బుధులు |
| జనిత | సజ్జనులు | మైత్రి | కుజనుడు |
| భూజం | | | |

* * *

1. కుసుమ గుచ్ఛంబునకుఁ బోలెఁ బొసగు శౌర్య
మానవంతున కివిరెండు మహిత గతులు
సకల జన మస్తక ప్రదేశములనైన
వనము నందైన జీర్ణభావంబు గనుట.

**అర్థాలు :-** కుసుమగుచ్ఛంబు = పూగుత్తి; పొసగు = తగియుండు; శౌర్య = పరాక్రమ; మహిత = ఉత్తమమైన; గతులు = మార్గములు; మస్తక = తల; వనము = అడవి లేదా తోట; జీర్ణభావంబు = నశించిపోవటం.

**భావం :-** పూలగుత్తి అందరి తలలమీద ప్రకాశించటమో లేదా వనంలోనే రాలిపోవటమో జరుగుతుంది. అట్లాగే పరాక్రమవంతుడైన, అభిమానమున్న వ్యక్తికి రెండు ఉత్తమగతులు ఉంటాయి.

2. ఖండితంబయ్యు భూజంబు వెండిమొలచు
క్షీణుడయ్యును నభివృద్ధిఁ జెందుసోముఁ
డివ్విధమున విచారించి యొడలుదెగిన
జనములకుఁ దాపమొందరు సాధుజనులు.

**అర్థాలు :-** ఖండితము = నరుకబడిన; భూజము = చెట్టు; వెండి = మరల; క్షీణుడయ్యు = నశించికూడా; సోముడు = చంద్రుడు; విచారించి = ఆలోచించి; ఒడలు = శరీరం; తాపమొందరు = (తాపము + ఒందరు) బాధనొందరు.

**భావం :-** చెట్టును నరికితే మళ్ళీ మొలుస్తుంది. చంద్రుడు నశించినా మళ్లీ అభివృద్ధి చెందుతాడు. శరీరం నశించినా మంచివారు బాధపడరు.

3. అఘము వలన మరల్చు, హితార్థు కలితుఁ
జేయు, గోప్యంబు దాఁచు, బోషించు గుణము
విడువఁడా పన్ను, లేవడవేళ నిచ్చు;
మిత్రుఁడీ లక్షణంబుల మెలఁగు చుండు.

**అర్థాలు :-** అఘము = పాపం; హితార్థము (హిత + అర్థము) = మంచిపని; గోప్యం = రహస్యం; ఆపన్నుడు = ఆపదలో ఉన్నవాడు; లేవడి = దారిద్ర్యం; మెలగు = ప్రవర్తించు.

**భావం:**— స్నేహితుడు పాపకార్యాలనుండి మనదృష్టిని మళ్లిస్తాడు; మంచిపనులు చేయిస్తాడు; రహస్యాన్ని దాచిపెడతాడు. మంచి గుణం నేర్పుతాడు. ఆపదలో ఉన్నపుడు వదలిపెట్టడు. లేనపుడు (దారిద్ర్యంలో ఉన్నపుడు) సాయంచేస్తాడు.

4. సత్యసూక్తి ఘటించు, ధీజడిమమాన్చు;
గౌరవమొసంగు; జనులకు కలుషమడచు
కీర్తి ప్రకటించు; చిత్త విస్ఫూర్తి చేయు
సాధుసంగంబు సకలార్థ సాధనంబు.

**అర్థాలు :**— సూక్తి = మంచిమాట; ఘటించు = కలిగించు; ధీజడిమ = బుద్ధిమాంద్యం; కలుషం = పాపం; కీర్తి = గౌరవం; చిత్తం = మనస్సు; విస్ఫూర్తి = వికాసం; సాధుసంగంబు = మంచివారితో స్నేహం.

**భావం :**— మంచివారి స్నేహం సత్యసంధులుగా చేస్తుంది. బుద్ధిమాంద్యం పోగొట్టుతుంది. గౌరవాన్ని కల్గిస్తుంది. పాపాన్ని పోగొడుతుంది. కీర్తిని వ్యాపింపచేస్తుంది. మనోవికాసాన్ని కల్గిస్తుంది.

5. తే.గీ. తరువు లతిరస ఫల భార గురుతగాంచు
నింగి వ్రేలుచు నమృత మొసంగు మేఘుఁ
డుద్ధతులుఁగారు బుధులు సమృద్ధి చేత
జగతి నుపకర్తలకు నిది సహజగుణము.

**అర్థాలు :**— తరువులు = చెట్లు; ఫలభార = పండ్ల బరువుచే; నింగి = ఆకాశం; అమృతం = నీరు; ఉద్ధతులుగారు = గర్వం పొందరు; బుధులు = పండితులు; సమృద్ధి = సంపద; జగతి = లోకం; ఉపకర్తలు = మేలు చేసేవారు.

**భావం:**— రసవంతాలైన పండ్ల బరువును చెట్లు మోస్తాయి. ఆకాశంలోని మేఘం నీటినిస్తుంది. పండితులు గర్వము పొందరు. లోకంలో ఇతరులకు మేలు చేసేవారికిది సహజగుణం.

**2. కింది పదాలకు గల వేర్వేరు అర్థాలను గమనించండి, నేర్చుకోండి.**

1. గతి = మార్గం, దిక్కు, ఉపాయం
2. వనం = అడవి, నీరు, ఉద్యానవనం
3. వెండి = మరల, ఒక లోహం
4. విచారించి = ఆలోచించి, దుఃఖించి
5. అర్థం = కొరకు, డబ్బు, పదాని కర్థం
6. గుణం = నడవడిక, అల్లెతాడు
7. మిత్రుడు = స్నేహితుడు, సూర్యుడు
8. అమృతం = నీరు, సుధారసం
9. తాపం = వేడి, బాధ
10. ఛాయ = నీడ, ఛాయాదేవి (సూర్యుని భార్య), ప్రతిబింబం

**3. కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి :**

1. శౌర్యం ×
2. సాధుజనులు ×
3. మిత్రుడు ×
4. సత్యం ×
5. గౌరవం ×
6. కీర్తి ×
7. కుజనుడు ×
8. దినపూర్వభాగం ×

**4. కింది మాటలను సొంత వాక్యాలలో ఉపయోగించి రాయండి :**

1. జీర్ణభావంబుగను
2. తాపమొందు
3. కలుషమడచు
4. సాధుసంగంబు

**5. కింది ప్రశ్నలకు సమాధానాలు రాయండి :**

1. శౌర్యవంతునికి గల ఉత్తమ మార్గాలేవి ?

9. కింది పదాలలోని మొదటి అక్షరాలు తొలగించి ఎదురుగా రాయండి. దానికి వేరే అర్థం వస్తుంది. ఆ అర్థం రాయండి. ఇలాంటి పదాలను మరికొన్నింటిని రాయండి :

ఉదా :- 'రాబడి' ఇందులో మొదటి అక్షరం 'రా' తొలగిస్తే 'బడి' అవుతుంది. అంటే పాఠశాల అని అర్థం.

1. లక్షణం ________ 5. కలత ________
2. సాధనం ________ 6. సందేహం ________
3. గౌరవం ________ 7. గోపురం ________
4. ఆకారం ________ 8. మరణం ________

10. విద్యార్థులకు సూచనలు :
   1. సుభాషిత పద్యాలను కంఠస్థం చేయండి.
   2. మరికొన్ని సుభాషిత పద్యాలు చదవండి. నీతిని గ్రహించండి.

11. ఉపాధ్యాయులకు సూచన :
   1. విద్యార్థులు పద్యాలు వల్లెవేయటం పోటీలు నిర్వహించండి.
   2. పద్యపఠన పద్ధానాన్ని అలవాటు చేయండి. పఠన సమయంలో వాగ్దోషాలు సవరించండి.
   3. కొత్త పదాలకు అర్థాలను నిఘంటువును చూసి, తెలుసుకొనేటట్లు విద్యార్థులకు అలవాటు చేయండి. పదజాలాభివృద్ధికి తోడ్పడండి.
   4. భాషాక్రీడలు నిర్వహించండి.

—o—

కవితాశారద
కలవరపడు
కలిమి
కల్పవృక్షం
కలుషం
కళ
కళాఖండం
కళారూపం
కసరత్తు
కానివారు
కార్మికులు
కార్యకలాపాలు
కాలగర్భము
కిస్తీ
కీడు
కుజనుడు
కుడువు
కుత్సితుండు
కుతూహలం
కుదించుకుపోవు
కుంభం
కుదిరిపోవు
కుదుపు
కులవృత్తి
కుసుమ గుచ్ఛం
కుంటుపడు
కూలిపోవు
కేరింతలు కొట్టు
కొనసాగించు
కొఱగామి
కొల్లలు
క్రమశిక్షణ
క్రీడాకారిణి
క్రుంగు
క్రుద్ధుడు
క్రూరత్వం
క్లిష్టం

ఖ

ఖరీదు
ఖర్చుపెట్టు

గ

గడి
గడ్డుసమస్య
గమ్మత్తు
గంగానమ్మ
గంతులేయు
గాయపడు
గారెలు
గాంభీర్యత
గిరిజనులు
గుంజుకుంటు
గొడవ
గొగ్గులైన
గోప్యం
గృహవిజ్ఞానం

ఘ

ఘటన
ఘనకార్యం
ఘనత

చా

చాంగ్‌లు
చింత బరికెలు
చిక్కిపోవు
చిత్తవిస్ఫూర్తి
చిత్రపటం
చిత్రీకరించు
చివాలున
చిహ్నము
చీకటితో లేచు
చెలిమి
చేతన
చొప్పకర్ర

ఛా

ఛాయ

జ

జగతి
జనిత
జబ్బు
జప్తు
జయప్రదం
జాలి
జీతం గింజలు
జీతం చేయు
జీర్ణభాండము
జీవనం
జీవనకేంద్రం
జీవనాడి
జీవనాధారం
జీవరాసులు

జీవావరణం

డ

డప్పు

త

తండోపతండంబు
తగవులాడు
తథ్యము
తమ్మ
తటాకం
తనుజాలు
తపన
తరుగుట
తరువు
తపించు
తక్షణం
తాకెడి
తాత్సారం
తాపమొందుట
తారసపడు
తీరం
తీరని కళంకం
తుఫాను
తూలి
తేటతెల్లంచేయు
తొన

ద

దంపతులు
దారిద్ర్యం
దిద్దబెట్టు
దిశ
దెబ్బతిను
దొడ్డగ
ద్యోతకం
ద్రవం

ధ

ధ్వంసం
ధాత్రి
ధీజడిమ

న

నకలు
నలుసు
నడం
నరవాసన
నాణ్యత
నిమిత్తం
నింగి
నిరంతరం
నిర్బంధం
నిర్వహించు
నిరాశ
నిర్మాణం
నిర్మూలన
నిరోధించు
నివాసప్రాంతం
నిస్స్వార్థం
నీటిపారుదల
నేత్రావధానం
నేల కూలు
నైపుణ్యం

ప

పంచిపెట్టు
పంజరం
పంజా
పదచలనం
పథం
పదిలంగ
పన్ను
పరతత్త్వం
పరమార్థం
పరిగణించు
పరిధి
పరిపాటి
పరిమళం
పరిమితమగు
పరిరక్షణ
పరిశీలనాధ్యేయం
పరిశోధన
పరివర్తన
పరిశ్రమ
పరుగులుతీయు
పరులకు
పర్యవేక్షణ
పవిత్రం
పాటవం
పాత్రోచితం
పాశ్చాత్యులు
పాపు
పుణ్యక్షేత్రం
పునరుక్తి

పులకాంకితులు
పుల్ల
పూడిక
పూరిత
పెరడు
పెయ్య
పెంపొందించు
పొట్టగడుపుకొను
పొట్టపోసుకొను
పొద
పొసగు
పొంగు
పోటుపోరు
పోరాటం
ప్రకృతి
ప్రఖ్యాతి
ప్రగతి
ప్రణాళిక
ప్రతిబింబం
ప్రధానోపాధ్యాయులు
ప్రబంధ పద్ధతి
ప్రయోగశాల
ప్రశంస
ప్రశాంతత
ప్రస్తావించు
ప్రస్తుతించు
ప్రసూతి
ప్రాచుర్యం
ప్రాణికోటి
ప్రాతినిధ్యం
ప్రారంభించు
ప్రావీణ్యం
ప్రోత్సాహం

బ

బట్టబయలుచేయు
బందెల దొడ్డి
బాకీ
బాస
బుధులు
భీకరప్రమాణం
భువి
భూగ్రహం
భూజము
భౌతికం

మ

మంత్రాంగం
మచ్చుతునక
మజిలీ
మస్తకం
మతాధిపతులు
మధ్యతరగతి
మన్నన
మరుగు
మరుగుపఱచు
మహనీయుడు
మహానుభావుడు
మహోన్నతం
మహితగతులు
మహోపకారం
మాత
మాధురి
మానవతాశక్తి
మానవత్వం
మానవాళి
మాయని మచ్చ
మార్దవం
మాల
మెరుపు
మెళకువ
మేధావులు
మేర
మైత్రి
మొదలుపెట్టు
మొహం
మోడు
మోతాదు
మౌళికం

య

యాచించు

ర

రద్దీ
రసాయనికాలు
రాజధాని
రీతి
రుమాలు
రూపకల్పన
రొద

ల

లవణం
లాలిత్యం

లెక్కచేయు
లేవడి
లోటు

వ

వనం
వర్తకులు
వసారా
వ్యక్తిత్వం
వంతు
వాగ్దానం
వాగు
వాదన
వాణి
వికాసం
విధ్వంసం
విరిసినంత
విలాస వస్తువు
వివాదం
విశిష్టం
విశేషఫక్కీ
విశ్వం
విశ్వమానవత
విశ్వాసం
వృద్ధి
వృషభం
వెండి
వెటకారం
వెట్టిచాకిరి
వైచిత్రి
వైభవం
వ్యక్తిత్వం
వ్యవధి
వ్యవస్థ
వ్యాధి
వ్యాయామక్రీడ

శ

శస్త్రచికిత్స
శిరస్సు
శీర్ణమగు
శ్రీలు
శూన్యం
శోభ

స

సంజ్ఞ
సంగతి
సందడి
సంప్రదాయం
సంప్రదించు
సంప్రదింపు
సంబోధించు
సంభ్రమం
సాంకేతిక విద్య
సాంగత్యం
సాంస్కృతిక విద్య
సదుపాయం
సజ్జనులు
సన్మానించు
సన్నిభులు
సమము
సమర్థించుకొను
సమయస్ఫూర్తి
సమాదరంబు
సమీపం
సలుపు
స్వప్నం
స్వస్థలం
సాధుసంగం
సాధ్యశూరులు
సాఫీ
సామాన్లు
సాముదాయిక
సారూప్యత
సాక్షాత్కరించు
స్థానికులు
స్థాపించు
స్వాతంత్ర్యం
స్థిరపడు
స్వీకరించు
సుస్తీ
సూక్తి
సృజనాత్మకం
స్ఫురించు
స్ఫూర్తి
సేవలందించు
సేవాసంఘం
సోకు
సోముడు

ల

లావు

హ

హంస
హృదయం

—o—

అంటరానితనం అమానుషం



మీ కుటుంబ సౌఖ్యానికి



అమ్మాయి చదువు ముఖ్యం





కంటిచూపుకు
ఆకు కూరలు తినండి




మీ పిల్లలకు
టీకాలు
వేయించండి



రోగాలనుండి
కాపాడండి

ప్రభుత్వంవారిచే ఉచితంగా పంపిణీ చేసిన పుస్తకం

# అకారాది క్రమంలో పదపట్టిక

| అ | ఆదరణ | ఉత్తేజం |
| --- | --- | --- |
| అంగరక్షకులు | ఆదరభావం | ఉద్యమం |
| అంతమగు | ఆదర్శపౌరులు | ఉద్యుక్తుడు |
| అంతరిక్షం | ఆనవాయితీ | ఉపకరించు |
| అంతరింపచేయు | ఆపన్నుడు | ఉపకర్తలు |
| అంత్యస్థానం | ఆయుస్సు | ఉర్వి |
| అఖాతం | ఆలాపించు | ఉపకేంద్రము |
| అగ్నిపరీక్ష | ఆరాధించు | ఉపరిసౌకర్యం |
| అఘం | ఆరాటము | ఉరుకు |
| అడపాదడపా | ఆర్థిక పరిస్థితి | ఉల్లాసం |
| అతిథి | ఆవరణ | ఉష్ణమండలం |
| అతుకు | ఆవేదన | ఉషారు |
| అధ్యాత్మిక | ఆశీర్వాదం | ఊ |
| అధికారి | ఆశీర్వదించు | ఊరేగు |
| అనన్యసామాన్యం | ఆశ్చర్యచకితులు | ఎ |
| అనుగ్రహం | ఆహారం | ఎరుగని |
| అపురూపం | ఆహ్వానించు | ఏ |
| అభినయించు | ఇ | ఏర్పాటు |
| అభిరుచి | ఇంచుక | ఒ |
| అమాయకుడు | ఇతిహాసాలు | ఒడలు |
| అమృతం | ఇంపు | ఒడిసిపట్టు |
| అర్ధనారీశ్వరుడు | ఇబ్బందిపడు | ఒప్పందం |
| అరిసె | ఇమిడిపోవు | ఒరవడి |
| ఆ | ఇరుగుపొరుగు | ఒళ్లు |
| ఆకతాయి | ఉ | క |
| ఆకర్షితులు | ఉచ్చు | కంపు |
| ఆగ్రహం | ఉన్నతవర్గం | కనకం |
| ఆగ్రహించు | ఉత్సవం | కమలం |

2. సాధుజనులు ఎవరికోసం బాధ[illegible]దరు ? ఎందుకు ?
3. మంచి స్నేహితుడేమి చేస్తాడు ?
4. మంచివారి స్నేహం వల్ల ప్రయో[illegible]జనమేమిటి ?
5. ఉపకర్తలకు సహజగుణం ఏది ?
6. కుజన, సజ్జనుల మైత్రి ఏరకం[illegible] ఉంటుంది ?

6. కింది వాక్యాలను పూరించండి :

1. పూగుత్తి జనుల ________ పై [illegible]ందును లేదా వనములోనె ________ పోవును.
2. మంచి స్నేహితుడు ______ నున్నవారిని విడచిపెట్టడు.
3. సత్పురుషుల స్నేహం ____ __ ను పొగొట్టును.
4. పండితులు సంపదచే ________ నొందరు.
5. సజ్జనుల మైత్రి ________ వలె క్రమ క్రమంగా ________ అవుతుంది.

7. కింది పదాలలోని అక్షరాలతో వీలైనన్ని అర్థవంతమైన పదాలు రాయండి :

1. భాగ్యనగరం
2. ల[illegible]త కళాతోరణం

8. కింది పదాలు వరుసక్రమంలో లేవు. [illegible]టిని అర్థవంతమైన క్రమంలో కూర్చి వాక్యం రాయండి :

1. సాధనంబు, సంగంబు, సకలా[illegible]ాదు;
2. మొనలగు, [illegible], మేఘుడు, [illegible]ము, అమృత;
3. చేత, సమృద్ధి, గాదు, ఉద్ధతులా[illegible] బుధులు;
4. మైత్రి, కుజన, పోలిక, [illegible], వెనపూర్వ, పరభాగ, సజ్జనుల, జనితమైన;

6. తే.గీ. మొదలఁ జూచినఁ గడు గొప్ప పిదపఁ గురచ;
నాది కొంచెము తర్వాత నధిక మగుచు
తనరు ; దిన పూర్వపర భాగజనితమైన
ఛాయ పోలిక; కుజన సజ్జనుల మైత్రి.

అర్థాలు :— ఆది = మొదట; దినపూర్వం = ఉదయం; దినపరభాగం = సాయంత్రం; ఛాయ = నీడ; పోలిక = వలె; కుజనుడు = చెడ్డవాడు; సజ్జనుడు = మంచివాడు; మైత్రి = స్నేహం; జనిత = పుట్టిన.

భావం :— చెడ్డవారితో స్నేహం ఉదయం (సూర్యుని) నీడవలె మొదట పొడవుగా ఉండి క్రమక్రమంగా తగ్గుతుంది. మంచివారితో మైత్రి సాయంత్రపు నీడలాగ మొదట చిన్నదిగా నుండి క్రమక్రమంగా అధికమవుతుంది. అంటే చెడ్డవారు ఎంత తొందరగా దగ్గరౌతారో అంత తొందరగా దూరమవుతారు. మంచివారు క్రమక్రమంగా దగ్గరై స్థిరంగా స్నేహంతో ఉంటారు.

## అభ్యాసవేదిక

*1. కింది పదాలకు అదే అర్థం ఇచ్చే మరి రెండు పదాలు రాయండి :*

1 కుసుమం = (1) (2)
2. మస్తకం = (1) (2)
3. భూజం = (1) (2)
4. సోముడు = (1) (2)
5. ఒడలు = (1) (2)
6. సూక్తి = (1) (2)
7. అఘం = (1) (2)
8. చిత్తం = (1) (2) ________
9. జగతి = (1) (2)
10. ఉపకర్త = (1) (2) ________